



| | | | |
|---|---|---|---|
| మలుపు (నవల) | * | ముద్దంశెట్టి హనుమంతరావు | 1' |
| నిర్ణయం (పెద్దకథ) | * | పాలడుగు వెంకటేశ్వరరావు | 7' |
| ఉత్తరకుమారి | * | శివల జగన్నాథరావు | 9 |
| పాతకథ | * | రుక్మిణి | 1 |
| బస్రా నివాసి హసన్-2 | * | (అరేబియన్ రాత్రి కథ) | 11 |
| కాటుతిన్న మనిషి | * | పి. విక్టర్ రమణ | 11 |
| యువ దాంపత్యంలో నవ చైతన్యం | * | వడ్లమన్నాటి లక్ష్మీప్రసన్న | 1 |
| మేం చేసిన తప్పు మీరూ చేస్తారా ? (సీరియల్) | * | అవసరాల రామకృష్ణారావు | 13 |
| వర్షంలో ఒక సాయంత్రం | * | మల్లాది లక్ష్మీనరసింహం | 14 |
| అప్పిచ్చువాడు | * | ప్రకాశరావు | 15 |
| నరళాదేవి పొదుపు | * | ఎన్. పురుషోత్తమాచార్య | 157 |
| జోస్యం | * | ఆదూరి వెంకట సీతారామమూర్తి | 169 |
| కలిమి—కల్లోలం | * | యామినీ సరస్వతి | 17. |
| ఒకేమాట ఒకేబాట | * | ఇసుకపల్లి లక్ష్మీ నరసింహశాస్త్రి | 183 |
| చక్రపాణి (సీరియల్) | * | కావిలిపాటి విజయలక్ష్మి | 18 |


ముఖచిత్రం జలపూర్ణ

చిత్రకారుడు వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ 36-00

దీపావళి సంచికతో రూ 42-00

యువ, హైదరాబాదు-500001



ఉగాది జేగంట ముఖచిత్రంతో అత్యంత ఆకర్షణీయంగా వెలువడిన ఉగాది (ఏప్రిల్) సంచిక మమ్ములను అమితంగా ఆకట్టుకొంది అరది కన్పిస్తేబాలు ఎలాగైనా వళ్లో వేసుకొని అనుభవించాలి అని ఆలోచించే ప్రభాకరంలాంటి వాళ్ళకి అలా జరగాల్సిందే అని అన్పించింది వర్మగారి 'వేడి' కథ చదివాక, ఈ కథ వేడిగా కాక వాడిగా వుంది త్యాగం కథలో మాధవరావును తలచుకొని ఎంతో నవ్వుకొన్నాం ఇకపోతే కొంపెల విశ్వంగారి 'కాళ్ళు', వాణిశ్రీగారి 'సిఫార్స్', గాజులు' 'మృత్యువు' మొదలగు కథలు ఎంతో ఉదాత్తంగా వాస్తవానికి చేరువలో ఉన్నవి మల్లిక్ కలంనుండి వెలువడిన ఆ 'పరిష్కృతం' నవల ఈ సంచికకు హైలైట్ చక్రపాణి సీరియల్ రాను రాను మరీ బావుంటోంది

మూడు రూపాయలకే ఇంత మంచి కథలను అందజేస్తూ మమ్మానందపరుస్తున్నందులకు చాలా చాలా థాంక్స్.

—వి జె స్వామి,
వి సూర్యకుమారి,
భువనేశ్వర్-1.

## యువ చందా వివరములు

| | | |
|---|---|---|
| యువ సంవత్సర చందా | ... | రు 36-00 |
| దీపావళి సంచిక | ... | రు 6-00 |
| దీపావళి సంచిక రిజిష్టర్డు పోస్టుతో | ... | రు 8-00 |

గమనిక : చందాదారులు తమ చందా పంపేటప్పుడు పూర్తి చిరునామా పిన్ కోడ్ తో వ్రాయగోరుచున్నాము

యువ కార్యాలయం,
హైదరాబాదు--500 001

జూలై సంచికలో శ్రీ ఇ మైత్రేయసగారి

# దేవత (నవల)

ప్రచురించబడుతుంది

ఉగాది సంచిక వడ్డాది పాపయ్య గారి ఛేగంటతో మావద్ద చేరింది ముఖ చిత్రం ఎంతో ఆకర్షణీయంగా ఉండి కన్నుల పండుగ చేసింది ఇక కథ లన్నీ ఉగాది పండుగకు మీరు మాకు అందించిన మిఠాయిలు ఇందులోని 'మల్లిక్' నవల 'అపరిష్కృతం' బాలా బాగుంది కొత్తదనం కోరే పాఠకులకు ఈ నవల ఒక వెరైటీ నవల చదువుతున్నంతసేపూ కథలాగ అనిపించకుండా నిజంగా జరుగుతున్నట్లు అనిపించింది ఎంతో అపురూపంగా ఉన్న ప్రసన్న జీవితంలో మార్పురావడం కథలో పెద్ద మలుపు ముందు కథ ఎంత చలాకీగా నడిచిందో, ఆఖరున కన్నీరు తెప్పించింది ఇలాంటి థీమ్ ఉన్న నవల ఇదే మొదటిదేమో! ఇక కథల్లో ఇదోరకం దొంగతనం' 'కోతులు' కథలు బాగున్నాయి అరేబియన్ నైట్స్ కథలు పెద్దలకుకాక పిల్లలకి ఆకర్షణగా ఉన్నాయి. ఇక షార్ట్ స్టోరీస్ మీ యువకు ఇంకా మెరుగుపెడుతున్నాయి. ప్రతీ నెలా మమ్మల్ని ఆనందపరిచే యువకు నా ధన్యవాదములు

—జి. కాంత-జెంషెడ్‌పూర్, బీహార్.

గోద్రెజ్ నుండి

# క్రొత్త
# టర్కిష్ బాత్




## ఒక ఉన్నతమైన
## సబ్బు నమ్మలేని ధరలో కేవలం

# Re.1·00 (పన్నులు అదనం)

గోద్రెజ్ వారు మాత్రమే మీకు అంత తక్కువ ధరలో
ఎక్కువ నురుగు నిచ్చే ఎక్కువ నిలువ ఉండే
తాజాదనము నిచ్చె సువాసనతో ఉండే సబ్బును
అంద చేయగలరు

**గోద్రెజ్ వారి టర్కిష్ బాత్**

Interpub/GTB/1/75/TEL







# సిగ్నల్ ఫ్లూరైడ్ మాత్రమే దంతక్షయం, నోటిదుర్వాసన అరికట్టుతుందని నిరూపిస్తుంది.

**దంత పరిశుభ్రతకు అపూర్వమూలపదార్థము కలది**




**సిగ్నల్ ఫ్లూరైడ్ మాత్రమే నిదర్శనం కలది-**
**మీ దంతవైద్యుని అడగండి**

# యువ జూన్ సంచిక



గ్రీష్మ

ముఖచిత్రం
శ్రీ వడ్డాది పాపయ్య



పంతంటి సంసారాన్ని కాలదన్ని పరాయివాళ్ళ పంచనచేరి భంగపాటు చెందిన నవయువతి మనోవైకల్యానికి అమాయకురాలి హృదయంలో ఆకాశమంత ఆశ కల్పించి చివరికి ఆమెను అధోగతిపాలుచేసిన నవయువకుని కపట ప్రవృత్తికి చక్కని రూపకల్పన

**పవని నిర్మలప్రభావతి గారి నవల " దారులూ-గమ్యాలూ !"**

యువ కార్యాలయం, హైదరాబాద్-500001

మే నెల

# యువ

## భావపరిచయపోటీ

(బహుమతి పొందిన వ్యాఖ్య)



మహిళల సారథ్యం

మనుగడకు మరో మార్గం

పెచ్చెట్టి శ్రీరాములు హిల్ కాలనీ




సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 33 | మే, 1976 | సంచిక 5

భారతదేశం మొత్తానికి 1976–77 సంవత్సరపు బడ్జెటును 1976 మార్చి 15 న పార్లమెంటులో, ఆర్థికమంత్రి శ్రీ సి సుబ్రహ్మణ్యం ప్రవేశ పెట్టారు పాఠకులు యీ వ్యాసాన్ని చదివేనాటికి ఆ బడ్జెటును పార్లమెంటు ఆమోదించడం జరిగివుంటుంది

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, అంటే గత 29 ఏళ్ళకు, ఇలాటి బడ్జెటు ప్రతిపాదన జరగడం ఇదే మొదటిసారి గత సంవత్సరాల బడ్జెటులు ఏటేటా ఏదో రూపంలో అన్ని పన్నులనూ కొద్దో, గొప్పో పెంచుతూవుంటే యీ సంవత్సరపు బడ్జెటు, కొన్ని పన్నులను బాగానూ, కొన్ని పన్నులను కొంచెంగానూ తగ్గించి, సామాన్య కుటుంబీకులకూ, ఒక పాటి మధ్యతరగతి కుటుంబీకులకూ కొంత సహాయాన్ని కలిగించడమేకాక, పెద్ద ఆస్తిపరులు కట్టే పన్నుల గరిష్ఠ పరిమితిని తగ్గించి, అన్ని వర్గాలవారికీ ఎంతో కొంత బాధను తగ్గించింది ఇది చాలా సంతోషించవలసిన విషయం. ఇలాటి బడ్జెటు రావడానికి ప్రధానమంత్రి ప్రకటించిన 20-సూత్రాల ప్రణాళికయే కారణమని మా అభిప్రాయం. దీనికి, ప్రధానమంత్రిని అభినందిస్తున్నాము

20-సూత్రప్రణాళిక అమలులోకి వచ్చినప్పటినుంచీ, ఎమర్జెన్సీ అమలులోకి వచ్చినప్పటినుంచీ, దేశంలోని పరిస్థితి చాలా మారింది ప్రజల దృక్పథంలోనే మంచి మార్పువచ్చింది ప్రజలలో ఒకవిధమైన దీక్షాభావం అంకురించింది. ధరలు బాగా తగ్గినందున, సామాన్య ప్రజల కడగళ్ళు కొంతవరకు ఉపశమించాయి.

అయితే, ధరలు ఇంకా తగ్గవలసివుంది కార్మికులమధ్యనూ యజమానుల మధ్యనూ అన్యోన్యత బాగా ఏర్పడవలసివుంది. ప్రభుత్వోద్యోగులలో కార్య నిర్వహణ దీక్ష మరింత ఎక్కువ కావలసివున్నది. ఎమర్జెన్సీ ఇంకా కొన సాగితే, ప్రధానమంత్రి 20-సూత్రాలప్రణాళిక జయప్రదంగా అమలుజరగడమేకాక, దేశంలో స్థిరమైన ఆర్థికవ్యవస్థ ఏర్పడడమూ, పరిశ్రమలు చక్కగా సాగి ధరలు ఒక న్యాయమైనస్థాయిలో నిలబడడమూ జరుగుతుందని మా దృఢవిశ్వాసము.

ఇక బడ్జెటు మాట. ఈ సంవత్సరపు బడ్జెటు సంతోషించదగినట్టుగా వున్న మాట వాస్తవమే. కాని, రెండు, మూడు విషయాలలో ఆ బడ్జెటు ప్రతిపాదనలు మరికొంత సహాయకరంగా వుండవలసింది

ఇన్‌కంటాక్స్ ప్రతిపాదన కొంత సడలింపు జరగడం అవసరం ప్రస్తుతపు చట్టాన్నిబట్టి, ఏడాదికి ఎనిమిదివేల రూపాయలలోపు ఆదాయం వస్తున్నవారు ఆదాయపుపన్ను కట్టనక్కరలేదు. ఈ పరిమితిని పదివేలరూపాయలకు పెంచడం అవసరం. ఆహారధాన్యాల ధరలు ఎంత తగ్గినా ఇంకా ఎక్కువగానే వున్నాయి ఇళ్ళ అద్దెలు తగ్గకపోగా ఎక్కువ అవుతూనేవున్నాయి. పిల్లల చదువులకు అయ్యేఖర్చులు నానాటికీ ఎక్కువ అవుతూనేవున్నాయి అంచేత మధ్యతరగతి కుటుంబాలకు కొంత బాధ తగ్గించాలంటే, ఆదాయపు పన్ను లేని పరిమితిని పదివేలకు పెంచడం అవసరం

పోతే, ఇళ్ళ విలువను గురించి ఆర్థికమంత్రి చేసిన ప్రతిపాదనలు బాగానే వున్నవి ప్రతి ఏటా పెరుగుతున్న విలువలదృష్ట్యా ఇంటి విలువనుకట్టి పన్ను వెయ్యడం జరిగితే, ఇంటి యజమాని, ఆ యింటిని అమ్ముకోవలసిన పరిస్థితి యేర్పడుతుంది. అలా జరగకుండా, యింటి విలువను అయిదేళ్ళపాటు స్థిరపరచాలనే ప్రతిపాదనను ఆర్థికమంత్రి చేశారు ఇది అభినందనీయమైన విషయం అయితే, ఆస్తిపన్ను విధించేటప్పుడు ఇంటి విలువ లక్షరూపాయలలోపు

అయితేనే పన్ను లేదు ఈ మినహాయింపును ఒకటిన్నర లక్షవరకు పెంచడం అవసరం ఏమంటే సామాన్యకుటుంబీకులు ఉండడానికి కట్టుకునే ఇల్లు, పెద్ద బస్తీలలో, స్థలంతోసహా లక్షకుపైన ఖర్చుపెట్టనిదే సాధ్యంకావడంలేదు ఈనాడు ఇళ్ళుకట్టుకునేవాళ్ళలో చాలామంది ఉద్యోగస్తులూ, పింఛను దార్లూ ఉద్యోగస్తులు అప్పుతీసుకొని ఇళ్ళుకడుతున్నారు ఆ అప్పుమీద వడ్డీ కడుతున్నారు అదనంగా ఆస్తిపన్ను యిచ్చుకోవడానికి వీరికి శక్తివుండదు పింఛనుదార్లు, తమకు వచ్చే గ్రాట్యూయిటీనీ, పింఛనుమీద తీసిన అప్పునూ వుపయోగించి యిల్లుకట్టుకుంటున్నారు ఆ యింటిమీద మునిసిపల్ పన్నుకట్టి తీరాలి దానికితోడు ఆస్తిపన్నుకూడా కట్టాలంటే, వారికి చాలా కష్టం కాబట్టి ఆస్తిని లెక్కకట్టేటప్పుడు, లక్షన్నరలోపు విలువకల ఇంటిని పన్ను నుంచి మినహాయించడం అనేకవర్గాలవారికి చాలా మేలుచేస్తుంది

ఈనాడు ప్రభుత్వోద్యోగులకూ, కంపెనీల ఉద్యోగులకూ వుచిత వైద్య సహాయం వున్నది. నెలకు మూడువందల రూపాయలకు మించిన ఆదాయం గల ఇతర వర్గాలవారికి, యీ ఉచితవైద్యసహాయం లేద ఈనాటి ధరలలో నెలకు మూడువందల రూపాయల ఆదాయం ఒక లెక్కలోదికాదు కాని, యీ కుటుంబాలవారు డాక్టర్ల బిల్లులను యిచ్చుకోడానికీ, విపరీతంగా పెరిగిపోతున్న ధరలుగల మందులను కొనడానికీ చాలా బాధపడుతున్నారు మందుల ధరలు చాలా ఎక్కువగా పెరిగిన సంగతి ప్రభుత్వానికి తెలియనిది కాదు. ఈ విషయంలో ప్రభుత్వం చెయ్యవలసినది, కనీసం ప్రతి కుటుంబ యజమానీ తన కుటుంబానికి కొన్న మందుల ఖర్చును తన ఆదాయంలో పన్ను కట్టనక్కరలేకుండా మినహాయింపు యివ్వడం ఈ మినహాయింపును యిచ్చినట్లయితే, చాలా కుటుంబాలు కొంతవరకు డబ్బును సర్దుబాటు చేసుకోగలవు యేడాదికి వెయ్యిరూపాయలను కూడా మందులకోసం ఖర్చుపెట్టుకుంటున్న కుటుంబాలు దేశంలో యెన్నో వున్నవి అంచేత, ఇలాటి మినహాయింపు అనేక కుటుంబాలకు సహాయపడుతుంది

1976–77 బడ్జెటునూ, ఆర్థిక చట్టాన్నీ పార్లమెంటు యథాతథంగా ఆమోదించినప్పటికీ, పైన సూచించిన మినహాయింపులను ప్రభుత్వం ఉత్తరువుద్వారా ప్రకటించి, వచ్చే సమావేశంలో పార్లమెంటు ఆమోదాన్ని పొందవచ్చు ఈ సూచనలను కేంద్ర ఆర్థికమంత్రీ, ప్రధానమంత్రీ పరిగణిస్తారని ఆశిస్తున్నాము.

— ० ० —

జూన్ నెల

# యువ
# భావపరిచయ పోటీ

బహుమానం రూ 15-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి

గమనిక వ్యాఖ్యలు పోస్టుకార్డుమీదనే వ్రాయాలి

# మలుపు

## ముద్దంశెట్టి హనుమంతరావు

ఎండ నిప్పులు చెరుగుతోంది.

ముకుందం అప్పుడే వీధిలోంచి తిరిగొచ్చి, గొడుగును భార్యచేతికి అందించి, పుస్సురనుకుంటూ వాలుకుర్చీలో కూలబడ్డాడు. అతని మొహం, యెండవేడికి కందిపోయినట్టుగా యెర్రబడింది. వయస్సుతోపాటు అతని జీవితంలో ఆరాటం, ఆవేదన పెరిగిపోతుంటే, పాపం అతను మాత్రం యెట్లా తట్టుకోగలడు? మనిషి బాగా క్రుంగిపోతున్నట్టు, అతని మొహం చెప్పేస్తుంది.

భర్త అందించిన గొడుగు లోపల పెట్టి వచ్చి, భర్తకి దగ్గరగా వచ్చింది కమల.

“అబ్బాయి ఆచూకీ యేమైనా తెలిసిందాండీ?” ఆసక్తిగా అడిగింది.

ముకుందం, బరువుగా ఓ నిశ్వాసం వదిలాడు.

“లేదు కమలా. అబ్బాయి స్నేహితుల్లో చాలామందిని అడిగాను. ఎవ్వరికీ యేం చెప్పలేదట పోతే. మనం వుత్తరాలు రాసిన వాళ్ళదగ్గర్నించీ జవాబులొచ్చాయి, మనవాడు అక్కడ అగుపించడంలేదని. ఎక్కడున్నాడని వెదుకుతాం? ఎక్కడ వున్నాడో, యెలా వూహిస్తాం? అలాగని యేవీ తెలీదని చేతులు ముడుచుకుని యెలా కూచుంటాం?.. పోనీ, పోయినవాడు యెక్కడికి పోతున్నానో తెలుపుతూ ఓ వుత్తరం ముక్క రాసి పెడితే, మనకీ కంగారు వుండేది కాదు. ఏవిటో కమలా, మనస్సు పరిపరి విధాల వూహిస్తోంది...” బాధగా అన్నాడు ముకుందం.

కమల, కంటతడి బెట్టుకుంది.

“అంతా మన దురదృష్టమండీ!” రుద్ధస్వరంతో అంది.

సరళ మౌనంగా నిల్చుని, అంతా వింటోంది. ఇంట్లో అందరికీ అన్నయ్య

ఒక పెద్ద సమస్య అయి కూచున్నందుకు, ఆమె హృదయం తల్లడిల్లిపోతోంది. కొడుకు ప్రయోజకత్వం చూసి తలిదండ్రులు మురిసిపోవడం, సాధారణంగా జరిగే విషయం కాని, తమ ఇంట్లో కొడుకు అప్రయోజకత్వాన్ని, అస్తావ్యస్త జీవితాన్ని చూసి, తలిదండ్రులు బాధపడ్డం జరుగుతోంది. అది, యెవరెవరి అదృష్టాన్ని బట్టి వుంటుందేమో మరి !...అనుకుంది, సరళ

అంతలో కమల అందుకుంది మళ్ళీ

"పీడితోటి పిల్లలు ప్రయోజకులై మన కళ్లముందే తిరుగుతూవుంటే, యే జన్మలో మనం చేసుకున్న పాపపు ఫలమో పీడిలా తయారవ్వడం ... అని పిస్తుందండీ ! మొదట్నుంచీ పీడు గాలిబారిపోయాడు మరి ." బాధపడుతూ అంది

ముకుందం, భార్యకేసి తీక్షణంగా చూశాడు అంతవరకూ అతని మొహంలో అగుపించే దైన్యం, నిస్పృహ, ఒక్కసారి కోపంగా మారినట్టు, మొహం జేవురించింది

"ఇంకెవరో ఆ మాటంటే బావుండేదిగాని, నువ్వలా అనడం ఆశ్చర్యం కలిగిస్తోంది కమలా ! నిజానికి వాడిలా తయారవడానికి కారణం నువ్వే కదూ ! గతాన్ని ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకో ! వాణ్ణి అదుపులో పెట్టడానికి, యెప్పుడైనా నేను కాస్తంత కోపంతో కూకలేస్తే చాలు - నువ్వు నామీద విరుచుకు పడేదానివి 'ఏళ్లు మీదపడుతున్నకొద్దీ వాడే బుద్ధితెచ్చుకుంటాడండీ' అనే దానివి...గుర్తుందా ! ఆనాడే గనక వాణ్ణి నువ్వు సమర్థించుకు రాకపోతే, వాడిలా తయారయ్యేవాడుకాదేమో ! వయస్సు మీదపడినా, వాడు బుద్ధితెచ్చుకునే మాటలేకపోయినా, మనకి మాత్రం మనోవేదన తెచ్చిపెట్టాడు అంతేనా ? 'ఫలానా వారబ్బాయి' అని నలుగురిచేత వ్రేలెత్తి చూపించుకునే స్థితికివచ్చి, మనకి మన వంశానికి కళంకం తెస్తున్నాడు ఇవన్నీ తల్చుకుంటే, నేనింకా యెందుకు బ్రతికి వున్నానా, అనిపిస్తోంది ..." కోపంగానే అన్నాడు

సరళ మౌనంగానే వింటోంది

తండ్రి మాటల్లో క్రోధంవున్నా, ఆ క్రోధంలో కొంత తపనకూడా మిళితమై వుందని ఆమె యిట్టే పసిగట్టింది కమల కంటతడిపెట్టుకుంది కళ్లొత్తుకుంటూ, బరువుగా నిట్టూర్చింది పిల్లలు ప్రయోజకులైనా తల్లినే పొగుడుతారు ... చెడి పోయినా తల్లినే నిందిస్తారు ఇది అనాదిగా వస్తోన్న అలవాటేనని, ఆమెకి



తెలుసు అంచేత, తాను భర్త వేసిన నిందను నెత్తిన వేసుకోక తప్పదు... అనుకుంది

"వంశోద్ధారకుడు ఒక్కడేనని, గారాబంగా పెంచామండీ! నేనే కాదు... మీరూ వాణ్ణి పంచప్రాణంగా చూసేవారు ఇప్పటికీ వాడంటే మనకి మమకార లేదని చెప్పగలరా? అయితే వాడిట్లా తయారవుతాడని యెవరూహించారు చెప్పండి? గారాబంగా పెంచబడ్డ పిల్లలందరూ జులాయిలా తయారై చెడు మార్గాలు పడుతున్నారంటే, నేనొప్పుకోను ఉదాహరణకి, ఆ వరలక్ష్మి కొడుకునే తీసుకోండి వాణ్ణి తలిదండ్రులు పువ్వుల్లోబెట్టి పెంచారు అలాగని, వాడు చెడిపోయాడా! సలక్షణంగా చదువుకున్నాడు ... వాడిప్పుడో ఇంజనీరు ... అంతేనండీ! పిల్లల బాగోగులు తలిదండ్రుల అదృష్టంమీద కూడా ఆధారపడి

వుంటుంటాయి " కేవలం కొడుకు తన మూలంగానే చెడిపోయాడన్న వాదన్ని ఖండిస్తూ అంది, కమల

ముకుందం బాధగా ఓ పొడినవ్వు నవ్వి, ఓ నిట్టూర్పు విడిచాడు

"చివరికి అట్లాగే సమాధానపడాలి మరి ! అయితే, మన దురదృష్టమనుకుని అబ్బాయి గురించి ఆలోచించకుండా వుండలేం కదా ! వాడు యెంత జులాయిగా తిరిగినా, కన్నకొడుకు..." అంటూ వుంటే, అతని గొంతు బొంగురుపోయింది ఆవేదనని అణచుకోవాలని ప్రయత్నిస్తే, అదే జరుగుతుంది చెమ్మగిల్లిన కళ్లను ఒత్తుకున్నాడు

సరళ మనస్సు చివుక్కుమంది

తండ్రి కంటతడిపెట్టుకోవడం సహించలేకపోయింది ఆయనకి దగ్గరగా వెళ్ళింది

"ఏవిటి నాన్నా, మీరూ అలా దిగజారిపోతే యెట్లా? మా అందరికీ ధైర్యం చెప్పాల్సింది పోయి, మీరే దిగులుపడుతున్నారా ! కాస్తంత ధైర్యం కూడ గట్టుకుని నిబ్రదొక్కుకోవాలి మరి ! అన్నయ్య యెక్కడో క్షేమంగానే వుంటాడు. కొద్దిరోజులు పోయాకనయినా వుత్తరం రాయకుండా వుంటాడా ? తప్పకుండా రాస్తాడు .. అయితే, మనం కాస్తంత ఓపికపట్టాలి.. " అంది సరళ

"అన్నయ్య మనస్తత్వం నాకు బాగా తెలుసునమ్మా! వాడికి ఆత్మాభిమానం, పట్టుదల యెక్కువ ఎవరు యేంచెప్పినా, వాడి మంచికే చెబుతున్నామన్న నిజాన్ని జీర్ణించుకోలేకపోతున్నాడు ఒకరిచేత చెప్పించుకోవడమన్న విషయం వాడి అభిమానాన్ని దెబ్బతీసింది అందుకనే, మళ్ళీ మాచేత చెప్పించుకోడం యిష్టంలేక, మనకి దూరంగా పోయాడు అటువంటివాడు వుత్తరం రాస్తాడూ అంటే, నాకు నమ్మకం కుదరటం లేదమ్మా ! అందుకే, నేను బాధపడుతున్నది అంతే కాదమ్మా ... వాడు యెక్కడున్నాడో, యే పరిస్థితుల్లో వున్నాడో, యెవరికి తెలుసు !" దిగాలుపడుతూ అన్నాడు

"మనం మంచినే యెందుకు వూహించకూడదు నాన్నా? బాగానే వున్నాడని అనుకుందాం "

"అనుకోవచ్చునమ్మా ! కాని, వాడి అలవాట్లు మంచివి కావుగా ! అందుకే, ఆరాటం..."

"ఆరాటపడిమాత్రం మనం చెయ్యగలిగిందేముంది నాన్నా ? కేవలం

భగవంతుడిమీద భారంవేసి, గుండెల్ని రాయిగా మార్చుకోవడమే మనం చెయ్యగలిగింది ఇలా మీరు దిగులుపడి, మీ ఆరోగ్యాన్ని పాడుచేసుకుంటే, అన్నయ్య వచ్చేస్తాడా ? దేనికయినా కాలం కలిసిరావాలి నాన్నా !"

"ఆ విషయం నాకూ తెలుసునమ్మా ! కాని, నిగ్రహించుకోలేక పోతున్నాను ''

"అలా అంటే లాభంలేదు నాన్నా ! అన్నయ్య గురించి మీరేం బాధ పడకండి ఎంత జులాయిగా తిరిగినా, తెలివైనవాడు ఎక్కడున్నా సుఖంగానే వుంటాడు కొన్నాళ్ళపాటయినా, మీరు నిగ్రహం వహించాలి "

"ఏమిటోనమ్మా ! అంతా అయోమయంగా వుంది ఆలోచిస్తూవుంటే, గుండె చెరువైపోతోంది ఆలోచించకుండా వుండటం అసాధ్యమౌతోంది..." అంటూ వాపోయాడు, ముకుందం

కమల అంతవరకూ యేమీ మాట్లాడకుండా వుండిపోయింది వెల్లువలా పొంగివస్తోన్న దుఃఖాన్ని ఆపుకుంటూ, చెమ్మగిల్లిన కళ్లను చీరచెంగుతో ఒత్తుకుని, వంటగదికేసి వెళ్ళిపోయింది

"చూడమ్మా, మీ అమ్మ యెంతగా కుమిలిపోతోందో ?"

"అది సహజమే నాన్నా ! ఆడది ... కన్నతల్లి ... ఆమె తట్టుకోవడం కష్టమే ! మీరే తట్టుకోలేకపోతూవుంటే, ఆమె సంగతి యింక చెప్పాలా ! చాలా వేళయింది ... లేవండి నాన్నా భోజనం చేద్దురుగాని !..."

"ఏది తప్పినా, కడుపు నింపుకోవడం తప్పదుకదా! పద...వస్తున్నా..." అంటూ లేచాడు, బరువుగా ఓ నిశ్వాసం వదిలి

సరళ లోపలికి వెళ్ళిపోయింది ముకుందం, భారంగా నడుస్తూ పోయాడు

బైట యెండ తీవ్రంగానే వుంది మరి !

*  *  *

ముకుందం, సబ్ హెడ్‌గా పన్జేస్తున్నాడు, ఓ ప్రైవేటు కంపెనీలో నీతిగా, నిజాయితీగా తన వుద్యోగ ధర్మాన్ని నిర్వర్తించుకుంటూ, నలుగురి అభిమానాన్నీ సంపాదించుకున్న వ్యక్తి సౌమ్యుడు, కొడుకు నరహరి అంటే, అతనికీ, అతని భార్యకీ యెంతో ప్రాణం అందుకే నరహరిని ఆ దంపతులు గారాబంతో పెంచారు చిన్నప్పట్నుంచి కూడా నరహరికి చదువుపట్ల శ్రద్ధ వుండేది కాదు చిన్న క్లాసుల్లో కూడా ట్యూషను పెట్టించాడు, ముకుందం అయినా, నరహరి చదువు మందకొడిగానే సాగింది పైగా దొంగతనం అలవడిం

దతడికి ఇంట్లో యెక్కడయినా పొరపాటున బైట డబ్బుపెడితే, అది మళ్ళీ అగుపించేది కాదు ఎలా డబ్బు మాయమౌతుందో అర్థంగాక, ఆశ్చర్యపోయే వారు ముకుందం దంపతులు, మొదట్లో. కాని, క్రమంగా తెలిసి వచ్చింది, తమ ముద్దుల కొడుకే తీస్తున్నట్టు ముకుందంకి వొళ్ళు మండిపోయేది తన కొడుకు దొంగతనం చేస్తున్నాడంటే, అతనికి తలతీసినంత పనయ్యింది ఇంట్లో గాబట్టి సరిపోయింది ... అదే బైట యెవరింట్లోనో అయితే, యింకేమన్నా వుందా ? అన్న ఆలోచన అతణ్ణి ఆవేశంతో నింపింది కొడుకును గట్టిగా కూకలెయ్యడమేగాకుండా ఎడాపెడా నాలుగు తగిలించాడు కమల అడ్డొచ్చింది "ఏదో చిన్నవాడు లెద్దురూ ! తప్పుచేశాడు. దానికింత రాద్ధాంతమెందుకండీ ? కూకలేశారుగా — వాడే దార్లోకి వస్తాడు" అంటూ కొడుకువేపు వకాల్తాపుచ్చుకుని మాట్లాడేది దాంతో నరహరికి ఓ పెద్ద ఆసరా దొరికినట్టయ్యింది ఫలితంగా, తలిదండ్రులు యేమంటారోనన్న భయంగాని, ఆలోచనగాని, నరహరికి లేకపోయింది

ఈ విధంగా, నరహరి తప్పుదారి పట్టడానికి, పరోక్షంగా తల్లి చూపించే మమకారం, ఆమె కొడుకుని ప్రతివిషయంలోనూ సమర్థించడం, దోహదమయ్యాయనే చెప్పాలి చెడుని యెప్పుడూ చెడుగానే గుర్తించి, దాన్ని నిర్మూలించడానికి ప్రయత్నించడం సర్వదా శ్రేయస్కరం కాని, ఆ చెడు యెన్నటి కయినా మంచిగా మారకుండా వుంటుందా అని వుపేక్షిస్తే, ఫలితం చేదుగా వుంటుంది ఈ సత్యాన్ని ముకుందం గ్రహించినా, ఆచరణలో పెట్టలేని నిస్సహాయుడయ్యాడు కమల, అసలు గుర్తించనే లేదు కన్నకొడుకు మీదుండే మమకారం, ఆమెని ఆలోచించనీయలేదు

నరహరి తొమ్మిదో క్లాసు రెండేళ్ళు చదివి, విసిగిపోయి చదువుకి స్వస్తి చెప్పాడు మరింక చదవనంటూ మొండి నిర్ణయాన్ని తీసుకున్నాడు తలిదండ్రులుమాత్రం యింకేం చేస్తారు ? ఏమన్నా గట్టిగా అంటే, యే అఘాయిత్యానికి పాల్పడతాడోనన్న భయంతో వూరుకున్నారు ముకుందం మాత్రం లోపల యెంతగానో బాధపడ్డాడు కొడుకు యెంతో ప్రయోజకుడౌతాడని యెన్నో కలలుగన్నాడు ఆ కలలు ఒక రూపానికి రానందుకు, తన దురదృష్టాన్ని తిట్టుకున్నాడు,

రోజులు గడుస్తున్నాయి

నరహరి ప్రవర్తన మరీ అస్తవ్యస్తంగా తయారయ్యింది ఎప్పుడు ఇల్లు



యు




విడుస్తాడో, యెప్పుడు తిరిగి వస్తాడో తెలీదు బాహాటంగా సిగరెట్లుకాల్చడం అలవర్చుకున్నాడు చిన్న చిన్న దొంగతనాలు చెయ్యడం, హాబీగా తయారయ్యింది కొడుకు స్నేహితుల్ని చూసి, ముకుందం యెన్నోసార్లు మొహం దించుకున్నాడు

"అబ్బాయి స్నేహితుల్ని, వాళ్ల అలవాటుల్ని చూస్తుంటే, నాకే రోతగా వుంది ఇటువంటి కొడుకులు వున్నా ఒకటే ..లేకపోయినా ఒకటే!" భార్య సమక్షంలో యెన్నోసార్లు యిలా అన్నాడు

కమల దీర్ఘంగా నిట్టూర్చడం మినహా మరేం అనలేకపోయేది నిజమే మరి! ఆమె చెయ్యగలిగిందేముంది? ఎన్నోసార్లు కొడుకుతో అంది కూడా 'వంశానికి అప్రతిష్ఠ తీసుకురాకురా' అని నరహరి నవ్వేసి వూరుకునేవాడు

నరహరి, తన జీవితంలో వస్తోన్న మార్పుని తెలుసుకున్నాడు. సంఘంలో తనకి యెటువంటి స్థానం వుందో గుర్తించగలిగాడు అలాగని, తన అలవాట్లని మానుకునే మనోనిబ్బరం అతనికి లేకపోయిందంటే ఆశ్చర్యమేంకాదు ఒకటి రెండుసార్లు దొంగతనంచేసి పట్టుబడ్డాడు అయితే, మాటల నేర్పుతో తప్పించుకుపోయాడు మరోసారి పోలీసుల చేతిలో చిక్కాడు అప్పుడూ, తాను దొంగను కానని నమ్మించి తప్పుకున్నాడు అయితే, యీ సంఘటనలు తన కుటుంబపు దృష్టికి పోకపోవడం, నిజంగా తన అదృష్టమేననుకున్నాడు అంత ఆ వూళ్లో ఉండే, యెప్పుడో ఓసారి తన బ్రతుకు తలిదండ్రులముందు

చిరిగిన విస్తరిలా పడుతుందని, దాంతో వాళ్ళు మరింత కృంగిపోతారని భావించి, అటువంటి రోజు రాకూడదని నిర్ణయించుకున్నాడు అందుకే వూరు విడిచి వెళ్ళిపోయాడు ఎక్కడికి వెళ్ళాడో, యెవ్వరికీ చెప్పలేదు అదే తల్లి దండ్రులు బాధ!

* * *

తప్పుపని చేసిన ప్రతివ్యక్తి ధైర్యంగా, నిశ్చింతగా సంఘంలో తిరగలేడు. ఒకవేళ మొండికెత్తి తిరిగినా, లోలోన యెప్పుడూ యేదో భీతి వున్నానంటూ, కలవరపరుస్తుంది. నరహరి విషయంలోనూ అదే జరిగింది తన వాళ్ళకూ, తన వూరికీ దూరమై మరో వూళ్ళో వుంటున్నా, లోలోన యెంతగానో బాధ పడుతూ వుండేవాడు అమ్మా, నాన్నా, చెల్లాయి తన గురించి యెంతగా కంగారుపడిపోతున్నారోనన్న ఆలోచన అతనికి లేకపోలేదు కాని, తన వునికి తెలియజెయ్యడం కూడా శ్రేయస్కరం కాదనిపించింది తనకోసం కొన్నాళ్ళు బాధపడి, వాళ్ళే తమ గుండెల్ని రాయిచేసుకుంటారని సమాదాన పడ్డాడు

నరహరి వుంటున్నది ఓ చిన్న గది ఆ గదికి కరెంటు లేదు రాత్రిపూట కొవ్వొత్తులు వాడుకోవల్సిందే! గదిలో చిన్న నులకమంచం, దానిమీద ఓ దుప్పటి, తలగడా మాత్రమే వున్నయ్ ఓ మూలకి కట్టబడిన తీగమీద రెండు మూడు దుస్తులు వేలాడుతున్నయ్ గది పరిశుభ్రంగా లేదు ఎక్కడ చూసినా కాగితం ముక్కలు, కాల్చిపారేసిన సిగరెట్ పీకలూ, పుస్తకాలూను

బారెడు ప్రొద్దెక్కింది నరహరి బద్ధకంగా వొళ్ళు విరుచుకొని లేచి కూర్చున్నాడు ఎదురుగా, రాత్రి తాను తస్కరించి తెచ్చిన బ్రీఫ్‌కేస్ అగుపిస్తోంది. దాన్ని చేతిలోకి తీసుకుని తెరిచాడు అంతా వెదికాడు రూపాయిపైగా చిల్లర డబ్బులు మినహా డబ్బేం దొరకలేదు వున్నవన్నీ, తనకి పనికిరాని కాగితాలు, రెండు ఇంగ్లీషు నవల్సూను ఏవేంటో వుంటుందన్న ఆశతో దాన్ని తీ.. కొచ్చాడుగాని, తన ప్రయత్నానికి ఫలితం యింత నిరాశాపూరితంగా వుంటుం దని ఊహించాడా? ... అనుకున్నాడు నిస్పృహతో విసుగ్గా ఆ బ్రీఫ్‌ని అక్కడ పెట్టేశాడు ఛా! రోజు రోజుకీ మరీ అధ్వాన్నమైపోతోంది వ్యాపారం అయినా ఈ రోజుల్లో ప్రతివాడూ ఓ బ్రీఫ్‌కేసు పట్టుకు తిరగడమే! అందులో కాగడాపెట్టి వెదికినా ఓ రూపాయి వుండదు ... కేవలం డాబుసరికోసం అలా

పట్టుకు తిరుగుతారో యేవిఁటో !... అనుకుని బిరువుగా లేచాడు కాలకృత్యాలు తీర్చుకుందుకు.

*   *   *

ముకుందం, వాలుకుర్చీలో జేరబడి, తీవ్రంగా ఆలోచిస్తున్నాడు అతని ఒడిలో వార్తాపత్రిక పడుంది ఇంతకుముందు పేపరులో ఒక్క అక్షరం వదలకుండా న్యూస్ చదివాడు కాని, యిప్పుడు యేమీ చదవబుద్ధి పుట్టడం లేదు

సరళ అప్పుడే లోపల్నించి వచ్చింది తండ్రి అంత పరధ్యానంగా యేవిఁటో ఆలోచిస్తుండటం గమనించింది

"ఏఁవిటి నాన్నా, అలా తీవ్రంగా యోచిస్తున్నారు!" అంది, దగ్గరగా వస్తూ.

ముకుందం భారంగా ఓ నిట్టూర్పు వదిలాడు

"యోచించడానికి యింకేముంటుందమ్మా ? అన్నయ్య గురించే ఆలోచిస్తున్నాను ఒకొ్కక్కప్పుడు మనం ఊహించని విషయాలు తటస్థపడి, మనల్ని తల్లక్రిందులు చేస్తుంటాయి అదే జీవితపు వింత నరహరి యిలా తయారవుతాడని, యెవ్వరైనా అనుకున్నానా ? యిదే ఒక వింతమ్మా ! నాకు తెలిసిన ప్రతివ్యక్తీ ఒకే ఒక్క ప్రశ్న వేస్తున్నాడు 'మీ అబ్బాయి యేం చేస్తున్నాడండీ ? అని కొడుకు ప్రయోజకత్వాన్ని సగర్వంగా చెప్పుకుని సంతృప్తి పడతారు తలిదండ్రులు కాని, నేను యేమని సమాధానం చెప్పేది ? ఏం చెప్పాలో చప్పున తోచక, తికమకపడిన క్షణాలు లేకపోలేదు అయినా, యేదో చెప్పాలి గనుక, కృత్రిమమైన ఓ మందహాసంతో 'అబ్బే ! ఏం చెయ్యడం లేదండీ !' అని జవాబు చెప్పడంకంటే మరోమార్గం లేకపోతోంది అబ్బాయిని గురించి తెలిసినవాళ్ళకి యీ సమాధానం చెబితే, నవ్వుతారు . . అందుకనే, యేమనిపిస్తుందో తెలుసా అమ్మాయ్ ,.. " అంటూ కూతురుకేసి పేలవంగా చూశాడు, ముకుందం

సరళ మాట్లాడలేదు ఆమెకి తెలుసు తండ్రి అనుభవిస్తోన్న తపన యేమిఁటో ! అతనికేసి కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయింది

"ఉద్యోగానికి రాజీనామా యిచ్చేసి, యీ ఊరు వదిలి మరో ఊరు వెళ్ళిపోవాలనిపిస్తుందమ్మా ! అప్పుడైనా, నేను కొంతమేరకు నిశ్చింతగా బ్రతగ్గల

నేమో ! అక్కడ అబ్బాయి విషయం నాకు గుర్తుచేసే మనుషులందరు అన్నాడు బాధగా

సరళ మనస్సు చివుక్కుమంది ఎంత బాధపడకపోతే తండ్రి ఆ నిర్ణయానికొస్తాడు ? అనుకుంది.

మీ ఆవేదనని అర్థంచేసుకున్నాను నాన్నా ! ఆ బాధ మీ ఒక్కరికే కాదు మనింట్లో అందర్నీ పట్టుక వేధిస్తోంది ఇరుగుపొరుగువాళ్ళు, స్నేహితులు అడిగే ప్రశ్న పరంపరలకు సమాధానాలు చెప్పలేక విసిగిపోతున్నాం అలాగని, మనం ఊర్నించే వెళ్ళిపోతామంటే యెట్లా ? కొత్త ఊళ్ళోమాత్రం యీ ప్రశ్నలు తలెత్తవన్న నిర్ధారణ యేవిటి చెప్పండి ? జీవితంలో యెన్నో సమస్యలు యెదురవుతాయి వాటిని గుండెనిబ్బరంతో యెదుర్కోవల్సిందేగాని, ప్రతి సమస్యకీ భయపడి యెక్కడికో పారిపోతామనడం, హాస్యాస్పదంగా వుంటుంది అందుకే, అవన్నీ పట్టించుకోవద్దంటున్నాను తొందరపడి, మీరు మీ వుద్యోగానికి రాజీనామా యిచ్చేస్తే, పర్యవసానం యెట్లా వుంటుందో, కాస్తంత దూరంగా యోచించండి నేను మీకు చెప్పవల్సినదాన్ని కాదు..."

"అదీ నిజమేనమ్మా ! పర్యవసానం తట్టుకోలేం ... మనకి స్థిరాస్తులేం లేవు అదీ గుర్తుందమ్మా ! అయితే, యీ మనోవ్యధ, నన్ను స్థిమితంగా వుండనియ్యడం లేదు "

"మీరు మొండితనానికి అలవాటుపడాలి నాన్నా ! ప్రతివిషయాన్నీ పట్టించుకుని, దానిగురించి కుమిలిపోతే, జీవితం సాఫీగా గడవడం కష్టమే "

"ఎవిటోనమ్మా, నువ్వలా అంటావు ? ఒక్కొక్కప్పుడు, యెంత మొండిగా వుండాలనుకున్నా, అబ్బాయి జ్ఞప్తికి రావడం మానడంలేదు ఎంత వాడు చెడ్డవాడయినా, అనుబంధం యెక్కడికి పోతుందమ్మా ? నేనే యిలా అయిపోతూవుంటే, యిక మీ అమ్మ సంగతి ఆలోచించు...బైటికి కనిపించదు గాని, లోలోన మరీ కుమిలిపోతోంది కాని, యేం చేస్తాం!" అన్నాడు ముకుందం బాధగా "మనం యీ పరిస్థితిలో యేమీ చెయ్యలేమని తెలిసికూడా మీరింతగా దిగులుపడ్డం బావులేదు నాన్నా ! మీరే ధైర్యంగా వుండకపోతే, ఆడది — అమ్మ ధైర్యం తెచ్చుకోగలదా ? అందుకే, మీరు ధైర్యాన్ని కూడదీసుకోవాలి అమ్మ విషయం నేను చూసుకుంటానుగా ! అన్నయ్య యెప్పటికయినా మారుతాడని, ఇంటికి తిరిగి వస్తాడన్న విశ్వాసం నాకుంది నాన్నా !"




ముకుందం బరువుగా నిశ్వాసనం వదిలాడు

"ఏమో, నాకు నమ్మకం లేదమ్మా! చెప్పానుగా, వాడికి ఆత్మాభిమానం యెక్కువని..."

"కొద్దిరోజులు ఓపిక పట్టండి నాన్నా!"

"నువ్వు యే నమ్మకంతో అలా అంటున్నావోగాని, ఒకవేళ అదే జరిగిన నాడు, నాకంటే ఆనందించే వ్యక్తి మరొకరు వుండరమ్మా!"

"ఔను కదా నాన్నా! ఆ ఆశను మీలో పెంపొందించుకుని, ఆ ఆనందాన్ని యిప్పట్నుంచే వుండనివ్వండి అలా మీరు దిగాలు పడివుంటే, నాకే యెంతో బాధగా వుంటుంది"

"ఏమిటోనమ్మా!" అంటూ ఒడిలో వున్న న్యూస్ పేపరు తీసి చదవడంలో నిమగ్నుడయ్యాడు, ముకుందం

సరళ బరువుగా ఓ నిట్టూర్పు విడిచి అక్కణ్ణుంచి నిష్క్రమించింది

* * *

గిరి, యిరవై నాలుగేళ్ళు పూర్తికాని యువకుడు స్ఫురద్రూపి కోటేరు వేసిన అతని నాసికచూస్తే, అతనిలో పట్టుదల అధికమని యిట్టే చెప్పొచ్చు ఈ మధ్యనే పోలీసు ఇనస్పెక్టరుగా సెలెక్టయి ట్రెయినింగు పూర్తిచేసుకుని వచ్చాడు

గిరికి, సరళంటే యెంతో అభిమానం ... అనురాగమూను ఆమెతో పరిచయమైంది మొదలు, ఆమె రూపాన్ని హృదయఫలకంపై శాశ్వతంగా

ముద్రించుకున్నాడు సరళకి కూడా 'గిరి' అంటే పంచప్రాణ- తొలి చూపుల్లోనే అతణ్ణి వలచింది మనసిచ్చేసింది గిరి ట్రెయినింగు పూర్తిచేసు కుని యెప్పుడొస్తాడా అని యెదురు తెన్నులు చూస్తోంది

ఆ రోజు వుదయమే వచ్చిన గిరి, సరళను కలుసుకోవాలన్న ఆతృతతో సాయంత్రం కాలేజీ గేటుకి కాస్తంత దూరంలో వేచివున్నాడు అందరూ వచ్చేస్తున్నారుగాని, సరళ జాడలేదు కొంపదీసి, రాలేదేవిఁటి చెప్మా ? . . అన్న సందేహం అతనిలో మొలకెత్తింది అతనికి ఆరాటమూ, ఆసక్తి అధిక మయ్యాయి ఏవిఁటి చెయ్యడమా అని ఆలోచిస్తున్నంతలో మొహం దించు కుని, వయ్యారంగా నడుస్తూ సరళ వస్తూండటం అగుపించేసరికి, అతని గుండెలు కాస్తంత తాపిపడ్డాయి. మనిషి స్థిమితపడ్డాడు ఆమె దగ్గరికి రాంగానే

"హలో సరళా !" అన్నాడు వుత్సాహంగా, గిరి

తలెత్తి చూసిన సరళ, గిరిని చూసింది ఆమె మొహంలో వెయ్యి సూర్యుల వెలుగుతో నిండినట్టయ్యింది పెదాలపై సన్నని మందహాసం వెల్లివిరిసింది

"ఎప్పుడొచ్చారు . ?" అతనికి దగ్గరగా వస్తూ అంది సౌమ్యంగా

"ఈ రోజు ప్రొద్దుటే ! ప్రయాణపు బడలికవల్ల కాస్సేపు విశ్రమించి ఇప్పుడు నిన్ను కలుసుకోవాలని బయల్దేరాను "

ఇద్దరూ ఓ ప్రక్కగా నడుస్తున్నారు

"మీరు వెళ్ళిపోయాక, నే నెంత ఒంటరితనం అనుభవించానో చెప్ప లేనండీ ! అబ్బ ! రోజూ యెదురు చూస్తున్నాను—యెప్పుడొస్తారోనని !"

"అలాగా ! ఏమో, నన్ను మర్చిపోయి గుర్తుపట్టలేవేమో నను కున్నాను . '' చిలిపిగా నవ్వుతూ అన్నాడు, గిరి

"బాల్లెద్దురూ ! మీరు నన్ను మర్చిపోగలిగారా చెప్పండి ?" ఓరగా చూస్తూ అంది, సరళ

"అబ్బే ! సరళ అనే అమ్మాయి అనుక్షణం నా మనసులోనూ, కళ్ళల్లోనూ మెదల్తూ, నన్నెంతగానో యిబ్బంది పెట్టేసింది తెలుసా ?"

" 'గిరి అనే అబ్బాయిగారూ నన్ను ఆదేవిధంగా బాధపెట్టారని మీరెందు కనుకోరు మహానుభావా !" నవ్వుతూనే అంది

"నేననుకోవడం, యెలాగూ వుందనుకో ! పైగా నువ్వే స్వయంగా చెబుతున్నావాయె! నమ్మితీరాల్సిందే ! కాని, ఒక్క విషయం ఆలోచించావా,"

"ఏవిఁటండీ."

"ఇలా మనం ఒకర్నొకరు క్షణక్షణం జ్ఞప్తికి తెచ్చుకుని, కలలో కలుసుకుని, గాలిమేడల్లో విహరిస్తూ, యెన్నాళ్ళు జీవిస్తాం చెప్పు ?''

''మరేం చేద్దామంటారు ?''

"నా ట్రెయినింగు యెలాగూ పూర్తయ్యింది పోస్టింగు కూడా యీ ఊళ్లోనే వేశారు ''

"అలాగా ! మరీ మంచిదండీ ! ఎంత శుభవార్త తెచ్చారండీ ! అయితే, ఇనస్పెక్టరుగారు యూనిఫారమ్‌లో యిక్కడే తిరుగుతుంటారన్నమాట... కాస్త జాగ్రత్తగానే వుండాలి మరి .." చిలిపిగా అంది, సరళ

"యూనిఫారమ్‌లో తిరగడం, వుద్యోగరీత్యా అనుకో ! కాని, తీరిక సమయాల్లో నీతో కలిసి తిరగడంలోనే ఆనందం, ఓ తియ్యని అనుభూతి, వున్నాయ్ ఆ ఆనందాన్ని, అనుభూతిని, నేను శాశ్వతంగా కోరుకుంటున్నాను సరళా . అంటే, నీకు అర్థమయ్యిందనుకుంటాను..." అంటూ ఆమె మొహంలోకి చూశాడు, గిరి

గిరి అభిప్రాయం యేవిఁటో, సరళకి అవగతమయ్యింది కాని, స్త్రీ అంత సులువుగా బైటపడదు చిలిపిగా మందహాసంచేస్తూ 'వుహూ అంటూ తల అడ్డంగా తిప్పింది

ఆమె అబద్ధం చెబుతోందని గిరికి తెలుసు అయితే, యింకా అడ్డుదారిన వెళ్లడం, యిష్టంలేకపోయిం దతనికి

"నువ్వు అబద్ధం చెబుతున్నట్టు, యిట్టే తెలిసిపోతోంది సరళా ! నా నోట చెప్పించాలని అలా అంటున్నావేగాని, నిజానికి అర్థంగాకపోడానికి యిదేమంత తికమకపర్చే భావన కాదు సరే ! నేనే సూటిగా చెప్పేస్తాను ... మనం యింక దూరదూరంగా వుండటాన్ని నేను భరించలేను మనం వివాహం చేసుకుందాం చిలకాగోరింకల్లా హాయిగా తిరుగుదాం .. ఆనందం పండించుకుందాం " హుషారుగా చెప్పుకుపోయాడు, గిరి

మరో తరుణంలో అయితే, గిరి మాటలకి ఆనందంతో ఎగిరి గంతేసేది సరళ కాని, యిప్పుడు నెమ్మదిగా ఓ నిట్టూర్పు విడిచి, మొహం దించుకుంది హఠాత్తుగా ఆమె మొహంలో విషాదచ్ఛాయలు పరుచుకోవడం గమనించిన గిరి నివ్వెరపోయాడు, సరళలో హఠాత్తుగా యెందుకా మార్పు వచ్చిందో, అనూహ్యమయిందతనికి వివాహ ప్రసక్తి వచ్చినప్పుడే యెందుకలా మారిపోయిందో

తనని వివాహమాడడం, ఆమెకి యిష్టం లేదా, లేక, ఆమె తలిదండ్రులు అంగీక రించరన్న భయమా ? లేకపోతే ఆమె వివాహం ఇంకెవరితోనైనా అప్పుడే నిర్ణయమైనదా, యిన్ని ప్రశ్నలు గిరి మెదడలో గింగురు పెట్టాయి అయితే ఏ ఒక్కదానికీ సమాధానం రాలేదు సరళ మౌనాన్నికూడా అర్థం చేసుకోలేకపోయాడు "అదేమిటి సరళా, వివాహ ప్రసక్తి వచ్చేసరికి హఠాత్తుగా నీ మొహంలో మార్పు వచ్చిందేమిటి ? ఏం జరిగిందసలు ?" ఆత్రంగా అడిగాడు గిరి

"మీరు మన వివాహ విషయం ప్రస్తావించేసరికి, నాకు మా యింటి పరిస్థితి జ్ఞప్తికొచ్చి, నా మనస్సు పాడయిందండీ మీకు యేం సమాధానం చెప్పాలో తెలీని అయోమయస్థితిలో కొట్టుకుంటున్నాను ..." అంది నిర్లిప్తంగా

గిరికి షాక్ తగిలినట్టయ్యింది. ఆమె ఇంటి పరిస్థితులేమిటో, అతనికి తెలీవు ఆమెకి తలిదండ్రులూ, ఓ అన్నయ్య వున్నారన్న విషయంమాత్రమే తెలుసునుగాని, వాళ్ళనెప్పుడూ కలుసుకోలేదు కూడాను వారి ఆర్థికస్థితి యేమిటో కూడా తెలీదు తెలుసుకోవాలన్న ప్రయత్నం తనింతవరకూ చెయ్యలేదు ప్రేమకి, పరిస్థితులకు ముడిబెట్టడం, అసందర్భంగానూ, అనుచితంగానూ వుంటుందని భావించి, ఆ ప్రసక్తిని యెప్పుడూ తీసుకురాలేదు సరళతో పరిచయమైనప్పట్నించీ, కాలేజీ దగ్గరో, రోడ్డుమీదో కలుసుకోవడం, యే హోటల్లోనో కూచుని కాస్సేపు కబుర్లు చెప్పుకోవడం జరుగుతోందిగాని, వాళ్ళింటికి వెళ్ళకపోవడం పొరపాటే అనిపించిం దతనికి

"ఐ యామ్ సారీ సరళా !" అతనిలోని వుత్సాహం నీరుగారిపోయింది "మీ యింటి పరిస్థితులు నాకు తెలీవు.. మరేం అనుకోకు "

"అబ్బే ! అనుకోవడాని కేముంది లెండి...నేను చెప్పకుండా మీకు మాత్రం యెట్లా తెలుస్తాయి ?"

హోటలు ప్రక్కనించి పోతుంటే, కాఫీ తీసుకోవాలనిపించింది, గిరికి

"కాఫీ తీసుకుందాం పద సరళా !" అన్నాడు

"ఇప్పుడెందుకండీ ? ఇంటికిపోయి తీసుకుంటాను "

"అక్కడ కాస్సేపు కూచుని మాట్లాడుకుందాం.. ప్లీజ్ "

కాదనలేకపోయింది, సరళ గిరితోపాటు హోటల్లో అడుగుపెట్టింది. ఇరువురూ ఓ మూల టేబిలు దగ్గర కూచున్నారు

"టిఫిను తీసుకుందామా ?" అడిగాడు




"ఏమీ వద్దండీ ; వట్టి కాఫీయే"

"సరే..." అంటూ సర్వర్ని పిల్చి కాఫీకి ఆర్డరిచ్చాడు, గిరి

"ఇప్పుడు చెప్పు సరళా, మీ ఇంటి పరిస్థితులేమిటో ? నిన్న నా పంచ ప్రాణంగా భావిస్తున్నపుడు, నువ్వుండే వాతావరణం తెలుసుకోవడం నా కర్తవ్యం కూడాను నిన్నింతగా దిగులుపరిచే ఆ పరిస్థితులేవిటి? ఏ విధమైన సంకోచమూ లేకుండా చెప్పు మనసులు కలిసిన మనుషులు, మనసు విప్పి మాట్లాడుకోవడం చాలా అవసరం అది ఆరోగ్యకరం కూడాను మనిద్దరిమధ్య రహస్యాలు వుండకూడదనే నా భావం..." అన్నాడు గిరి

సర్వరు రెండు గ్లాసులతో కాఫీపెట్టి, దాంతోపాటు బిల్లుకూడా పడేసి పోయాడు గిరి, ఓ గ్లాసు సరళకి అందించి, తనో గ్లాసు తీసుకున్నాడు ఇద్దరూ సిప్ చేస్తున్నారు

సరళ ఆలోచనలో పడింది అన్నయ్య విషయం చెప్పడమా, మానడమా అన్నదే ఆమె సమస్య కాని, గిరి అన్నట్టు, మనసులు కలిశాక, దాపరికా లెందుకింక ? చెప్పడానికే నిశ్చయించుకుంది భారంగా ఓ నిశ్వాసం వదిలింది

"నన్నూ, మా అమ్మా నాన్నల్ని కలవరపరుస్తోన్నది మా అన్నయ్య విషయమేనండీ ; ఆ విషయమే మా అందరికీ బాధకలిగిస్తోంది ఆదే నా వివాహానికి అవరోధంగా వుంటోంది..."

"అంటే..? మీ అన్నయ్య మీ అందరికీ సమస్యగా పరిణమించడానికి

కారణం యేమిటి ? మిమ్మల్ని కలవరపరిచే విషయం యేమిటి ? సూటిగా చెప్పు సరళా !"

కాఫీ త్రాగడం పూర్తిచేసి, గ్లాసు క్రింద పెట్టింది, సరళ

"మీ దగ్గర యింక దాపరికం యెందుకు లెండి? ఎప్పటికయినా మీకు తెలియవల్సిందే ! మా అన్నయ్య, చిన్నప్పట్నుంచీ గారాబంగా పెరిగాడు వంశోద్ధారకుడు ఒక్కడే కదా అని, అమ్మగాని, నాన్నగాని, యేమీ అనేవారు కాదు ఏ ఒక్కరి అదుపాజ్ఞలలోనూ లేకుండా పోయాడు. చదువువట్ల అశ్రద్ధ పెరిగి, జులాయిగా తిరిగి చెడుతిరుగుళ్ళ తిరుగుతూ దొంగతనానికి అలవడ్డాడు అది తెలుసుకున్న మా నాన్నగారు బాధపడి, భయంచెప్పాలన్న వుద్దేశంతో చీవాట్లు పెట్టేవారు తన గౌరవం, కుటుంబ గౌరవం, మంటగలుస్తున్నందుకు, లోలోన కుమిలిపోతూ వుండేవారు నయానా, భయానా చెప్పినా, అన్నయ్యలో యెవ్వంతయినా మార్పురాలేకపోయింది ఓ రోజు యెవ్వరికీ చెప్పా పెట్ట కుండా, ఇంట్లోనించి వెళ్ళిపోయాడు మళ్ళీ రాలేదు వాకబు చేయవల్సిన చోటుల్లో వాకబుచేశారు నాన్నగారు అసలు, ఊళ్ళోనే లేడని తెలిపోయింది ఎక్కడికి వెళ్ళాడో తెలీదు ఎలా వున్నాడో తెలీదు ఈ పరిస్థితి అమ్మనీ, నాన్ననీ కృంగదీసింది బాగా ! బైటికి యెంతో ధైర్యంగా వున్నట్లు అగు పిస్తున్నా, వాళ్ళెంత కుమిలిపోతున్నారో, వాడిపోయిన మొహాలు చూస్తేనే తెలిసిపోతుంది అన్నయ్య మాకు దూరమవ్వడం నాకూ యెంతో బాధగా వుంది. కాని, నా బాధను దిగమింగుకుంటున్నాను ఈ పరిస్థితుల్లో మన వివాహపు ప్రతిపాదనవస్తే, నేనేం సమాధానం చెప్పగల్ను చెప్పండి," ఆవేదనతో చెప్పుకుపోయింది

అంతా విన్న గిరి, యెంతో బాధపడ్డాడు 'నిజమే ! యీ పరిస్థితుల్లో ఆమె వివాహం చేసుకుందుకు యెలా అంగీకరిస్తుంది? అనుకున్నాడు

"క్షమించు సరళా ? నీ మనస్సుని గాయపర్చాను మీ అన్నయ్య సంగతే నాకు తెలీదు నువ్వెప్పుడూ చెప్పలేదు కూడాను "

"ఏమని చెప్పనండీ ? ఎలా చెప్పను ? మంచిని యెవరైనా గొప్పగా, ఘనంగా చెప్పుకుంటారు కాని, చెడుని, తలవంపు తెచ్చేవిషయాన్ని బాహాటంగా చెప్పుకునే సాహసవంతులు చాలా అరుదుగా వుంటారండీ ! మా అన్నయ్యే గనక అందరిలా వుద్యోగం చేసుకుని గౌరవంగా బ్రతుకుతూవుంటే, ధైర్యంగా ఆ విషయాన్ని చెప్పేదాన్ని లేదా, యే రచయితో, చిత్రకారుడో,

నటుడో? గాయికుడో అయ్యుండినా, మరీ గొప్పగా, మీరు అడక్కపోయినా చెప్పేదాన్ని కాని అలా చెప్పుకునే అదృష్టం నాకు లేదు మా అన్నయ్య దొంగతనం చేస్తాడని, యింట్లోంచి పారిపోయాడని, మీతో యెలా చెప్పను చెప్పండి ? నేనేకాక—ఎవరుమాత్రం చెప్పుకుంటారు చెప్పండి ?" అంది సరళ, జీరవోయిన స్వరంతో

ఆమె యెంత బాధపడుతూ చెబుతోందో, అవగాహన చేసుకున్నాడు, గిరి

"నువ్వు చెప్పింది అక్షరాలా నిజం సరళా ! కాని, నాతో చెప్పడానికి, నువ్వింత సందేహించకుండా వుండాల్సింది అయితే, మీ అన్నయ్య జాడే తెలీదం లేదన్న మాట ..?"

"తెలీడం లేదండీ ! మా నాన్నగారు కొన్ని ఊళ్లల్లో వున్న స్నేహితులకి కూడా వుత్తరాలు రాశారు అక్కణ్ణించి జవాబులొచ్చాయి మా అన్నయ్య కనిపించనే లేదని "

క్షణం ఆలోచనలో పడ్డాడు, గిరి

"అయితే, మీ అన్నయ్య మరి తిరిగి రాడన్న అభిప్రాయమే మీ అందరికీ వుందా ?"

"తిరిగి తప్పకుండా వస్తాడన్న ఆశ, నాకు లేకపోలేదండీ ! కాని, మా నాన్నగారు అందుకు భిన్నంగా భావిస్తున్నారు అందుకు కారణం మా అన్నయ్యలో ఆత్మాభిమానం కాస్తంత అధికం "

"ఇంతకీ మీ అన్నయ్య సమస్య తేలేవరకూ వివాహం చేసుకోనంటావు... అంతేగా ?"

"నేననడమేమిటండీ? మీ రాలోచిస్తే మీకూ అది సబబేననిపిస్తుంది ''

"నిజమే సరళా! నీ నిర్ణయంతో నేనూ ఏకీభవిస్తున్నాను...అయితే, మీ అన్నయ్య ఫలానా చోట వున్నాడని తెలిస్తే, బావుండేదే..."

"అది తెలీకనే కదండీ యింత కంగారూను..."

గిరి క్షణం మౌనంగా ఆలోచించాడు ఇప్పుడేం చెయ్యాలి? ఎలా అతని ఆచూకీ తీయ్యాలి ?..

"మీ అన్నయ్య ఫోటో ఉందా నీ దగ్గర?" అడిగాడు, ఆసక్తిగా

"నా దగ్గర లేదండీ ? ఇంట్లో వుంది .."

"పదవుతే, ఇవాళ మీ యింటికి వస్తాను..."

"మా యింటికా ?" కంగారుగా అంది, సరళ

"ఏం అలా కంగారుపడుతున్నావు? నేను మీ యింటికి రావడానికి నిషేధం ఏమైనా వుందా?'' మెల్లగా నవ్వుతూ అన్నాడు గిరి

"అబ్బే! అదేం కాదండీ! మా నాన్నగారు ఏమంటారోనని...'' సీళ్ళు నమిలింది, సరళ

"ఇప్పుడు కాపోతే మరి కొన్నాళ్ళు పోయాకనయినా, మనం బైటపడాలికదా సరళా ఆ తెలీదమేదో, ఇప్పుడే మన పెద్దలకి తెలియనీ ఇందులో తప్పేముంది? మన వివాహం యెప్పుడు జరిగినా, పెద్దల అనుమతితోనే జరుగుతుందిగాని, రహస్యంగా కాదు"

సరళ ఆటంకం చెప్పలేకపోయిందింక

"సరే! పదండవుతే!" లేచింది

గిరి లేచి కౌంటరు దగ్గరికి పోయి బిల్లు చెల్లించి రోడ్డుమీది కొచ్చాడు సరళ అతన్ని అనుసరించింది

* * *

ముకుందం ఆఫీసునుంచి వచ్చి ఎక్కువసేపు కాలేదు వాలు కుర్చీలో కూచుని విశ్రాంతి తీసుకుంటున్నాడు

"నమస్కారమండీ..." సవినయంగా అన్నాడు, గిరి సరళతోపాటు లోపలికొస్తూ

ముకుందం తలెత్తి చూశాడు కూతురు వెంట కొత్తవ్యక్తిని చూసి, క్షణం స్తంభించిపోయాడు చప్పున తేరుకుని

''నమస్కారం... నువ్వెవరో నేను గుర్తుపట్టలేదబ్బాయ్..." అన్నాడు కళ్ళద్దాన్ని సవరించుకుంటూ

"మనం కలుసుకోవడం ఇదే ప్రథమంలెండి...నా పేరు గిరి మిమ్మల్ని కలుసుకోవాలని చాలా రోజుల్నుంచి అనుకుంటున్నానండీ! కానీ, వీలు పడలేదు..." వినయపూర్వకంగా అన్నాడు

సరళ మెల్లగా లోపలికి జారుకుంది "కూచోవోయ్ ... నిల్చుండిపోయావేం?" ఎదురుగా వున్న ఆసనాన్ని చూపిస్తూ అన్నాడు ముకుందం

గిరి, ముకుందంకి అభిముఖంగా ఆశీనుడయ్యాడు

"ఈ ఊరేనా?''

"కానండీ!''

''ఏంచేస్తున్నావు?



"ట్రెయినింగ్ పూర్తి చేసుకుని, ఈ రోజే వచ్చానండి పోస్టింగ్ కూడా ఇఊళ్ళోనే అయ్యింది"

ముకుందం నవ్వేడు సన్నగా "అసంపూర్తి జవాబులు చెబుతారేమిటోయ్ యిప్పటి కుర్రాళ్ళకి అంతా తొందరే ట్రెయినింగ్ పూర్తి వెయ్యడమంటే, యే ఉద్యోగం కోసం!"

తన తొందరపాటుకి, పొరపాటుకి సిగ్గుపడ్డాడు గిరి నిజవే మరి—ఆయన అన్నట్లు అసంపూర్తి సమాధానమే అది

"క్షమించండి సార్! మీలాంటి పెద్దలను చూసేనే కంగారుగా వుంటుందంటీ! మరి మీలాంటి వారి సమక్షంలో మాట్లాడాలంటే చెప్పటో యేదికూడా మర్చిపోతాం పోలీస్ ఇనస్పెక్టరుగా ట్రెయినింగ్ తీసుకొని వచ్చానండీ! ఇక్కడే పోస్టింగ్ ఇచ్చారు .."

"వెరీగుడ్...నీ పర్సనాలిటీకి తగిన ఉద్యోగంలో చేరావు...బావుంది"

సరళ అప్పుడే రెండు కప్పులతో కాఫీ తీసుకొచ్చి తండ్రికి, గిరికి, చెరోటి అందించింది

"మా అమ్మాయి నీ కెట్లా తెలుసునోయ్?" కాఫీ తీసుకుంటూ గిరి మొహంలోకి చూసి అన్నాడు ముకుందం.

ఆ ప్రశ్న వినేసరికి కాస్తంత తడబడ్డాడు గిరి అంత ధైర్యంగా చెప్పిన వ్యక్తి, ఆ ప్రశ్న వినగానే యెందుకలా కంగారుపడిపోతున్నాడో బోధపడ లేదు సరళకి తనలో నవ్వుకుంది మెల్లగా అక్కణ్ణుంచి జారుకోబోయింది "నువ్వెళ్ళిపోవద్దమ్మా...వుండు..." అన్నాడు ముకుందం "ఏవిటోయ్, అలా తడబడిపోతున్నావు, ఏదో తప్పు చేసినవాడిలా?" గిరిని సూటిగా చూస్తూ అడిగాడు

అబ్బెబ్బే తడబడటం లేదండీ చెప్పానుగా, మీ లాంటివారి సమక్షంలో మాట్లాడమంటే కంగారుగా వుంటుందని...అంతే, మరేం ..సరళకి నాకూ చాలా రోజులుగా పరిచయం వుందండీ. అయితే మా పరిచయం మరీ సన్నిహితానికి పోలేదు కాని, యిలా యెన్నాళ్ళు కేవలం పరిచయస్తులుగానే వుంటాం చెప్పండి పెద్దవాళ్ళతో మాట్లాడి పెళ్ళిచేసుకుందామని ప్రతిపాదించాను ప్రస్తుత పరిస్థితులలో తాను పెళ్ళికి అంగీకరించలేనంటూ వాళ్ల అన్నయ్య విషయం చెప్పింది సరళ అంతా విని, నేను చాలా బాధపడ్డానండీ ఈ విషయంలో నాకు చేతనైన సహాయం చెయ్యాలనిపించింది ఎలాగూ మిమ్మల్ని కలుసుకో వాలని అనుకుంటున్నానుగా యిప్పుడీ అవకాశం వచ్చింది కాబట్టి నేరుగా వచ్చాను మీ అబ్బాయి ఫోటో వుంటే ఒకటివ్వండి అతనెక్కడున్నాడో, యేమిటో ఆరా తియ్యటానికి ప్రయత్నిస్తాను" అన్నాడు గిరి, గుక్కతిప్ప కుండా

కొడుకు ప్రస్తావన వచ్చేసరికి, ముకుందం మొహం వాడిపోయింది

"నువ్వుమాత్రం ఎలా ప్రయత్నించగలవు బాబూ! వాడు ఎక్కడుంటు న్నాడో తెలీదు కనీసం వాడుండే వూరు తెలిసినా ప్రయత్నించవచ్చు అదీ తెలీదుకదా!" నిరుత్సాహంగా అన్నాడు

"మీరన్నది నిజమే ననుకోండి కాని, వుద్యోగరీత్యా యెన్నో వూళ్ళు తిరు గుతూ వుంటాను మన అదృష్టం బావుంటే యెక్కడయినా తారసపడొచ్చు

చెప్పలేం...మీ అబ్బాయిని నేనెప్పుడూ చూళ్ళేదుగా అందుకే ఫొటో అవసరం—"

గిరి కలుపుగోలుతనానికి సంతోషించాడు ముకుందం

"మాకు సహకరించడానికి నువ్వు ముందుకొచ్చినందుకు యెంతో ఆనందంగా వుంది బాబూ..."

''ఇందులో నా స్వార్థంకూడా కొంత వుంది కదండీ!'' నవ్వేశాడు గిరి

"అయినా సరే ఇంతటి గౌరవ అందరితోనూ వుండదు అబ్బాయి ఫోటో తప్పకుండా యిస్తాను నీ శాయశక్తులా ప్రయత్నించు బాబూ! ఆ పైన మా అదృష్టం...'' అంటూ కూతురుకేసి తిరిగాడు ముకుందం

"అన్నయ్య ఫోటో ఒకటి ఇవ్వమ్మా!" అన్నాడు

సరళ టేబుల్ దగ్గరికి వెళ్ళి ఆల్బమ్‌లో ఉన్న ఫోటో తెచ్చియిచ్చింది గిరి ఆ ఫోటోను క్షణంపాటు తదేకంగా పరిశీలించి, షర్టుజేబులో పదిలపర్చుకున్నాడు

''మరి, నేను వెళ్ళొస్తానండీ." అంటూ లేచాడు గిరి

''ఇంతకీ, నీ వివరాలూ, నీ కుటుంబ వివరాలూ యేమీ చెప్పావ్ కాదోయ్ ''

గిరి మళ్ళీ కూచుండిపోయాడు ''మా నాన్నగారు తాశీల్దారు గా పనిచేసి రిటైరయ్యారండీ! ప్రస్తుతానికి యింటిదగ్గరే వుంటున్నారు మా తలిదండ్రులకి నేను ఏకైక పుత్రుణ్ణి గాంధీనగరంలో మాకో శాబాయిల్లు వుందండీ! నా విషయం యింతకుముందే చెప్పాను క్లుప్తంగా సవివరంగా మా వివరాలు మీరు ఇంకా యేమన్నా తెలుసుకోవాలంటే అడగండి దాపరికం లేకుండా చెప్పేస్తాను " అన్నాడు గిరి

"అబ్బే మరేం వద్దులే! వూరికనే తెలుసుకోవాలనే అపేక్షకొద్దీ అడిగాను, అంతే మరేం అనుకోకబ్బాయ్ "

' దానికేముందండీ! మరి నాకు సెలవిప్పించండి వస్తా...'' సవినయంగా నమస్కరించి నిష్క్రమించాడు, గిరి, సరళకేసి ఓ క్రీగంటి చూపు విసురుతూ

గిరి వెళ్ళిపోయినవైపే చూస్తూ క్షణం పోయాక కూతుర్ని వుద్దేశించి అన్నాడు ముకుందం ''అబ్బాయి చాలా వుత్తముడులా వున్నాడమ్మా! ఈ కాలపు కుర్రాళ్లలో యింత సమత గలవాళ్లని చాలా అరుదుగా చూస్తుంటాం!"

' నాకూ అట్లాగే అనిపించింది, నాన్నా! చాలారోజుల్నుంచి మామూలుగా

వరిచయముంఉన్న యేరోజుకూడా అసభ్యంగా ప్రవర్తించడంగాని, హద్దుమీరి మాట్లాడడంగాని జరగలేదు నన్ను చూడకుండా ఓ క్షణం వుండలేనంటాడు నాతో మాట్లాడడమే ఒక ఆనందమంటాడు నేనంటే అంత అభిమానం ఇప్పుడు వుద్యోగం అయిందిగా—పెళ్ళిచేసుకుందామని ప్రతిపాదించాడు. కాని, నేను ప్రస్తుతానికి అంగీకరించలేదు ఒక ప్రక్క మనందరమూ అన్నయ్య గురించి బాధపడుతూ వుండగా, నా పెళ్ళి ప్రయత్నం హాస్యాస్పదంగా వుండదూ! అందుకే నా అనంగీకారాన్ని తెలిపి మన యింటి పరిస్థితి చెప్పాను విని చాలా బాధపడ్డాడాయన మనింటికొస్తానన్నాడు వద్దని యెలా చెప్పను చెప్పండి!''

"అతన్ని తీసుకొచ్చి మంచిపనే చేశావులే అమ్మా! పెద్దవాళ్ళం—నీ బాగో గులు కోరేవాళ్ళం మాకూ ఈ విషయం తెలియాలిగా!" అన్నాడు ముకుందం

తండ్రి చీవాట్లు పెట్టనందుకు సంతోషించింది సరళ అదే సమయంలో లోప ల్నించి వచ్చింది కమల

"ఏవిటండీ ," అంటూ

''మరేంలేదు కమలా గిరి అనే ఓ అబ్బాయి వచ్చాడు సరళతో పరిచయ మున్నవాడట...మన అబ్బాయి విషయం విని, సానుభూతి తెలియజేస్తూ, వాడి ఉనికి తెలుసుకోడానికి తాను ప్రయత్నిస్తానంటూ ముందుకొచ్చాడు. చాలా మంచివాడులా వున్నాడులే..." గుక్కతిప్పకుండా చెప్పాడు, ముకుందం

కమల మొహంలో రంగులు మారినయ్ కూతురుకేసి తీక్షణంగా చూసింది

''ఏమే నీకు స్నేహితుడుకూడానా! మీ అన్నయ్య చూస్తే అలా తయా రయ్యాడు వాడి జీవితం గురించే మా గుండెలు గోలచేస్తూ ఆర్చుకుపోతున్నయ్ ఇప్పుడేమో నువ్వు స్నేహాలు ప్రారంభించావా? అసలు ఈ చదువింక వద్దని నేను చెబితే, మీ నాన్నగారు వింటేగా! ఇంక నీకోసం మేమెన్ని పడాలో తల్లిగా, స్త్రీ గా, తన భయాన్ని, ఆందోళనని వ్యక్తపరచింది కమల, కా[illegible] కటువుగా నే

సరళ నివ్వెరపోయింది.

'అది కాదమ్మా...'' అని సరళ యేదో చెప్పబోతూ వుంటే కమల గుర్రుగా చూసింది.

"మరింకేం చెప్పకు... నీచేత చెప్పించుకోడానికి నేనేం చిన్నపిల్లను కాను ఇటువంటి స్నేహాలకి స్వస్తిచెప్పు లేదా చదువు మానేసి, ఇంట్లో కూచో '' విసురుగా అంది





సరళ దిమ్మెరపోయి తల్లికేసి అలా చూస్తూ వుండిపోయింది విగ్రహంలా తాను చెప్పబోయేది తల్లి వింటేగా !...అనుకుంది

ముకుందం, విసుగ్గా చూశాడు, భార్యకేసి

''అబ్బబ్బ నీ ధోరణి నీదేనా? లేక నా మాట యేమైనా వింటావా!" అన్నాడు

"మరేం విననవసరం లేదండీ! నేను ఆ పాటి వూహించలేని వెర్రినాగమ్మ ననుకున్నారా ? ఆ అబ్బాయి సరళని వివాహం చేసుకుంటానంటున్నాడు అంతేనా?" ఎదురు ప్రశ్న వేసింది కమల

''ఔను అక్షరాలా అలాగే అంటున్నాడు కాని, అమ్మాయి అంగీకరించ లేదు. నరహరి సమస్య ఓ కొలిక్కి వచ్చేవరకూ, వివాహ ప్రసక్తి లేదన్నదట అదంతా తెలుసుకున్నాక యీ అబ్బాయి మనింటికొచ్చాడు మన నరహరి ఫోటో తీసుకెళ్ళాలని మనవాడి ఆచూకీ తియ్యడానికి తన ప్రయత్నాలు తాను చేస్తా నంటున్నాడు...అర్థమయిందా?"

"అబ్బో! ఏం చేస్తాడేం? మనం యిన్ని ప్రయత్నాలుచేసి ఫలితం సాధించ లేకపోయాంగాని, యీయనెవరో పెద్ద పోలీసు ఆఫీసరులా పోజుపెట్టి వెదుకు తానన్నాడన్నమాట.. బావుంది...'' వెటకారంగా అంది కమల

"నీకు ఆవేశమేగాని ఆలోచన తక్కువ కమలా! ఈ అబ్బాయి పోలీసు ఇనస్పెక్టరుగా ట్రెయినింగు తీసుకుని యిక్కడే పోస్టయ్యాడట హుషారుగా వున్నాడులే ఈసారి వస్తే చూస్తావుకదా! మనిషి చాలా మంచివాడిలానే కని పిస్తున్నాడు "

ఆ! మగాళ్ళంతా మొదట్లో మ చివాళ్ళలాగే కనిపిస్తారండీ! ఆడది ఏపాటి ఆలసిచ్చినా ఆ మంచితనమంతా మంచుముక్కలా కరిగిపోతుంది," అంటూ సరళ కేసి తిరిగి "ఏమైనా అమ్మాయ్ నేను కచ్చితంగా చెబుతున్నాను.. మరీ నమ్మకంగా అతనితో తిరగొద్దు ఏ పుట్టలో యేముందో, ఎవరూ చెప్పలేరు చదువుకుంటున్నదానివి. నీకు విడిగా ఏమీ చెప్పనవసరంలేదు అర్థ మయిందా?" అంది విసురుగా

సరళ బిక్కమొహం వేసింది తాను యేదో తప్పు చేస్తున్నట్టుగా నే తల్లి జ్ఞానోపదేశం యెందుకు చేస్తుందో, ఆమెకి అర్థమై చావలేదు

"నాకు మాత్రం తెలీదటమ్మా?" అని మాత్రం అంది

"తెలిసినా నిన్నోసారి హెచ్చరించడం తల్లిగా నా కర్తవ్యమమ్మా!" అంది కమల

"పోనిద్దూ! అంతా నీ చాదస్తంగాక పోతే యేమిటి? అదేం చిన్నపిల్లాయేమా" అన్నాడు ముకుందం

"మీరు అట్లాగే అంటారండీ కాని మనం మరీ గారాబంచేసి, అబ్బాయిని యెట్లా తయారుచేశామో, పర్యవసానాన్ని ఎలా అనుభవిస్తున్నామో ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోండి!" నిష్ఠూరంగా అంది కమల

"అది వేరు కమలా!" అంతే అనగలిగాడు కాని, మరే కారణం చెప్పలేక పోయాడు

నరహరి విషయం యింక ప్రస్తావించ దల్చలేదు కమల

"సరే! ఇప్పుడవన్నీ యెందుకు లెండి అబ్బాయి ఈ సారొస్తే గాని చెప్పండి."

"అలాగే! నువ్వు చూస్తే నాతో ఏకీభవిస్తావ్..."

'సరే అవతల పని చూసుకోవాలి..." అంటూ అక్కణ్ణుంచి వెళ్ళి పోయింది,

సరళ ఖాళీ కప్పుల్ని తీసుకుని తల్లిని అనుసరించింది

ముకుందం కుర్చీలో వెనక్కి చేరబడి, ఆలోచనల్లో పడ్డాడు

* * *

సాయంత్రం అయిదు దాటింది ఎండ తీవ్రత బాగా తగ్గిపోయింది పడమటి దిక్కున సూర్యుడు తన విశ్రాంతిమణికి తయారీలో వున్నాడు పార్కులో చిన్నపిల్లలు ఆడుకుంటున్నారు గిరి, సరళ ఓ చోట పచ్చికలో కూచున్నారు



"మీ నాన్నగారు చాలా సూటిగా మాట్లాడుతారు సరళా అలా మాట్లాడే వాళ్లంటే, నా కెంతో ఇష్టం..." అన్నాడు గిరి

"మా అమ్మను మీరు చూళ్లేదు ఆమెతో మాట్లాడలేదు ఆమె మరీ ఖచ్చితంగా మాట్లాడే మనిషి. మీతో చనువుగా తిరుగుతున్నందుకు, అప్పుడే నన్ను హెచ్చరించింది కూడా"

గిరి మెల్లగా మందహాసం చేశాడు, "నిజమే మరి తల్లిగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించింది అందుకు మనం బాధపడకూడదు ఈ వయసులో మనకి ఇటువంటి హెచ్చరికలు అవసరం కూడాను.."

"అందుకే నేనూ బాధపడలేదండీ! ఆమె బాధ్యతని నే నర్థంచేసుకున్నాను"

"సరేగాని, మీ అన్నయ్య అలవాట్లు కాస్త చెబుదూ!"

"నాకు తెలిసినంతవరకూ, సిగరెట్లు తెగ కాలుస్తాడండీ! అందమైన అమ్మాయిలు అగుపిస్తేచాలు, కళ్ళప్పగించి చూస్తూ నిల్చుండిపోతాడు ఫాల భాగం మీదికి పడుతూండే జుట్టును చేత్తో సవరించుకోవడం ముఖ్యంగా చెప్పుకోదగ్గ అలవాటు అయితే, యిప్పుడా జుట్టు వుందో, లేదో, చెప్పలేం"

"ఏపాటి పొడుగుంటాడు?"

"మీ అంత పొడుగే వుంటాడుగాని, సన్నంగా వుంటాడు "

"శరీరచ్ఛాయ..."

"నా ఛాయే!"

"రంగు రంగు దుస్తులు వాడ్డం అలవాటుందా?"

"ఔనండీ! మరీ గాఢమైన రంగులే వాడుతూవుంటాడు "

"షర్టు టక్ చేస్తాడా? లేక స్లాక్ వేస్తాడా?"

"టక్ చేయడం మొదట్నుంచీ వున్న అలవాటు ఔనూ, నాకు తెలీక అడుగుతాను...యీ వివరాలన్నీ యెందుకు మీకు?" గిరి మొహంలోకి చూస్తూ అంది సరళ

గిరి మెల్లగా నవ్వేడు "ఇదేం ప్రశ్న! ఫోటో ఒక్కటేవుంటే సరిపోతుందనుకుంటున్నావా? ఈ వివరాలన్నీ తెలిస్తే, అతణ్ణి గుర్తుపట్టడం సులువవుతుంది "

"నిజంగా మీరు పోలీసు డిపార్టుమెంటనిపించుకున్నారండీ!" నవ్వుతూ అంది మీకు నమ్మకం వుందా మా అన్నయ్య వునికి తెలుస్తుందని?"

"జ్యోతిషం చెప్పలేనుగాని, మా డిపార్టుమెంటువారికి అసాధ్యమైన పనంటూ వుండదు 'నమ్మకం' మాలో వుండాల్సిన ప్రధానగుణం పట్టుదల రెండోది ఈ రెండూ వుంటే, యేదీ అసాధ్యంకాదు అందుకే నాకు నమ్మకంవుంది, మీ అన్నయ్య తప్పంకా కనిపిస్తాడని "

"మీ ప్రయత్నం ఫలించాలని నేను కోరుకుంటున్నానండీ, మీవల్లనైనా మా అన్నయ్య జాడతెలిస్తే మా కుటుంబానికి ఎంతో మేలు చేసిన వారవుతారు "

నా ప్రయత్నం నేను చేస్తాను సరళా, ఫలితం దైవాధీనం.''

"మీకూ దేవుడిమీద నమ్మకంవుందా?" సంశయాత్మకంగా ప్రశ్నించింది సరళ

గిరి నవ్వేడు ''అదేమిటి?...పోలీసు డిపార్టుమెంటులో వున్నవాళ్లు నాస్తికులని నీ వుద్దేశ్యం? అదేంకాదు అందరిలానే మాకూ భగవంతుడంటే అపారమైన నమ్మకం, భక్తి, వున్నయ్ ''

సరళ రిస్టువాచి చూసుకుంది ఆరుగంటలు కావస్తోంది సంజె వెలుగులో పార్కులోని చెట్లు, పూలమొక్కలు శోభాయమానంగా అగుపిస్తున్నాయి అప్పటికి జనం బాగా వస్తూనే ఉన్నారు

"బాగా వేళవుతోందండీ! పోదాం మరి "

"పద అంతవరకూ నీతో వచ్చి వెనక్కి తిరిగిపోతాను..." అంటూ లేచాడు గిరి

ఇరువురూ పార్కు బయటికి నడుస్తూవుంటే చాలామంది దృష్టి వాళ్ళమీదే పడింది

* * *

రోజులు గడిచిపోతున్నయ్—

గిరి, తన వుద్యోగపు బాధ్యతతోపాటు నరహరి ఆచూకీ తీయాలన్న బాధ్యత కూడా నెత్తిన వేసుకున్నాడు ఏ వూరు వెళ్ళినా, అతని దృక్కులు మాత్రం నరహరి కోసం వెదుకుతూ వుండేవి కాని, అనుకున్నంత సులువుగా కనిపించలేదా ప్రయత్నం తానిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోగలనా లేదా అన్న ఆందోళన గిరిలో పెరుగుతోంది

ఓ రోజు ఏలూరు వెళ్ళాల్సి వచ్చింది రాత్రి రైలులో బయలుదేరాడు ఏలూరు స్టేషన్‌లో బండి ఆగడంతో అతని దృష్టి మామూలుగానే ప్రతి వ్యక్తిని పరిశీలిస్తుంది. హఠాత్తుగా ఓ స్తంభానికి చేరబడి సిగరెట్ కాలుస్తోన్న వ్యక్తిమీద పడింది దృష్టి గిరి కళ్ళు ఆనందంతో మెరిసినయ్...మరింత పరిశీలనగా పరికించాడు నీలంరంగు షర్టు టక్ చేసుకుని వున్నాడు జుత్తు ఫాలభాగం మీద పడుతూంటే చేతో ఎగదోస్తున్నాడు అతను నరహరే! సందేహంలేదు సరళ శరీరచ్ఛాయతోనే ఉన్నాడు కంపార్టుమెంటులోంచి దిగాడు వెంటతెచ్చిన చిన్న సంచీ చేతపట్టుకుని అందులో పంచె, టవలూ, టూత్ పేస్టూ, బ్రష్, ఉన్నయ్

రైలు కదిలింది, ప్లాట్‌ఫారం దాటి వెళ్ళిపోయింది కొత్తవ్యక్తిలా చుట్టూ ఓసారి పరికించి చూశాడు గిరి తను ఎవర్ని చూసి దిగాడో, అతనికి దగ్గరగా వెళ్ళి అతణ్ణి చూసి తన నిర్ణయాన్ని ధృవపర్చుకున్నాడు జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి అందులోవున్న ఒకే ఒక సిగరెట్‌ని నోట్లో పెట్టి, ఖాళీ పెట్టెను దూరంగా పారేసి ఆ వ్యక్తిని అగ్గిపెట్టెకోసం అడిగాడు

అతను విసుగ్గా జేబులోంచి లైటరుతీసి అందించాడు అతని చూపు చాలా సునిశితమైనదనీ అప్పుడు గమనించాడు గిరి సిగరెట్ వెలిగించి లైటర్ ఇచ్చేశాడు, అతను నిరుత్సాహంగా అక్కడ్నుంచి కదిలాడు. అయితే గిరి మాత్రం అతణ్ణి వదల్లేదు,

"సార్..." అంటూ వెనకనుంచి కేకవేశాడు

అతను వెనుదిరిగాడు.

"నన్నేనా ?" అన్నాడు సందేహంగా.

"ఔనండీ !" దగ్గరగా వెళ్ళాడు గిరి.

"చెప్పండి..." అసహనంతో అన్నాడు ఆ వ్యక్తి.

"మరేంలేదండీ నేను ఈ ఊరికి కొత్త. హోటలు ఎక్కడుందో చెప్ప గలరా...?" అడిగాడు గిరి.

"నాతో రండి..." అన్నాడతను.

అతని మంచితనానికి సంతోషించాడు గిరి. మరొకరయితే ఫలానాచోట వుందని చెప్పి మరీ వెళ్ళిపోయేవారు. కాని ఆయన తనవెంట తీసుకెళ్ళటం అతని మంచితనాన్ని చెబుతుందనుకున్నాడు.

"థాంక్సండీ దేవుడిలా అగుపించారు. ఈపాటి సహాయంకూడా ఈ రోజుల్లో యెవరూ చెయ్యరండీ"

"ఎవరి బాధల్లో వారుంటే యివన్నీ చెప్పుకూర్చునే తీరిక యెవరికుంటుం దండీ ? నేను అక్కడికే వెళుతున్నాను గాబట్టి నాతో రమ్మన్నాను..."

ఇరువురూ స్టేషను బయటికి నడిచారు. అక్కడున్న ఓ సామాన్యమైన హోటల్లోకి దారితీశాడు ఆ వ్యక్తి. గిరి అతన్ని అనుసరించాడు.

"ఇంకా ఊళ్ళోకి పోతే మంచి హోటల్స్ ఉన్నాయనుకోండి కాని ప్రస్తుతానికి కడుపు తడుపుకుందుకు ఇది చాలు..."

"ఇది చాల్లెద్దురూ! పెద్ద పెద్ద హోటళ్ళు నా కెందుకండీ నా అంతస్థుకి ఇది చాలు..."

సర్వర్ వచ్చి నిల్చున్నాడు.

"ఏం కావాలి సార్!"

"రెండు ప్లేట్ల పకోడి రెండు కాఫీ తీసుకురా..." గిరి ఆర్డరిచ్చాడు.

"నేనిప్పుడేం తిననండి కాఫీ తీసుకుంటాను..." ఆ వ్యక్తి అన్నాడు

"ఫరవాలేదు లెద్దురూ? ప్లేటు పకోడి ఏమాత్రంమండీ ! ఓ పంటిక్రిందికి వస్తాయి. వెళ్ళి తీసుకరావోయ్..."

సర్వర్ వెళ్ళిపోయాడు.

"మనం ఒకరొకరం పరిచయం చేసుకోలేదు..." ఆ వ్యక్తి అన్నాడు. అతని దృష్టి ఎందుకోమరి, గిరి దగ్గరున్న సంచీమీద అప్పుడప్పుడూ పడుతూ ఉంది.




"నిజమేనండీ! పరిచయం అవసరమే! నా పేరు...గిరి "

"ఆశ్చర్యంగా వుందే ! నా పేరు హరి ... మన పేర్లు ప్రాసయుక్తంగా వుండటం, అనుకోకండా మనం కలియడం, మరీ గమ్మత్తుగా వుంది కదండీ!" హుషారుగా నవ్వుతూ అన్నాడు, హరి

"ఒక్కొక్కప్పుడు పేర్లు అలా కలిసిపోతాయండి !''

"మీరేం చేస్తున్నారు ? ఎక్కణ్ణించి వస్తున్నారు ? మీకు అభ్యంతరం యేమీ లేకపోతే చెప్పండి...''

''వివరాలు చెప్పడానికి, అభ్యంతరం యేముందండీ ! నిజానికి, నాకో ఊరంటూ లేదండీ హరిగారూ ! అనుకోకండా మనం కలుసుకుని, పరిచయాన్ని చేసుకున్నాం గాబట్టి, వున్న వున్నట్టు మనసు విప్పి చెప్పేయాలనిపిస్తోంది చెప్పేస్తాను ... నేను మద్రాసులో కొన్నాళ్ళు వున్నానండీ ! అక్కడ పాండీ బజార్లో తిరిగేవాణ్ణి అవకాశం చిక్కినప్పుడంతా పాకెట్లు కత్తిరించడం అలవాటుండేది ఇప్పటికీ ఆ అలవాటుందనుకోండి ..మరేం అనుకోకండి ..మీ దగ్గర దాపరికం వుంచదల్చుకోలేదు కొన్నాళ్ళు బాగా— గడిచింది జేబుదొంగలకి కిరీటంలేని రాజుగా కొన్నాళ్ళు వెలిగిపోయాను అయితే, యిప్పుడు దొంగల సంఖ్య విపరీతంగా పెరిగిపోవడంతో, నా ఆదాయంలో తగ్గుముఖం కనిపించింది ఒక స్థాయికి అలవాటుపడ్డ నాలో నిరుత్సాహం పెరిగింది ఇంక అది అనువైన చోటు కాదనిపించింది అక్కణ్ణించి హైదరాబాద్ వెళ్ళాను అక్కడా కలిసిరాలేదు నేరుగా యిక్కడికి వచ్చేశాను ఇక్కడ నా అదృష్టం యెట్లా

వుంటుందో చూడాలి ఉద్యోగాన్వేషణ జరిపినట్టే, నా బ్రతుకు తెరువుకి యీ విధంగా అన్వేషిస్తున్నాను ఏంచెయ్యను చెప్పండి? ఈ వృత్తి మంచిది కాదు...నిజమే! కాని, నాలాంటివాడికి తప్పదు", అంటూ తన గాధను ముగించాడు, గిరి

హరి, గిరి విషయాలు తెలుసుకుని మురిసిపోయాడు

"అంటే, మీరు హస్తలాఘవంలో పట్టభద్రులన్నమాట ..." నవ్వుతూ అన్నాడు, గిరి

"నన్ను ఎగతాళి చెయ్యకండి సార్! మీ సమక్షంలో అబద్ధం చెప్పడానికి మనస్కరించక, నిజం చెప్పేశాను బ్రతకాలంటే, యేదో ఒకటి చెయ్యాలి కదండీ! అవసరమైన అర్హతలున్నా, వుద్యోగాలు దొరకవు అలాగని, మనకి ఆకలివెయ్యడం మానదు కదా! ఆకలి తీర్చుకోవాలంటే, యేదో విధంగా డబ్బు సంపాదించాలి అందుకే, యీ వృత్తి చేపట్టాను" తనకి తానే చిన్నబుచ్చుకున్నట్టుగా అన్నాడు, గిరి.

హరి, సన్నని మందహాసం చేశాడు

"అబ్బే! నేనేం ఎగతాళి చెయ్యడంలేదండీ! మీలాంటి ఓ స్నేహితుడు లభించినందుకు, నేనెంతగానో సంతోషిస్తున్నాను"

"మీ మాటలు నాకేం అర్థంకావడం లేదండీ!"

హరి, హుషారుగా నవ్వేడు

"ఇకమీదట బోధపడతాయి లెండి ... ఏదీ, చెయ్యి కలపండి ..." చేతిని చాచాడు, హరి

"ఎందుకండీ!"

"ముందు చెయ్యి కలపండి.. "

సర్వరు పకోడీప్లేట్లు తెచ్చిపెట్టాడు ఇద్దరూ తినడం ప్రారంభిస్తుండగా, గిరి, చేతిని కలిపాడు

"డియర్ బ్రదర్, మనం ఒకే కోవకి చెందినవాళ్ళం ... ఇప్పుడు అర్థమయ్యిందా, యెందుకు చెయ్యి కలపమన్నానో!" నవ్వుతూ అన్నాడు, హరి

"అంటే, మీరూ..." తెల్లబోయాడు, గిరి.

"వేరే చెప్పనవసరం లేదండీ!"

సర్వరు కాఫీ తెచ్చిపెట్టాడు దాంతోపాటు బిల్లుకూడా యిచ్చాడు గిరి చప్పున బిల్లు చేతిలోకి తీసుకుని, కాఫీ కప్పు తీసుకున్నాడు

"బిల్లు మీరిస్తారా ?" అడిగాడు హరి

"ఈ రోజుకి నన్ను యివ్వనీండి", అన్నాడు, గిరి

"సరే !"

ఇద్దరూ కాఫీ తీసుకున్నాక లేచారు గిరి బిల్లు పేచేసి, హరితోపాటు బైటికొచ్చాడు

"మీరిప్పుడు యెక్కడికి వెళ్తారు ?" ప్రశ్నించాడు, హరి ఆ ప్రశ్న యెప్పుడు వస్తుందా అని యెదురుచూస్తున్నాడు, గిరి

"అదే ఆలోచిస్తున్నానండీ ! ప్రస్తుతానికి స్టేషన్లోనే వుంటాను"

"ఎందుకూ ? నా గదికి పోదాం పదండి..."

"మీరు గది అద్దెకు తీసుకున్నారా ?"

"ఔనండీ ! రాత్రంతా మేలుకుని వుంటాం పగలైనా హాయిగా కాస్సేపు నిద్రపోవాలంటే, యేదో చిన్న కొంప వుండాలిగా!"

"మీరు బ్రహ్మచారులేనా ?"

"ఇంక యీ బ్రతుక్కి పెళ్ళి కూడానా ? బ్రహ్మచారినే.. మరి మీరో ?" హరి యెదురుప్రశ్న వేశాడు

"డిటో..." నవ్వుతూ అన్నాడు గిరి

"మన జీవితాల్లో చాలావరకు పోలికలు అగుపిస్తున్నయ్ ... మనం కలుసుకోవడం, కేవలం భగవదేచ్ఛనేమో !"

"నాకూ అదే అనిపిస్తోందండీ ! ఏమైనా మీతో పరిచయం కలగడం నా అదృష్టం హరిగారూ ! లేకపోతే, తలదాచుకుందుకు చోటుకూడా దొరికేది కాదు కదా!" కృతజ్ఞతాభావంతో అన్నాడు, గిరి

"దానికేముంది లెండి ... ఒకరికొకరు అనుకోకపోతే, యెట్లా ? పదండి పోదాం..."

ఇరువురూ ముందుకి సాగిపోయారు హరి గదికేసి

* * *

హరి, సిగరెట్లు తెగ కాలుస్తుండటం గమనించాడు, గిరి అతనికి సరళ చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి

"మీరు చాలా సిగరెట్లు కాలుస్తారే ? ఇది ఆరోగ్యానికి మంచిదికాదండీ !'' అన్నాడు రెండోరోజు యిద్దరూ గదిలో కూచుని వుండగా, గిరి

"నాన, యేంచెయ్యడమండీ ! ఈ ఒక్క అలవాటునీ వొదులుకోలేక పోతున్నాను మీకీ అలవాటు లేదనుకుంటాను...

లేదండీ ! అయితే, అప్పుడప్పుడూ కాల్చేస్తూ వుంటాను .. మరి, బ్రాందీ, విస్కీ...,యిలాంటి మత్తుమందు పుచ్చుకయినా తీసుకోరా ."

"లేదండీ! ఆ మత్తు పదార్థాలంటే, నాకు పరమ అసహ్యం మరి, మీరో ?"

'నాకూ అలవాటులేదు కాని అభ్యంతరం వుండదు .ఏమైనా, యీ అల వాట్లకి మనం దూరంగా వుండటమే శ్రేయస్కరం అన్నట్లు, నిన్ననంతా యింట్లోనే కూచున్నాను ... మీరే సంపాదించి తెచ్చారు ఊరు కొత్తనుకుంటూ, యిన్నాళ్ల యింట్లో కూచోవడం చెప్పండి! ఇవ్వాళ, నేనూ మీతో వస్తాను.. '' అన్నాడు, గిరి

"సరే ! మీరు వెళ్తానంటే, నాకు అభ్యంతరం లేదుగాని, కలిసి వెళ్ళడం మాత్రం మంచిదికాదండీ ! విడి విడిగా పోదాం ఏమంటారు ?" తన అభిప్రా యాన్ని వెల్లడిచేశాడు. హరి

"అలాగే !"

"ఈ రోజుల్లో ఫేంట్లకి ముందు జేబులుంటున్నయ్...అందులో డబ్బు పెడు తున్నారు వాటిని తస్కరించినపుడుమాత్రం జాగ్రత్తండోయ్ . " సలహా యిచ్చాడు హరి

నవ్వేడు, గిరి

"ఆపాటి ప్రావీణ్యత లేకుండా యీ వృత్తిని చేపట్టాననుకున్నారా!" ధైర్యంగా చెప్పాడు

గిరి నిబ్బరానికి మనసులో హర్షించాడు, హరి

"ధైర్యే, సాహసే లక్ష్మి .."అన్నారు ఆ ధైర్యం వుండాల్లెండి అన్నట్టు, డూప్లికేటు తాళం మీ దగ్గరుంది కదూ ?"

"వుంది లెండి .."

"తెల్లారే లోపల మనలో యెవరం గదికి చేరుకోపోయినా, పోలీసువారికో, ప్రజలకో పట్టుబడ్డామనే ఊహించుకోవాలి గిరిగారూ ! ఇటువంటి విషయాలు ముందుగానే చెప్పుకుంటే చాలా మంచిది..." అన్నాడు హరి



"మనం పట్టుబడ్డం ఏమిటండీ! అది కలలో మాట.." నిబ్బరంగా చెప్పాడు గిరి.

హరి, గిరికేసి, ఆశ్చర్యంతో చూశాడు

"అంటే, మీరెప్పుడూ పట్టుబడలేదా ?"

"ఎప్పుడో కొత్తలో పట్టుబడ్డానండీ! ఇప్పుడు పట్టుబడేంతటి తెలివి తక్కువ వాణ్ణికాను" అన్నాడు, గిరి

"పోనీ, కీడెంచి మేలెంచమన్నారు కదా పెద్దలు.. అందుకే అలా మనం అనుకుంటే తప్పేముంది చెప్పండి!"

"సరే! అట్లాగే అనుకుందాం"

"ఇక మనం బయల్దేరుదాం—"

"పదండి..."

గది తాళంవేసి, ఇద్దరూ బయలుదేరారు. కొంతదూరం వెళ్ళి విడిపోయారు

* * *

ముకుందం వాలుకుర్చీలో చేరబడి, న్యూస్ పేపరు చదువుతున్నాడు. అతనికి అభిముఖంగా వున్న కుర్చీలో కూచుని, సరళ ఇంగ్లీషు మాగజైన్ చదువుతోంది ఆమె చదువుతోందన్నమాటేగాని, అనుక్షణం 'గిరి' గుర్తు కొస్తూంటే, చదివిందేవిఁటో బుర్రకెక్కడంలేదు అతను కొద్దిరోజుల్నించి అగుపించకపోవడం, ఆమెకి బాగా నిరుత్సాహం కలిగించింది

ముకుందంకి యేదో జ్ఞప్తికి వచ్చినట్టుంది—చదువు ఆపి, కళ్ళద్దాలు ఓసారి సర్దుకున్నాడు

"అమ్మాయ్..." అన్నాడు మెల్లగా

"ఏం నాన్నా ?"

"గిరి అగుపిస్తున్నాడా అమ్మా ?"

"లేదు నాన్నా ! వారంరోజులు కావస్తోంది. ఎక్కడికి వెళ్ళారో, యేవిఁటో తెలీటంలేదు ''

ముందుగా నీతో చెప్పలేదా ?''

"లేదు నాన్నా !'' పేలవంగా అంది. గిరి, తనెక్కడికి వెళ్తున్నాడో చెప్పకపోవడంవల్ల, యీ రోజు తాను తండ్రిముందు చిన్నబుచ్చుకోవల్సి వచ్చి నందుకు బాధపడింది

"ఈనాటి యువకుల్ని నమ్మటం అందుకే కష్టంగా వుందమ్మా మీ అన్నయ్యని వెదుకుతానని ప్రగల్భాలుచెప్పి, ఫోటో తీసుకుపోయి, మనలో యేవేవో ఆశల్ని కల్పించాడు ఇప్పుడేమో అసలు మనిషే అయిపు లేకుండా పోయాడు.'' గిరిమీద నమ్మకం పోయినట్టుగా నిష్ఠూరంగా మాట్లాడాడు, ముకుందం.

వ్యక్తిగతంగా, సరళకి తండ్రిమాటలు షాక్ తగిలించాయి గిరి మాటలపై ఆమెకి ప్రగాఢమైన విశ్వాసం వుంది.

"ఆయన అటువంటివారు కాదని నాకు విశ్వాసం వుంది నాన్నా ! వుద్యోగ రీత్యా యెక్కడికో వెళ్ళివుంటారు...'' అంది

"పిచ్చిదానా ! అందరూ మనలాగే వుంటారని అనుకోకమ్మా ! ఒక్కొక్కప్పుడు మన నమ్మకాన్ని వమ్ముచేస్తారు కొందరు అప్పుడు మనలో, నమ్మకాలకి బదులు మనస్తాపం మిగుల్తుంది '' నిట్టూరుస్తూ అన్నాడు, ముకుందం

ఇటీవల ఆయనలో బాగా నిస్పృహ పేరుకుపోతోంది ఎటువంటి ఆశనీ మనసులో నిలుపుకోలేకపోతున్నాడు. అందుకే, అంత నిరాశతో అన్నాడు.

సరళ మనస్సు చివుక్కుమంది తండ్రిలో యెలా ఆశను రేకెత్తించడమో, ఆమెకి అవగాహన కాలేదు

''మీరు మరీ అంతగా దిగులు చెందకూడదు నాన్నా! తొందరపడి ఆయన గురించి ఒక నిర్ణయానికి రాకండి ఆయన మాట నిలబెట్టుకుంటారనే నమ్మకం నాలో వుంది. నా మనస్సు, ఆయన్ని శంకించడంలేదు ''

"సరేనమ్మా! నీ మనస్సుని బాధించడం యెందుకు? నీ నమ్మకమే, నా నమ్మకం ఆ నమ్మకంతోనే వుందాం ..." అంటూ మళ్ళీ పేపరు చదవడంలో నిమగ్నుడయ్యాడు ముకుందం

సరళ మాగజైను తిరగేస్తోంది కొద్దిసేపటి తరువాత, న్యూస్ పేపరులో యేదో వార్త చదివి, కంగారుపడ్డాడు, ముకుందం

''అమ్మాయ్..." కలవరపాటుతో కేకవేశాడు మెల్లగా.

'ఏవిటి నాన్నా.. ''

''ఈ వార్త వినమ్మా! నెల్లూరులో యెవరో దొంగ జేబుకొడుతూ వుండగా పట్టుకుని, పోలీసులకి అప్పజెప్పారట...'' అన్నాడు ఆత్రంగా

''అటువంటివి, యెన్నో సంఘటనలు జరుగుతూ వుంటాయి నాన్నా! మనకేం?''

''నువ్వు అంత తేలిగ్గా అనేశావేమిటమ్మా! ఆ దొంగ మన నరహరే అయితే..." యింక చెప్పలేకపోయాడు. అతని గొంతు బొంగురుపోయింది

సరళ, ఓ లిప్తపాటు షాక్ తిన్నట్టు తండ్రికేసి చూసింది. వెంటనే తమాయించుకుంది

"అదంతా మీ భ్రమ నాన్నా! అనవసరంగా మీరు కంగారుపడుతున్నారు. దేశంలో యెంతోమంది దొంగలున్నారు ఎవరు పట్టుబడినా, ఆ వ్యక్తి అన్నయ్యే అయ్యుంటాడని మీరు ఊహించి వ్యధ చెందడంలో అర్థంలేదు అటువంటి ఆలోచనలు పెట్టుకోవద్దు నాన్నా!" అంది సరళ

"ఎందుకోనమ్మా అటువంటి ఆలోచనలు అనుకోకుండా వచ్చేస్తున్నాయ్... తట్టుకోలేకపోతున్నాను..."

"ఆ ఆలోచనలనుండి కాస్త దూరంగా వుండండి నాన్నా...కనీసం కొద్ది రోజులపాటు,..".

ముకుందం భారంగా నిట్టూర్పు విడిచాడు చెమ్మగిల్లిన కళ్ళను ఓసారి ఒత్తుకుని పేపరు చదవడంలో మళ్ళీ నిమగ్నుడయ్యాడు

సరళ చదువుతోన్న మాగజైను పట్టుకుని లోపలి గదిలోకి వెళ్ళిపోయింది

*　　*　　*

ఉదయం తొమ్మిది కావస్తోంది అప్పుడే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకుని బట్టలు వేసుకుంటున్నారు, హరి, గిరిను బట్టలు వేసుకున్న హరి సిగరెట్టు వెలిగించాడు

"రెండు రోజులు గా మోసు పర్సులు దొరికాయి అదీ ఎక్కువ డబ్బుతో కాదు ఓ రోజు ఓ పెన్నుతో తృప్తిపడ్డాను గత రెండు రాత్రులూ వట్టి చేతుల్తో తిరిగివచ్చాను అందుకు నేను సిగ్గుపడుతున్నాను, హరిగారూ! అది నా దురదృష్టమే అనుకోవచ్చు..." అన్నాడు గిరి బూటు వేసుకుంటూ

హరి మెల్లగా నవ్వాడు

"దానికేంలెండి గిరిగారూ! ప్రతిరోజూ యేదో ఒకటి దొరుకుతుందని ఆశించలేంకదా దొరికన దాంతోనే సంతృప్తిపడాలి." గిరి నిరుత్సాహపడకుండా చెప్పాడు హరి

"ఔననుకోండి కాని ఇలా ఎప్పుడూ జరగలేదు—ఏ రోజూ నా ప్రయత్నంలో నేను ఓడిపోలేదు."

"ఎప్పుడూ జరగనివి జరక్కూడదని యెక్కడుందండీ! నేనూ వట్టి చేతుల్తో తిరిగొచ్చిన రోజులు చాలా వున్నయ్—అలాగని, నిరుత్సాహపడతామా? అబ్బే మనలో ఆ నిబ్బరం ఉండాలి"

"అదీ నిజమే అనుకోండి అయినా, ఈసారి స్థలం మార్చాలనుకుంటున్నాను రైల్లో ప్రయాణంచేసి ప్రయత్నించాలనుకుంటున్నాను రెండు రోజుల్లో తిరిగి వచ్చేస్తాన్లెండి. ఏమంటారు?"

"వెళ్ళండి...దానికేం...ఎక్కడయితేనేం...మన ప్రయత్నం ఫలించి మీరు ఎప్పుడొచ్చినా, యీ ఇంటి తలుపులు తెరుచుకునే వుంటాయి మనస్నేహం అలాగే వుండాలని కాంక్షిస్తున్నాను మీ మీద నాకు ప్రగాఢమైన నమ్మకం యేర్పడింది" అన్నాడు హరి.

గిరి మనసులో హమ్మయ్య అనుకున్నాడు

"నా ప్రయత్నంకూడా అందుకేనండీ! మన స్నేహానికి ఎప్పుడూ విఘాతం







రాకూడదు, కలకాలం ఇలాగే వుండాలి '' నిబ్బరంతో అన్నాడు ఆ మాటల్లో అర్థం మరోలా వున్నా, హరి అర్థంచేసుకోడానికి అవకాశం లేకపోయింది

"అయితే ఎప్పుడు వెళతారు?"

"ఈ రోజు రాత్రికే బయలుదేరుతానండీ !"

''శుభం ! కార్య సాఫల్యం కావాలని, కాంక్షిస్తున్నాను గిరిగారూ!'

"థాంక్స్ హరిగారూ !"

"పదండి—కాఫీ తీసుకుని వద్దాం—" అన్నాడు హరి లేస్తూ

ఇద్దరూ బయటికొచ్చారు

నిజానికి గిరి చెప్పిందంతా అబద్ధం అతను దొంగతనం చెయ్యలేదు తన దగ్గరున్న డబ్బులో కొంత రెండు ప్లాస్టిక్ పర్సులు కొని వాటిలో పెట్టి రోజు కొకటి తస్కరించి తెచ్చినట్టుగా చెప్పాడు పెన్నుకూడా కొని తీసుకొచ్చిందే అయితే ఇలా ఎన్నాళ్ళు చెయ్యగలడు? అతని వద్దనున్న డబ్బుకూడా అయిపోవస్తోంది అందుకని ఇంటికి తిరిగిపోక తప్పలేదు. దానికి అనుగుణంగా రైల్లో ప్రయాణంచేసి తన అదృష్టాన్ని ప్రయత్నిస్తానని చెప్పాడు అంతేకాదు— తనొచ్చి అప్పుడే వారం రోజులుకావస్తోంది. సరళకి చెప్పికూడా రాలేదు ఆమె యేమనుకుంటుందో యేమో! తాను నరహరిని కలుసుకున్న వైనం సరళకి, ఆమె తలిదండ్రులకి చెప్పాలి చెబితే వాళ్లెంతగా మురిసిపోతారో ! — అన్న ఆరాటం అతన్ని మరింత తొందరచేసింది.

ఆ రోజు రాత్రి బెజవాడ బయలుదేరాడు, గిరి

* * *

కాలేజీ విడిచిపెట్టారు ఏవిటో ఆలోచించుకుంటూ సరళ నడుస్తోంది

"సరళా!" అన్న పిలుపు విన్పించిందామెకి ఆ స్వరం గిరిదేనని చప్పు పసిగట్టి, ప్రక్కకు చూసింది, ఔను గిరే! ఆమెలో ఆనందం వెల్లువలా కట్టు త్రెంచుకుని ప్రవహించింది అయితే బెట్టుసరికోసం తన ఆనందాన్ని బయటి కనబడనీయలేదు

"మళ్ళీ చాలారోజుల తరువాత దర్శనమిచ్చారు ఏవిటి విశేషమండీ ఉద్యోగంలో చేరి నన్ను పూర్తిగా మర్చిపోయినట్టున్నారు అంతేగదండీ! అంది బుంగమూతి పెట్టుకుని

గిరి మెల్లగా నవ్వాడు

"నిన్ను మర్చిపోవడమా! ఏవిటి నువ్వంటున్నది సరళా! అది ఈ జన్మలో సాధ్యపడదు నీ ప్రేమపాశంతో నన్నెంత గట్టిగా బంధించావో నీకు తెలీదు అటువంటి నేను, నిన్ను మర్చిపోవడమా? ఈ మధ్య కనిపించకపోవడాని కారణం లేకపోలేదు నా నెత్తిన ఓ మహత్తరమైన బాధ్యత పడింది"

"ఏదో దొంగల ముఠా పట్టుకోవడమనుకుంటాను..." చిలిపిగా అంది సరళ

"మా ఉద్యోగ ధర్మమే అది అనుకో! అయితే పట్టుకోవల్సింది ముఠాకాద గాని, ఓ సన్నకారు దొంగని...ఆ బాధ్యత తీర్చుకునేవరకు నా కంటి నిండుగా నిద్రలేదంటే నమ్ము ఆ సందర్భంలోనే తిరుగుతున్నాను"

"అందుకేగా అన్నది—మీ ఉద్యోగ నిర్వహణలోపడి, నన్ను మర్చిపోయ రని! నేనూహించింది, సెంట్‌పర్సెంట్ కరెక్ట్"

"నీ ఊహ తప్పు..."

"అలాగయితే మా అమ్మా నాన్నల సమక్షంలో మా అన్నయ్య ఆచూకీ తెలుసుకుంటానని ప్రగల్భాలు చెప్పారుగదండీ, ఆ విషయాన్ని మీరు మర్చి పోతే, నన్ను మర్చిపోయినట్టేగా!" లాజికల్‌గా అంది సరళ

"అక్కడే అమ్మాయిగారు పప్పులో కాలేశారు..." నవ్వుతూ అన్నాడు

"అంటే...?" ఆదోలా అతని మొహంకేసి చూస్తూ అంది

"నా నెత్తిన పడిన బాధ్యత అదేగా మరి!"

"ఓ! అలాగా ఆ సందర్భంలోనే వెళ్ళారన్నమాట..." చిన్నబుచ్చుకుంది సరళ

"అన్న మాటేమిటి! వున్నమాటే అది ఏ మాట చెప్పినా దాన్ని వెనక్కి

తీసుకునే పద్ధతి నాదికాదు సరళా అందుకే మీ అన్నయ్య విషయం నా కెప్పుడూ గుర్తుంటోంది నేను ఎక్కడికి వెళ్ళినా యీ ప్రయత్నం నా ఉద్యోగ నిర్వహణలో ఒకటిగా భావించేవాణ్ణి అనుకోకుండా ఏలూరు వెళ్ళాల్సివచ్చింది స్టేషన్‌లో హఠాత్తుగా మీ అన్నయ్య కనిపించాడు..."అని యింకా ఏదో చెప్పా లనుకుంటుండగా అడ్డొచ్చింది సరళ

"మా అన్నయ్య అగుపించాడా? నిజంగానాండీ! ఎంత శుభవార్త తీసుకొచ్చా రండీ!" ఆనందంతో పుప్పొంగిపోతూ అంది ఆమె మొహంలో యేదో కొత్త కాంతి వెల్లివిరిసింది

"నాకు తెలుసు సరళా నువ్వు సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అవుతావని మీ అమ్మా నాన్నా వింటే ఇంకెంత మురిసిపోతారో!"

"ఔనండీ త్వరగా ఇంటికి పోదాం పదండి—" అంటూ నడక వేగాన్ని హెచ్చించింది

నవ్వుకున్నాడు గిరి ఆమెకి ఆతృత ఉండడంలో ఆశ్చర్యంలేదు

'మిగతా వివరాలు అవసరంలేదా సరళా..." మెల్లగా అన్నాడు

'ఆఁ...ఆఁ...చెప్పండి...అన్నయ్య బావున్నాడా ఏంచేస్తున్నాడు? నా గురించి మా అమ్మా నాన్నల గురించి అడిగాడా? ప్రశ్నలవర్షం కురిపించింది

గిరి మెల్లగా నవ్వాడు

"సరళా! నువ్వు నిజంగా అమాయకురాలివే!"

"ఏమండీ ..?" తెల్లబోయి చూసింది సరళ

"కాకపోతే, నేను మీ దగ్గర్నుండి వస్తున్నానని, పోలీసు ఇనస్పెక్టర్నని, అతన్ని తీసుకరావడానికే వెళ్ళానని చెబితే మీ అన్నయ్య నన్ను దగ్గరకు రానిస్తాడనా నీ వుద్దేశం?"

"మరేం చెప్పారవుతే!" విస్తుపోతూ అంది సరళ

"ఏ క్షణంలోనైతే మీ అన్నయ్యని గుర్తించానో నా మెదడు మెరుపులా చురుగ్గా పనిచేసింది చాలా నేర్పుగా అతనితో పరిచయం చేసుకున్నాను ఆ వూరికి కొత్తవాణ్ణని నా వృత్తి జేబులు కత్తిరించడం, చిన్న చిన్న దొంగతనాలు చెయ్యడమని చెప్పుకున్నాను మీ అన్నయ్యకి నా మాటలలో నమ్మకం కుదిరింది నాలాంటి స్నేహితుడు దొరికినందుకు మురిసిపోయి, నన్ను తనుండే గదికి తీసుకుపోయాడు, ఈ మధ్య అక్కడే వున్నాను..."

అన్నయ్య అగుపించాడనేసరికి, సరళ యెంత వుత్సుకత చూపించిందో,

అతనింకా దొంగతనం మానలేదన్న విషయం తెలుసుకున్నాక, అంతగా నిరుత్సాహపడింది

"అయితే, అన్నయ్య యింకా దొంగతనం మానలేదన్నమాట.. " దిగాలుగా అంది, సరళ

"లేదు సరళా! నిజానికి, ఆ వృత్తికి అలవడినవాళ్ళు, అంత సులువుగా దాన్ని విడిచిపెట్టలేరు ఇదేకాదు .. యే అలవాటయినా అంతే! అందుకే అంటారు — అలవాటు రెండో సహజ ప్రవృత్తిలాంటిద , అయితే మీ అన్నయ్య అంతటితో ఆగిపోయాడు ఆ వృత్తిలో ఇంకా లోతుకి పోవి, పెద్ద పెద్ద దొంగతనాలు, దోపిడీలు చెయ్యడానికి సాహసించడంపేదు అంటే, మరీ నిర్దాక్షిణ్యంగా తయారవ్వలేదన్నమాట "

"మా కుటుంబ విషయాలు యెప్పుడైనా మీతో చెప్పాడా "

"లేదు సరళా! ఆ వాతావరణంలో మరో విషయం గుర్తుకురాదు. అక్కడ ఆత్మీయతకు. అనుబంధాలకు తావుండదు కొత్త వ్యక్తిగానైనా నేనూ ఆ ప్రసక్తి తీసుకురాలేదెప్పుడూ "

"ఇంతకీ, మా అన్నయ్యలో మార్పు వచ్చే అవకాశాలు కనిపించాయా మీకు ?" ఆసక్తిగా అడిగింది

"అది నేనిప్పుడు చెప్పలేను కాని, అవకాశాలు లేకపోలేదు అతని జీవితం మలుపు తిరగాలంటే, దానికి బలమైన సంఘటన అవసరం..."

"అంటే.. ?"

"అతని మనస్సుకి హత్తుకునే సంఘటన తటస్థించితే, మార్పు రావొచ్చు..."

సరళ ఇల్లు దగ్గరపడ్డంతో, ఆ ప్రస్తావన ఆగిపోయింది

"రండి..." అంటూ లోపలికి దారితీసింది సరళ

అప్పటికి ముకుందం వాలుకుర్చీలో కూచుని యేదో ఆలోచిస్తున్నాడు

"గిరి గారొచ్చారు నాన్నా! అన్నయ్య కనిపించాట్ట. " అంది సరళ లోపల అడుగుపెడుతూనే

ముకుందంకి ఆ మాటలు తేనెసోనల్లా తియ్యగా వినిపించాయి

"ఆ! అన్నయ్య కనిపించాడా! ఎక్కడ? ఎలా వున్నాడు...?" అంటూ వుత్సకతతో ఒక్క వుదుటున లేచి కూచున్నాడు.



"నమస్కారం సార్ !" లోపలికి ప్రవేశించిన గిరి, సవినయంగా అన్నాడు

"నమస్కారం.. రావోయ్.. రా...కూచో ! మా వాడు కనిపించాడా ? ఎక్కడ ? కులాసాగా వున్నాడా ?" గుక్కతిప్పుకోకుండా ఆసక్తికొద్దీ ప్రశ్నించాడు

గిరి, ముకుందంకి అభిముఖంగా కూచున్నాడు ఆ మాటలు విన్న కమల ఆత్రంగా అక్కడికి వచ్చేసింది

"ఏమిటీ ! మా అబ్బాయి అగుపించాడా ?" అంటూ ముకుందం వున్న చోటుకి వచ్చింది

ఆ క్షణంలో ఆ ఇంట్లో తాండవించిన సంతోషాన్ని చూసి, మురిసిపోయాడు, గిరి తన ప్రయత్నం కొంతయినా ఫలించి, తన ద్వారా ఆ వార్త అందించినందుకు, సగర్వంగా లోలోన నవ్వుకున్నాడు

"ఇంతకీ యెక్కడ అగుపించాడు బాబూ ?" మళ్ళీ అడిగాడు, ముకుందం

"ఏలూరులో అగుపించాడండీ ! హఠాత్తుగా అలా అగుపించడం, అదృష్టమే !' అంటూ సరళకి చెప్పిన విషయమంతా వివరంగా వాళ్ళకి చెప్పాడు

తమ కొడుకు, యింట్లోంచి వెళ్ళిపోయినా, యెక్కడో కాయకష్టం చేసుకుని బ్రతుకుతూవున్నట్టు తెలిస్తే ఆనందించేవారే ! కాని, దొంగగా బ్రతుకుతున్నం

మకు, లోలోన కుమిలిపోయారు అయితే, అతడి వునికి తెలిసినందుకు మాత్రం ఆనందించారు

"ఎలా బ్రతుకుతున్నా, వాడి ఉనికి తెలిసింది అదే మాకు సంతోషం బాబూ ! ఆరోగ్యంగా వున్నాడా?'' అంటూ తనలోని ఆవేదన కప్పిపుచ్చుకుని ప్రశ్నించాడు, ముకుందం

"బాగానే వున్నాడండీ ! ఎటొచ్చీ ఒంటరి జీవితాన్ని గడుపుతున్నాడు "

"వాడి ఖర్మ...మా దురదృష్టం.. అంతే బాబూ ! మనం అక్కడికి వెళ్ళాలి బాబూ ! ఎట్లాగయినా వాణ్ణి తీసుకురావాలి వాడు మా కళ్ళముం ముందాలి లేకపోతే, మా హృదయాలకి ప్రశాంతత వుండదు" అన్నాడు ముకుందం, ఆవేదనతో కూడిన స్వరంతో

"మనం వెళ్తే మనతోపాటు వస్తాడన్న నమ్మకం లేదండీ ! అది మీ దగ్గ రున్న భయంవల్లనయినా కావొచ్చు...లేదా, తన స్వేచ్ఛాజీవనానికి అవరోధం కలుగవచ్చునన్న అభిప్రాయంవల్లనయినా కావొచ్చు " తన మనోభిప్రా యాన్ని చెప్పాడు, గిరి

ముకుందం, నిరుత్సాహంతో ఓ నిట్టూర్పు వదిలాడు

"అయితే, వాణ్ణి మార్చడమెలా ? మనలో ఒకడిగా వాణ్ణి యిక్కడే వుంచడం యెలా ? నువ్వే ఆలోచించు బాబూ !" అన్నాడు, దిగులుతో, ముకుందం

"ఔను బాబూ ! ఏంచేస్తే బావుంటుందో ఆలోచించు ... వాడికోసం బాధపడి, బాధపడి, మా బుర్రలు మొద్దుబారిపోయి వున్నయ్..." అంది కమల

క్షణం యోచించాడు, గిరి అతను యింతకుముందే ఓ నిర్ణయానికొచ్చాడు తన నిర్ణయాన్ని వాళ్ళతో చెప్పడమా, మానడమా, అని తటపటాయించాడు అయితే, తాను యేం చెయ్యదల్చుకున్నదీ, ముందుగా చెప్పడం యిష్టంలేక పోయింది

"నాకొక్కటే మార్గం కనిపిస్తోందండీ !" అన్నాడు

"చెప్పు బాబూ ! ఇంతవరకూ సహాయం చేశావు మా వాడెక్కడికి పోయాడో తెలీక, పరితపిస్తున్న మాకు వాడి ఉనికి చెప్పి ఊరట కలిగించావు వాణ్ణి యెలాగయినా యిక్కడికి తీసుకొచ్చి పుణ్యం కట్టుకో !" ఆసక్తితో అన్నాడు, ముకుందం

గిరి, సరళకేసి పరికించాడు

"ఔనండీ! ఔనండీ! మా అన్నయ్యని యెలాగయినా మార్చి, తీసుకు రండి మారే అవకాశం వుందన్నారుగా!" అంది, సరళ

"అదే నా అభిప్రాయం కూడాను సరళా! మీ అన్నయ్యలో మొదట మార్పు రావాలి తాను ప్రయాణిస్తోన్న మార్గం మంచిదికాదన్న భావన కలిగి, ఆ జీవితంపట్ల విరక్తి కలగాలి అప్పుడే, అతనిలో మార్పు వస్తుంది ఏదీ, నీ మెళ్లోవున్న లాకెట్ యిలా యివ్వు .."

"ఇదెందుకూ?" అర్థంగాక అంది, సరళ

"ఎందుకూ అని అడగొద్దు...యివ్వు. ."

"ఇవ్వమ్మా!" చెప్పాడు, ముకుందం

సరళ, తన మెళ్ళో లాకెట్ తీసి, గిరికి అందించింది గిరి, యింతకు ముందు ఆ లాకెట్‌ని చూశాడు గాబట్టి, అతని కనిపించింది, తన ప్రయత్నంలో దాన్ని బాగా వుపయోగించుకోవచ్చునని

"ఈ లాకెట్‌లో వున్న ఫోటో యెవరిది? నీదే కదూ?" అడిగాడు, గిరి సరళ నుద్దేశించి.

"అది నా చిన్నతనంలో తీసిన ఫోటో అట ..ఇప్పుడు ఆ ఫోటోలో ఉన్నది నేనేనని యెవ్వరూ గుర్తుపట్టరండీ!"

"ఇంకెవరో గుర్తుపట్టనవసరం లేదు ..మీ అన్నయ్య గుర్తిస్తే చాలు..."

"వాడికి బాగా గుర్తు..." అంది, సరళ

"ఔను బాబూ! మా హరికి యీ ఫోటో బాగా గుర్తు" అన్నాడు, ముకుందం

"అయితే మరింకేం! నా ప్రయత్నం విజయవంతమౌతుంది" వుత్సుకతతో అన్నాడు, గిరి

"ఏంజేస్తారు?" ప్రశ్నించింది, సరళ

"ఆ విషయం యిప్పుడు చెప్పను అది నా బుర్రలోనే వుండనీ!"

ముకుందం చప్పున అందుకున్నాడు.

"సరే! ఏదో చెయ్యి బాబూ! నువ్వు యేం జేసినా, మావాడు మా యింటికి తిరిగొచ్చి, మా మధ్య మసలుతూ వుండటమే మేం కోరుకునేది వాడు, యే రోజ్నో పట్టుబడిపోయి, యే జైల్లోనో శిక్ష అనుభవించే రోజు రాకూడదు ... నేనది వినకూడదు వాడు మాతోపాటు వుంటే, అదే

బాలు ..." అన్నాడు, ముకుందం. అతని కళ్ళు చెమర్చినయ్ ... కళ్ళొత్తుకున్నాడు

"నా ప్రయత్నం నేను చేస్తానండీ! సెలవు పెట్టాను ఈ రోజే ఏలూరు వెళ్ళిపోతాను.. "

"నేను వచ్చేదా నీతో...?"

"చెప్పాను కదండీ -- మీరు రావడం, మన ప్రయత్నానికి అవరోధమౌతుందేగాని, సుముఖం కాదు ..''

"సరే నీ యిష్టం నీ ప్రయత్నం సఫలం కావాలని ఆశీర్వ స్తున్నాను బాబూ!"

"మీ ఆశీస్సులు నాకు అండగా వుంటే బాలు వస్తానండీ మరి!" అంటూ లేవబోయాడు, గిరి

"కూచో బాబూ! కాఫీ తీసుకుని వెళ్ళు ..." అంటూ, కమల తొందరగా లోపలికి వెళ్ళి, ఫ్లాస్కులో వున్న కాఫీ కప్పులో పోసి తెచ్చి అందించింది గిరికి

గిరి కాఫీ తీసుకుని, నిష్క్రమించాడు

"ఇన్నాళ్ళకి ఓ శుభవార్త విన్నాం కమలా! అబ్బాయి క్షేమంగా వున్నాడని తెలిశాక, హృదయ భారం కొంత తగ్గింది..." తృప్తిగా అన్నాడు, ముకుందం

"ఈ అబ్బాయి, నిజంగా మంచివాడిలానే అగుపిస్తున్నాడండీ! తెలివైన వాడు కూడాను..." అంది, కమల

"మరి, ఆ రోజు యెవర్నీ నమ్మొద్దనీ, మగాళ్ళంతా మోసగాళ్ళని, యేమేమో అనేశావు?" మందహాసంతో అన్నాడు, ముకుందం

"అప్పటికి, అలా అనేశాననుకోండి కాని, అతణ్ణి యిప్పుడు చూశాక నా అభిప్రాయాన్ని మార్చుకున్నాను ... కతడు, తన ప్రయత్నాన్ని సాధిస్తాడన్న నమ్మకం ఏర్పడింది నాలో..."

''ఔనా మరి! నాకూ అలాగే అనిపిస్తోంది, కమలా? అతడి బుర్రలో యేదో ప్లానుంది అందుకే, లాకెట్ తీసుకెళ్ళాడు ఎలా సాధించుకొస్తాడో, నిజంగా వేచి చూడాల్సిందే! గిరి, మన సరళకి స్నేహితుడు కావడం మన అదృష్టమే అనుకో! అమ్మాయికి తగిన వరుడు కూడాను" ముసి ముసి నవ్వుతూ, కూతురుకేసి చూస్తూ అన్నాడు, ముకుందం

సరళ మొహం సిగ్గుతో యెర్రబడింది మొహం దించుకుని, తన మొహంలో కలిగిన మార్పుని దాచుకుని, ఖాళీ కప్పు తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది

వెళ్ళిపోతోన్న కూతురుకేసి, మురిపెంతో చూస్తూ

"అమ్మాయి చాలా అదృష్టవంతురాలండీ!" అంది కమల

"మెల్లగా అంటున్నావేమిటి? ఆ అదృష్టమే, మనింట్లో మళ్ళీ సంతోషం చిగురించడానికి దోహదమౌతోంది మన మనసుల్లో ముసురుకున్న చీకట్లు పటాపంచలవ్వడానికి, ఆ అదృష్టమే కారణభూతమౌతోంది"

"అది నిజమేనండీ! అంతా దైవేచ్ఛ!" అంటూ లోపలికి నడిచింది కమల

ముకుందం, తృప్తిగా వాలుకుర్చీలో వెనక్కి చేరబడ్డాడు

* * *

సాయంత్రం ఏడుగంటలు దాటింది

గిరి, హరి గది దగ్గరికి వచ్చి చూశాడు తాళం వేసి లేదు తలుపుతట్టాడు

"ఎవరూ?" లోపల్నించి అడిగాడు, హరి

"నేనండీ హరిగారూ! గిరిని..." అన్నాడు గిరి

హరి, చప్పున వచ్చి తలుపు తెరిచాడు గిరిని చూసి స్నేహభావపు చిరునవ్వు నవ్వేతు

"వచ్చేశారన్నమాట! లాభంగానే తిరిగివచ్చారా? లేకపోతే, కేవలం ప్రయాసే మిగిలిందా?" అంటూ గిరి లోపలికి వెళ్ళగానే తలుపు గడియ వేశాడు, హరి

గిరి, నేరుగా వెళ్ళి మంచంమీద కూచున్నాడు. హరి, అతనికి అభిముఖంగా బల్లవేసుకూర్చున్నాడు

'నా అదృష్టం బావుందండీ హరిగారూ! లాకెట్ చైను కొట్టుకొచ్చాను" పుత్సాహంతో అన్నాడు

"అలాగా!" సిగరెట్ వెలిగిస్తూ అన్నాడు, హరి

"ఔనండీ! కిటికీ దగ్గర కూచున్న ఓ అందమైన అమ్మాయి, ప్లాటుఫారమ్మీద జనాన్ని చూస్తూ, తనని తానే మర్చిపోయింది బండి కదుల్తూవుండే 'టక్' మని లాగేశాను అంతే! జనసమ్మర్దంలో కలిసిపోయాను ఆ అమ్మాయి 'షాక్' తిన్నట్టయిపోయి, గోలపెట్టింది దొంగకోసం వెదుకు

తున్నారు.. ఇంకెక్కడి దొంగ ? అప్పటికే నేను జనసమూహంలో కలిసి పోయి, గేటులోంచి బైటికి పోయాను...ఇంక దొంగ దొరికే దెక్కడ ?"

"అబ్బ ! మీ చురుకుతనాన్ని మెచ్చుకోవల్సిందేనండీ ! అలా మెరుపులా మాయమవ్వగలిగితేనే, మనం సుఖంగా బ్రతగ్గలం ఇంతకీ, ఆ లాకెట్ బంగారందేనా ?"

"మంచివారేనండీ ! మెరిసిపోతుంటే, బంగారందా ? కాదా ? అని అడుగుతారేంటీ ?"

"ఇటీవల మనవాళ్లు రోల్డుగోల్డు వస్తువులు యెక్కువగా వాడుతున్నారండీ ! అందుకే, నాకా అనుమానం వచ్చింది ఏదీ, యిలా చూపించండి..."

గిరి, ఫేంటు జేబులో రుమాలుతో చుట్టివున్న ఆ లాకెట్ చెయిను తీసి, హరికి అందించాడు.

"రెండు తులాలకి పైగా వుంటుందండీ !" అందిస్తూ అన్నాడు, గిరి " ఇప్పటి ధరల దృష్ట్యా, వెయ్యి రూపాయలకి పైగా విలువ చేస్తుంది" హుషారుగా చెప్పుకుపోయాడు

హరి, గొలుసును పరిశీలనగా చూస్తూ లాకెట్‌లో అమర్చబడిన ఫోటో చూశాడు. షాక్ తిన్నట్టయ్యాడు అతని మొహంలోని రంగులు మారాయి తనవాళ్లందరూ ఒక్కసారిగా అతనికి గుర్తుకొచ్చారు అతని కళ్ళు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి కళ్ళొత్తుకున్నాడు

గిరి, హరి మొహంవేపే తదేకంగా చూస్తున్నాడేమో హరిలో రేకెత్తిన సంక్షోభాన్ని యిట్టే పసిగట్టాడు అతను వాంఛించేది కూడా అదేను

"అదేవిటండీ హరిగారూ, అలా కంగారుపడుతున్నారేంటి ? ఏమయ్యిందండీ ?" ప్రశ్నించాడు, గిరి

"ఈ లాకెట్‌లో వున్న ఫోటో చూశారా ?"

"లేదండీ.. ఏదీ యిలా చూపించండి" అంటూ ఆ లాకెట్ అందుకుని పరిశీలనగా చూశాడు, గిరి

"ఎవరో చిన్న పిల్లది... బహుశా నేను యెవరి మెళ్ళోంచి తస్కరించానో, ఆ అమ్మాయి చిన్నప్పటి ఫోటో అయ్యుంటుంది ఎవరిదైతే మనకెందుకండీ!" చాలా తేలిగ్గా అనేశాడు, గిరి

హరి, బరువుగా ఓ నిట్టూర్పు విడిచిపెట్టాడు

"ఎవరిదో అయితే, నేనెందుకు బాధపడతానండీ?"



"మరి ...? ఎవరి ఫోటో అంటారు? మీకు తెలిసిన వాళ్లదా?" తనకేమీ తెలీనట్టుగానే అన్నాడు

"స్వయానా మా చెల్లాయి దండీ! దాని చిన్నతనంలో తీసిన ఫోటోను యీ లాకెట్‌లో అమర్చి, యీ గొలుసు తయారుచేయించారు, మా నాన్నగారు"

గిరి, ఆశ్చర్యంతో హరి మొహంలోకి చూశాడు

"అంటే ..? నేను మీ చెల్లాయి మెళ్ళో గొలుసే దొంగిలించుకొచ్చానంటారా?"

"అయ్యయ్యో ... ఆ అమ్మాయి యెట్లా వుంటుందో చెప్పండి!"

"సన్నగా, నాజూగ్గా వుంటుంది బంగారు వన్నెఛాయ, గుండ్రని మొహం ... యింతే నేను చెప్పగల్ను ఆమెతో యింకెవరున్నారో, యేవిఁటో నేను గుర్తించలేదు..."

"ఈ సంఘటన యే స్టేషన్లో జరిగిందేవిఁటి?"

"విజయవాడ స్టేషన్లో నండీ!"

"ఇంక సందేహం లేదండీ ! మా చెల్లాయే ! నెల్లూరు వెళ్తోంది గామోసు ..."

"అరెరె ! చాలా పొరపాటు జరిగిందండీ హరిగారూ ! ఆమె మీ చెల్లెలని నాకు తెలీదు కదా !"

"ఎలా తెలుస్తుంది లెండి..." సాలోచనగా అన్నాడు

సరే లెండి ఇవ్వాళ నాకేం దొరకలేదనుకుంటాను ... మీరు దీన్ని తీసుకెళ్ళి, మీ చెల్లెలికిచ్చి రండి..." అన్నాడు, గిరి

హరి కాస్సేంత తడబడ్డాడు

"అబ్బబ్బే...అది, నావల్ల కాదండీ !"

గిరి, అదోలా అతని మొహంకేసి పరికించాడు

"అంటే... మీరు మీ యింటికి వెళ్లరా ?"

"లేదండీ ! వెళ్లడం లేదు చాలా రోజులయ్యింది, నేను యింటినుండి వచ్చేసి" చాలా యిబ్బందిగా మొహంపెడుతూ అన్నాడు, హరి

"ఓ ! అలాగా! పాపం, మీ వాళ్లంతా యెంతగా కుమిలిపోతూవుంటారో ఆలోచించారా ?"

"ఆ బంధాన్ని త్రెంచుకునే వచ్చాను కదండి ! ఇంక వాళ్ళు బాధపడుతున్నారో, లేదో, ఆలోచించడం అనవసరం నా జీవిత సరళిని నేను చూసుకున్నాను అంతే నాకు తెలుసు"

"మీరు అన్నిబంధాలు త్రెంచుకొని వచ్చేసినపుడు, మీ చెల్లాయి చిన్నప్పటి ఫోటో చూసి, ఆ లాకెట్ ఆమెనుండి దొంగిలించి తెచ్చినందుకు యెందుకంత వ్యధ జెందారు ?" అవకాశం వచ్చింది గాబట్టి అనేశాడు, గిరి

"అనుకోకండా అలా వచ్చేసిందండీ, ఆవేదన ఎంతయినా రక్తసంబంధాన్ని మర్చిపోలేం కదా ! ఆ మమతల్ని అంత సులువుగా వదులుకోలేమేమో !" నిర్లిప్తంగా అన్నాడు, శ్రీహరి

గిరి, మెల్లగా మందహాసం చేశాడు

"మనకి అటువంటి బంధాలు, బాంధవ్యాలు వుండకూడదండీ ! వుంటే, మనం యీ వృత్తిని నిరాటంకంగా సాగించలేం ఇప్పుడంటే మనం జేబు దొంగలుగా వున్నాం ఎప్పుడూ యిలాగే వుంటామన్న నిర్ధారణ లేదు. ఏ వృత్తిలోనయినా ప్రమోషనంటూ వుంటుంది కదా ! కాలక్రమేణా పోయేకొద్దీ మనం మరీ పెద్ద పెద్ద దొంగతనాలు చెయ్యొచ్చు బ్యాంకు దోపిడీలు మొద

తైన దేరింగు దొంగతనాల్లో మన చెయ్యి వుండొచ్చు ఆ సందర్భాల్లో హత్యలు జరిగినా జరుగుతాయి మనలో గనక 'జాలి', 'మమకారం' అన్న భావాలుంటే, యివన్నీ మనం చెయ్యలేం. అంచేత అటువంటి పదాలు మనం పూర్తిగా మర్చిపోవాలి మన వృత్తే మనకి బంధువు ఈ వృత్తిలో వున్న వాళ్ళే మన ఆప్తులు ఈ భావనకి అలవడాలి..." అంటూ చిన్న వుపన్యాస మిచ్చాడు, గిరి.

హరి తెల్లబోయి గిరికేసి చూశాడు అతని నోట యివ్వాళ కొత్త కొత్త మాటలు వింటూ వుండటం, ఆశ్చర్యం కలిగించింది, హరికి

"ఏమిటండీ గిరిగారూ, ఈ రోజు మీరు కొత్త కొత్త పదాలు ప్రయోగిస్తున్నారు ?"

"కొత్త పదాలేమీ లేవండీ ! ఇవి సాధారణమైనవే ! నిజానికి మనం యెల్లప్పుడూ యిలా సన్నకారు దొంగలుగానే వుండిపోతామంటారా ? మన వృత్తుల్లోనూ ప్రమోషన్లు రావాలి మరి ! మనం వద్దనుకున్నా, పరిస్థితుల ప్రభావంవల్ల వచ్చేస్తాయి మరి కొన్నాళ్లకి మనం బందిపోటు దొంగలుగా మారినా ఆశ్చర్యం వుండదు, ఏమంటారు ?" అన్నాడు, గిరి

హరి మొహం వెల్లవేసిన గోడలా తెల్లబోయింది కత్తివేటుకి నెత్తురుచుక్క లేనట్టు పాలిపోయింది

"మీ అభిప్రాయాలతో నేను ఏకీభవించనండీ! అందరు దొంగలూ ఒకేలా ఉంటారని చెప్పలేం. అందరి మనస్తత్వాలూ ఒకలా వుండవు ఎవరిమాట ఎలా ఉన్నా నా మట్టుకు నేను మీ అభిప్రాయాలకి భిన్నంగా వున్నాను. ఈ వృత్తిలో నేనింక ఎదగను ఎదగదల్చుకోలేదు అసలు... నిజం చెప్పాలంటే మొదట్లో చిన్న చిన్న దొంగతనాలకి అలవాటుపడి ఆ అలవాటుని మానుకో లేక మరో మార్గంలేక మా వాళ్ళకి దూరమై యీ దొంగతం చేస్తున్నానుగాని అప్పుడప్పుడూ యేం అనిపిస్తుందో తెలుసాండి ...?" బాధపడుతూ చెప్పడం ప్రారంభించాడు, హరి

"ఏమనిపిస్తోందండీ ..?" ప్రశ్నించాడు గిరి

"ఈ నీచమైన దొంగవృత్తి ఎందుకు చేస్తున్నానా, అని అప్పుడప్పుడూ అనిపిస్తుందండీ మా వాళ్ళందరికీ దూరమై పోయాను సంఘం దృష్టిలో చీడ పురుగు నయ్యాను ..పోనీ వ్యక్తిగతంగాసుఖిస్తున్నానా అంటే అదీలేదు. ఎప్పుడో యేదో ఆరాటంతో భయంతో బ్రతుకుతున్నాను ఇదేం జీవితం చెప్పండి?"

లోలోపల ఎంతో ఆవేదనని యిముడ్చుకున్న వ్యక్తిలా చెప్పుకుపోయాడు హరి.

ఆ మాటలు విన్న గిరి హృదయం ఉప్పొంగిపోయింది. తాను ఊహించిన విధంగానే అంతా జరుగుతున్నందుకు, భగవంతుణ్ణి మనసులో అభినందించు కున్నాడు. అయితే తన ఆనందాన్ని అప్పుడే బహిర్గతం చెయ్యదల్చుకోలేదు

"అదేమిటండీ హరిగారూ! మీరు ఇంత బలహీనులా?" అన్నాడు ఆశ్చర్యంతో కళ్ళింతవి చేస్తూ.

హరి, భారంగా ఓ నిట్టూర్పు విడిచాడు.

''బలహీనత కాదండీ! బహుశా వాస్తవాన్ని ఇప్పుడిప్పుడే గ్రహిస్తున్నాను. మనిషి తప్పు త్రోవలో ఓసారి పడితే, ఆ మనిషి శాశ్వతంగా ఆ త్రోవను పోవల్సిందే! అతన్ని ఆ మార్గంనుంచి తప్పించి, మంచి మార్గానికి మళ్ళించే ప్రయత్నం యెవ్వరూ చెయ్యరు. అందుకేనేమో, చెడు త్రోవ పట్టినవాళ్ళు ఆ ఊబిలో కూరుకుపోయి, మరి బయటపడలేకపోతున్నారు. వాళ్ళ జీవితం యిలా వ్యర్థమైపోతుంది..." బాధగా అన్నాడు హరి.

"మీ ఆలోచనలూ, మీ ఊహలూ వింటూంటే నాకు మతిపోతుందండీ హరిగారూ! కొంపదీసి క్రమంగా మీలో యీ వృత్తిపట్ల విరక్తిభావం పెరిగి మానేయరుగదా, నాకు తగిన స్నేహితుడు లేకుండాపోతాడు సుమండీ!" నేర్పుగా అన్నాడు గిరి.

పొడిగా నవ్వాడు హరి.

"ఇంక మానడమేంటి లెండి! ఇప్పుడే చెప్పానుగా—'చెడు అనే ఊబి' లో కూరుకుపోయి ఉన్నాం. ఆ ఊబిలోంచి విముక్తి పొంది బైటపడటం అంత సులభ సాధ్యంకాదు. ఇలా ఈ వూబిలో కొట్టుకుని కృశించిపోవలసిందే. మన జీవితాల్లో మళ్ళీ వెలుగొస్తుందనుకోవడం తెలివితక్కువతనం..."

హరి మాటలకి, గిరి కరిగిపోయాడు. అతనిలో యెంత బాధ లేకపోతే, అంతటి నిరాశా, నిస్పృహల్ని పెంచుకుంటాడు. తన పథకానికి యివన్నీ సుముఖంగానే ఉన్నందుకు లోలోన మురిసిపోయాడు.

"ఇంతకీ, ఈ లాకెట్ యేంచేద్దామంటారు! అమ్మేసి వచ్చేద్దాం? మీరు తీసుకెళ్ళి యిస్తానని ఎట్లాగూ అంటున్నారుగా!"

హరి క్షణం మౌనంగా వహించాడు. ఏం చెప్పడమో, ఎలా చెప్పడమో అతని




ఊహకి అందడంలేదు కాని, యేదో చెప్పాలి ఆ లాకెట్‌ని చెల్లాయికి తిప్పి పంపాలి...అనుకున్నాడు

"వద్దండీ గిరిగారూ! అమ్మొద్దు నన్ను దూరంచేసుకునే మా వాళ్ళంతా కుమిలిపోతున్నారు ఆ ఆవేదనకి తోడుగా యిప్పుడీ లాకెట్ పోగొట్టుకుని మా చెల్లాయి ఎంతగా విలపిస్తూ వుందో వూహించలేక పోతున్నానండీ. అన్నయ్యగా నేనుదానికి యేవిధంగానూ ముద్దూముచ్చట్లూ చూడలేకపోతున్నాను దాని చిన్ననాటి ఫోటోతో వున్న ఈ లాకెట్‌ని యెవరికో అమ్మేయమని చెప్పడానికి నా కెలా నోరొస్తుంది చెప్పండి? నా మనస్సు ఇంకా కరడు కట్టలేదండీ దీన్ని ఎట్లాగయినా మా చెల్లాయికి అందజేసి ఆమెలో కొంతయినా సంతోషం కలుగజేస్తే అదే నాకు తృప్తి మిమ్మల్ని ప్రాధేయపడుతున్నాను గిరిగారూ! ఈ ఒక్క సహాయం చేసిపెట్టండి దీని విలువ క్రమంగా మీకు తీర్చుకుంటాను ప్లీజ్..." ప్రాధేయపూర్వకంగా అన్నాడు హరి

"హరిగారూ! మీ ఆవేదనని అర్థంచేసుకున్నానండీ! అయితే మనవాళ్ళ వస్తువులు మనం అనుకోకుండా దొంగిలించినపుడు, వాళ్ళెంత బాధపడిపోతారోనని మనం తల్లడిల్లిపోతున్నాం కాని ఇతరుల వస్తువులు దొంగిలిస్తున్నామే వాళ్ళ బాధని, వాళ్ళ ఆవేదనని, వాళ్ళ పరిస్థితుల్ని మనం యెప్పుడేనా ఆలోచిస్తున్నామంటారా?" అన్నాడు గిరి, హరి మొహంలోకి చూస్తూ

"లేదు, మనం అవన్నీ ఆలోచించడంలేదు...ఆలోచించి చూశాన అలా

ఆలోచిస్తే మనం దొంగతనం చెయ్యలేమండీ మీరన్నట్లు మనం దొంగిలించిన వస్తువులు పోగొట్టుకున్నవారి బాధను మనం కళ్ళారా చూడం కాబట్టి వాళ్ళ గురించి మనం పట్టించుకోం. మనవాళ్ళు మన కళ్ళముందే మెదుల్తారు. అందుకే పట్టించుకోక తప్పదు. ఇంతకుముందే అన్నాను కదండీ అందుకే ఈ నీచపు వృత్తిని మనస్ఫూర్తిగా నేను సాగించదలంలేదని..."

"హరిగారూ, మీకు ఈ వృత్తిపట్ల యేహ్యభావంవుంటే మానేయవచ్చును గాని, నన్నూ నీళ్ళు గార్చేస్తున్నారేవిఁటండీ మీ మాటలతో?" సీరియస్‌గానే అన్నాడు గిరి

"అబ్బే మిమ్మల్ని నేను నిరుత్సాహపర్చనండీ. అటువంటిదేమైనా జరిగితే క్షమించండి...ఇక్కడితో ఈ ప్రస్తావన కట్టిపెడదాం...లాకెట్ మీ దగ్గరే వుంచండి..."

"సరే ఇంక మనం బయలుదేరాలిగా. లేవండి. హోటల్‌కి వెళ్ళి భోజనంచేసి అక్కడ్నుంచి పోదాం..." అంటూ ప్రస్తావన మార్చాడు గిరి

హరి మొహంలో అప్పటికే విసుగుదల పెరిగింది

"ఇవాళ నేనెక్కడికీ వెళ్ళను గిరిగారూ నా మనస్సేమీ బాగుండలేదు..." నిర్లిప్తంగా అన్నాడు.

"మీరు వెళ్ళకపోతే,నేను మాత్రం వెళ్తానా?నేనూ వెళ్ళను...పదండి భోజనం చేసి వచ్చేద్దాం..." అన్నాడు గిరి లేస్తూ. హరిలో ఆపాటి చైతన్యాన్ని తీసుకొచ్చినందుకు లోలోన ఆనందించాడు

"పదండి..." హరికూడా లేచాడు.

* * *

ఆ రాత్రి హరికి నిద్ర పట్టలేదు యెంత ప్రయత్నించినా అతనికి తల్లీ, తండ్రీ, చెల్లాయి జ్ఞప్తికి వస్తున్నారు. అనుక్షణం తాను దూరమైపోయినందుకు వాళ్ళెంతగా తల్లడిల్లి పోతున్నారో తలచుకుంటే, అతనికి యేడుపొచ్చినట్టయ్యింది తాను చదువుకున్న రోజుల్లో, తలిదండ్రులు తనపట్లచూపే అనురాగం, ఆప్యాయత, చెల్లాయి తనంటే చూపే మమకారం స్మృతిపథంలో మెదిలి అతన్ని మరింత వివశుణ్ణి చేశాయి. చెమ్మగిల్లిన కళ్ళను ఓసారి ఒత్తుకున్నాడు

దూరంలో ఎక్కడో పదకొండు గంటలు కొట్టారు అప్పుడప్పుడూ కుక్కల అరుపులు వినవస్తున్నయ్. హరికి ఇంకా నిద్రపట్టలేదు గిరికూడా పడుకో

లేదు. హరిలో వస్తున్న మార్పుని గిరి గ్రహించగలుగుతున్నాడు. అదే సరైన అదననుకున్నాడు లేచి కూచున్నాడు.

"అబ్బ! నిద్ర రావడంలేదండీ! మీకూ నిద్రపట్టనట్టుంది హరిగారూ!" ప్రశ్నించాడు గిరి

"పట్టడంలేదండీ! రాత్రుళ్ల పడుకోవడం అలవాటు లేదుకదూ?" అందుకే నేమో!" అన్నాడు హరి

"అదికాదండీ కారణం! మీ వాళ్ళు మీ కళ్ళముందు మెదుల్తున్నారు మీ గత జీవితం గుర్తుకొస్తోంది. మీ చిన్నారి చెల్లాయి సరళ జ్ఞాపకానికొస్తోంది. మీ అమ్మా, నాన్న, చెల్లాయి మీ గురించి యెలా బాధపడుతున్నారో, యెంతగా తల్లడిల్లి పోతున్నారో, వూహించుకుంటున్నారు మీరు. అందుకే, నిద్రపట్టడంలేదు ... అంతే కదండీ..." చిన్నగా మందహాసంచేస్తూ, అన్నాడు గిరి

హరి ఒక్క వుదుటున లేచి కూర్చున్నాడు తన చెల్లాయి పేరు, గిరికి యెట్లా తెలుసు? ఇందులో యేదో విశేషం వుందనుకున్నాడు. అతని మొహంలో ఆరాటం ద్యోతకమౌతోంది

"మీకు మా చెల్లాయిపేరు యెట్లా తెలుసునండీ గిరిగారూ?" సూటిగా అతని మొహంలోకి చూస్తూ అడిగాడు

గిరి నన్నగా నవ్వాడు ఇంక నిజాన్ని దాచడం మంచిది కాదనుకున్నాడు.

"మీ పేరు హరికాదు...నరహరి కదండీ!"

"ఔను నరహరే! మీ కెలా తెలుసు?" మరీ ఆశ్చర్యపోతూ అడిగాడు హరి

గిరి లేచివెళ్లి మేక్కి తగిలించిన షర్టు జేబులోంచి ఓ ఫోటో తెచ్చి చూపించాడు

"ఇది మీ ఫోటో కదూ?"

హరి తెల్లబోయాడు

"ఔనండీ ఇది నా ఫోటోయే! మీ చేతిలోకి యెలా వచ్చింది? కొంపదీసి మీరు సి ఐ డి కాదుగదా!" గంభీరంగా అన్నాడు హరి. అతని చూపుల్లో వాడి ఉంది...కొంత కంగారూ ఉంది

"కంగారుపడకండి హరిగారూ!" అన్నాడు సౌమ్యంగా గిరి

"అయితే ఈ ఫోటో మీకెలా వచ్చిందో, నా పేరు, మా చెల్లాయి పేరు మీకెలా తెలిశాయో, నిజంచెప్పండి..." అన్నాడు హరి

"ఈ ఫోటో మీ నాన్నగారిచ్చారు హరిగారూ..." మందహాసంతో అన్నాడు గిరి.

"మా నాన్నగారిచ్చారా ?" నిర్ఘాంతపోయాడు హరి

గిరి మెల్లగా మందహాసం చేశాడు

"మీకు ఆశ్చర్యంగా ఉంది కదండీ హరిగారూ కాని, అది అక్షరాలా నిజం మీరనుకున్నట్లు నేనేం సి. ఐ డి ని కాదు మీ చెల్లాయి స్నేహితుణ్ణి... కాబోయే భర్తని ఇప్పుడర్థమయిందనుకుంటాను..."

"నాకేమీ అర్థం కాలేదు గిరిగారూ మీరు మా చెల్లాయికి కాబోయే భర్తే కావచ్చు కాని, ఇలా దొంగగా వేషంవేసి, నా దగ్గరికి రావల్సిన అవసరం యేమొచ్చిందో నేను అర్థంచేసుకోలేకపోతున్నాను," అన్నాడు హరి, గిరి మొహంలోకి సూటిగా చూస్తూ

"అవసరం ఉందిగాబట్టే, దొంగగా వేషంవేసి, వచ్చాను మీతో పరిచయం చేసుకుని, మీ అభిమానాన్ని చూరగొన్నాను. అసలు విషయం ఏమిటంటే నేనూ, మీ చెల్లాయి ప్రేమించుకున్నాం. వివాహం చేసుకోవాలని ప్రతిపాదించా న్నేను కాని, మీ చెల్లాయి అభ్యంతరం చెప్పింది కారణం ఏమిటంటే, మీరు ఇంట్లోంచి వెళ్ళిపోయాక, మీ నాన్నగారు, అమ్మగారు, మీ చెల్లాయి మీకోసం పరితపిస్తున్నారు మీ ఉనికి తెలుసుకుందుకు, ఎక్కడెక్కడో వెదికిస్తున్నారు ఎవరెవరికో ఉత్తరాలు రాస్తున్నారు. ఇంట్లో అందరూ మానసికంగా కృంగిపోయి వున్న తరుణంలో, తన పెండ్లి జరగడంలో అర్థం వుండదంటుంది, సరళ. ఆమె అభిప్రాయాన్ని అవగాహన చేసుకుని, మీ యింటికి వెళ్ళి మీ నాన్నగార్ని కలిశాను ఆయన అనుభవిస్తున్న ఆవేదన చూసి, నాకూ జాలివేసింది మీ ఉనికి తెలుసుకోడానికి ప్రయత్నిస్తానని మాటిచ్చాను అప్పుడే మీ ఫోటో తీసుకున్నా నండీ మనం మొట్టమొదటిసారి కలుసుకన్నరోజు, ఉద్యోగరీత్యా ఈ వూరొ చ్చాను హఠాత్తుగా స్టేషన్‌లో మిమ్మల్నిచూశాను మీ అలవాట్లనీ, మీకు ఇష్ట మైన దుస్తుల్ని, సరళ చెప్పింది అందుకే మిమ్మల్ని యిట్టే గుర్తుపట్టేశాను మీతో సన్నిహితంగా వుండాలన్న వుద్దేశంతో, నేనూ దొంగనేనని అబద్ధంచెప్పి మీ అభిమానాన్ని పొంది, మీతో ఉన్నాను," అంటూ వివరంగా చెప్పాడు గిరి

"అయితే మీరు నిజంగా దొంగ కారన్నమాట...?" విస్తుపోతూ అడిగాడు హరి







"మంచివాళ్ళేనండీ! మీ చెల్లాయి దొంగని ప్రేమిస్తుందని ఎలా అనుకుంటారు? అదంతా కల్పితమే!" నవ్వుతూ అన్నాడు గిరి

"మరి మీరు దొంగిలించినట్టు చెప్పిన రెండు పర్సులు, పెన్ను...వాటి విషయం యేమిటి?"

"పర్సులు నేను కొన్నవే. వాటిలో కొంత డబ్బు పెట్టి దొంగిలించినట్టు చెప్పాను పెన్నూ అంతే లేకపోతే నేను దొంగనేనని మీకు నమ్మకం కలిగే దెట్లా చెప్పండి?"

"మీరు చాలా తెలివైనవారండీ నిజంగా మీరు పోలీసు డిపార్టుమెంటులో చేరాల్సిం ."

"ఇప్పుడు నేను చేస్తున్న వుద్యోగం అందులోనే కదండీ?"

"అంటే..?"

"ఔనండీ! నేను పోలీసు ఇనస్పెక్టరుగా పనిచేస్తున్నాను.."

హరి మొహంలో రంగులు మారడం స్పష్టంగా చూశాడు గిరి

"కంగారుపడకండి కొత్తగా వుద్యోగంలో చేరాను"

"మరి లాకెట్ విషయం...?"

"మీలో మానసికమైన మార్పు తీసుకురావాలంటే, మిమ్మల్ని కదిలించే యేదేనా సంఘటన తపస్థపడాలి కదా! ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాను ట్రైన్లో దొంగతనం చెయ్యడానికి వెళ్తున్నానని చెప్పి, నేరుగా విజయవాడ

వెళ్ళాను. మీ వారితో మీరు కనిపించిన వైనం చెప్పి, సరళ మెళ్ళోని యీ లాకెట్ తెచ్చాను ఆపైన నేను కల్పించిన కథ మీకు తెలిసిందే!"

గిరి తెలివితేటల్ని మనసులో అభినందించుకున్నాడు, హరి

"నిజంగా, మీరు మీ వుద్యోగ నిర్వహణలో గొప్ప విజయాలు సాధిస్తారండీ గిరిగారూ! మీ తెలివితేటల్ని, మీ చాకచక్యాన్ని, మనసారా అభినందిస్తున్నాను" అన్నాడు హరి

"నా వుద్యోగ నిర్వహణలో సాధించే విజయాల మాట అటుంచండి ముందు నా జీవితంలో యీ ఒక్క విజయం సాధిస్తే చాలు..."

"ఏవిఁటండీ అది?'' ఆసక్తిగా అడిగాడు, హరి

"మిమ్మల్ని నా వెంట తీసుకెళ్ళి, మీ తలిదండ్రులకి అప్పజెప్పి, వాళ్ళ ఆవేదన రూపుమాపడం నా ప్రస్తుత కర్తవ్యం...ఇది నా జీవితంలో ఒక విజయంగా భావిస్తాను విజయమేకాదు... నా జీవితాన్ని తీర్చి దిద్దిన సంఘటనగా చిరకాలం స్మృతిపథంలో వుంచుకుంటాను..."

నరహరి మాట్లాడలేకపోయాడు మొహం దించుకుని, యేం చెప్పడమోనని ఆలోచిస్తున్నాడు గిరి, మళ్ళీ ప్రారంభించాడు

"కొద్దిసేపటి క్రితం మీరు చెబుతున్న మాటలు విని, మీలో మారిపోవాలన్న తపన, మంచిమార్గంలో పడాలన్న ఆసక్తి, వున్నట్టు గ్రహించాను మీరు దొంగతనం వృత్తిని యెంతగా అసహ్యించుకుంటున్నారో మీ మాటల్లో, భావాల్లో, పసిగట్టాను అప్పుడే అనుకున్నాను—నేను తలపెట్టిన ప్రయత్నం తప్పకుండా ఫలిస్తుందని"

నరహరి మెల్లగా ఓ నిశ్వాసం వదిలాడు. "నిజంగానే నాకీ వృత్తిమీద సద్భావం లేదండీ! ఏదో తెలిని వయస్సులో యీ చెడు అలవాట్లకి దాసుడనైపోయి, మరో ధ్యాసలేక, యిందులోనే కూరుకుపోయాను కాని, యీ జీవితమంటే నాకు రోత కలుగుతోంది క్రమంగా భయంలేని రోజులేదు ఆరాటం అడుగడుగునా వుంటోంది. 'ప్రశాంతి' అన్నపదమే మర్చిపోయి, యెన్నాళ్ళో అయ్యింది నా అనేవాళ్ళు దూరమయ్యారు నేనూ సుఖంగాలేను ఇటువంటి జీవితాన్ని, యెవరు కోరుకుంటారు చెప్పండి? కాని, యేం చెయ్యను? గౌరవంగా సంఘంలో తిరగలేను తిరగనివ్వరు కూడాను"

నరహరి దారిలో పడుతున్నట్టు గ్రహించిన గిరి, లోలోన మురిసిపోయాడు

"అది మీ భ్రమ. సంఘంలో గౌరవంగా యెందుకు తిరగలేరు? ఎవరు తిరగ

నివ్వరు ?... మీమనసులో నిబ్బరం కావాలి.ఆత్మవిశ్వాసం వుండాలి మెండుగా జీవితంలో యేదో ఒక తప్పు చెయ్యని వాళ్ళెవరు ? అయితే, ఆ తప్పుని గ్రహించి సరిదిద్దుకున్నవాళ్ళే గొప్పవాళ్ళనుకోండి ఈ విషయంలో మీరు అధైర్యంగా ఆలోచించకండి మీ ప్రక్కన నేను నిలబడతాను ఈ నీచపు బ్రతుక్కి స్వస్తి చెప్పండి... నా వెంటరండి... ఇదే నేను మనసారా కోరుకుంటున్నది..." అన్నాడు గిరి హరికి నచ్చజెప్పే ధోరణిలో

నరహరి హృదయంలో సంక్షోభం చెలరేగింది ఇప్పుడేం చెయ్యాలి?... ఆలోచన సాగించాడు నిజానికి తనకి దొంగతనం వృత్తిపట్ల రోత కలుగుతోంది... అటువంటి జీవితం, యెందుకు సాగించాలింక. అవకాశం వచ్చింది గనుక మారిపోవడం మంచిదేమో! మొదట్లో తప్పుత్రోవన పడినా, యిప్పటికయినా తరుణం మించిపోలేదు. ఈ వూబినించి తాను బైటపడాలి తనవాళ్ళకి దగ్గరగా పోయి, గౌరవనీయమైన బ్రతుకు బ్రతకాలి... అనుకున్నాడు "ఏవిటండీ యింకా ఆలోచిస్తున్నారు ?" మళ్ళీ అన్నాడు, గిరి హరిని మరోవిధంగా ఆలోచించ నివ్వలేదతను

"ఆలోచన యేం లేదండీ! నా యీ వృత్తికి యీ రోజునుంచీ శాశ్వతంగా స్వస్తిచెప్పి, మీ వెంట రావడానికి నాకేం అభ్యంతరంలేదు మీ వంటి స్నేహితుడుండగా, నాకింక భయం, ఆందోళన అనవసరం... పదండి పోదాం..." అన్నాడు వుత్సుకతతో

వుప్పొంగిన ఆనందంతో గిరి హుషారుగా లేచి, నరహరిని అమాంతం కౌగలించుకున్నాడు

"ఈరోజు నాకెంతో ఆనందంగా వుందండీ నరహరిగారూ ! నా జీవితంలో యిదో గొప్ప విజయం... మరుపురాని విజయం మీ సామానంతా సర్దండి. ఇప్పుడే బయల్దేరుదాం... ఏదో బండి దొరక్కపోదు లేకపోతే టాక్సీలో పోదాం..."

"అలాగేనండి!" అంటూ సామాను సర్దడంలో నిమగ్నుడయ్యాడు నరహరి

గిరి, విజయగర్వంతో, ముసిముసి నవ్వుకున్నాడు, తానూ హరికి సహాయపడ తూ.

* * *

గిరి వెంట వచ్చిన నరహరిని చూస్తూనే ముకుందం, కమల, ఆనందబాష్పాల్లో

రాలుస్తూ, కొడుకుని కౌగళించుకున్నారు. ఎక్కడికి పోయాడో జాడ తెలీని మనిషిమరి! సరళ అన్నయ్యని చూసి మురిసిపోయింది.

"నీ గురించి యెంతగా తల్లడిల్లిపోయాంరా బాబూ! ఎక్కడికి పోయావో, యేమయ్యావో, యెలా వున్నావో తెలీక నిన్ను తల్చుకోని రోజు లేకుండా పోయింది ఇదిగో మన గిరిబాబు ధర్మమా అంటూ, నిన్ను మళ్ళీ చూడ గలిగాం... మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళడానికి, నీకెట్లా మనసొప్పిందిరా?" అంది కమల, కొడుకు తల నిమురుతూ

నరహరికి ఆ మాటలు మరింత పశ్చాత్తాపం కలిగించాయి

"మరెప్పుడూ మిమ్మల్ని విడిచి వెళ్ళనమ్మా!" అన్నాడు, నరహరి

"అయినా, ఇల్లు విడిచిపెట్టి వెళ్ళాల్సి యెందుకొచ్చిందిరా అబ్బాయ్? మేం బ్రతికినన్నాళ్ళు బ్రతకం నువ్వు మాకు దూరంగా పోతే, మేం యేమైపోవాలి చెప్పు? నువ్వు యెక్కడికి పోయావని యెవరయినా అడిగారనుకో! అప్పుడేం సమాధానం చెప్పాలి?..." అంటూ తనలో వుండే బాధను అ విధంగా వ్యక్తం చేశాడు, ముకుందం

"క్షమించండి నాన్నా! తొందరపడ్డాను..." అనేశాడు నరహరి, మొహం దించుకొని.

గిరి, తన ప్యాంటు జేబులోంచి లాకెట్ తీసి సరళకి అందిస్తూ అన్నాడు,

"నా అదృష్టంకొద్దీ నా మాట నిలబెట్టుకొన్నాను సరళా! నీ లాకెట్ నాకెంతో సహాయపడింది—" అని

'ఔను చెల్లాయ్! నీ లాకెట్ నేను చూడకపోతే, నాలో మార్పు వచ్చేది కాదేమో! అయితే, దాన్ని గిరిగారు వుపయోగించుకున్న తీరులో అతని తెలివి తేటలు స్పష్టమౌవుతున్నయ్ ఆయన నిజంగా నా జీవితానికి ఒక మలుపు తీసు కొచ్చి, మంచి మార్గాన్ని చూపారు లేకపోతే, నా జీవితం యెలా ముగిసేదో యెవరు చెప్పగలరు? అందుకు, ఆయనకి నేనెంతో ఋణపడివున్నాను—" కృతజ్ఞతాభావంతో అన్నాడు, నరహరి

"నువ్వేకాదు బాబూ! మనం అందరమూ ఋణపడివున్నాం—" చప్పున అందుకుని అన్నాడు, ముకుందం

"అబ్బే! అలా అనకండి నేను యీ ప్రయత్నం చేశానంటే, అందుకు ముఖ్య కారణం, నా స్వార్థమే—" మందహాసంతో అన్నాడు, గిరి

"స్వార్థమా?" అదోలా చూశాడు, నరహరి




''ఔనండీ! ఇంతకుముందే చెప్పానుగా, మీ చెల్లాయిని అర్ధాంగిగా చేసుకోవాలంటే, యీ ప్రయత్నం చెయ్యక తప్పలేదు— అది నా స్వార్థమేగా!"

'ఏమో బాబూ! నీ స్వార్థం మాట యెలావున్నా, మాలో పేరుకున్న ఆవేదనని, ఆరాటాన్ని పటాపంచలు చేశావు మా వాడి బ్రతుకులో ముసురుకున్న చీకటిని తొలిగించి వెలుగును సృష్టించావు నీ ఋణం మేం యెట్లా తీర్చుకుంటామో, తెలీదు—" ముకుందం అన్నాడు, తృప్తిగా.

"మీ అమ్మాయిని నా అర్ధాంగిగా చేస్తే, ఆ ఋణం తీర్చుకున్నట్టే కదండీ" నవ్వుతూ అన్నాడు, గిరి

"మాకేం అభ్యంతరం లేదు బాబూ! సంతోషంతో అంగీకరిస్తున్నాం మీ అమ్మా నాన్నల అంగీకారం తీసుకో!" తన నిర్ణయాన్ని చెప్పేశాడు, ముకుందం

"మా అమ్మా, నాన్న యెలాగూ అంగీకరిస్తారనుకోండి—" అంటూ సరళకేసి చూశాడు, గిరి

"ఏం సరళా! ఇంకేమైనా షరతులున్నాయా?" పరిహాసధోరణిలో అడిగాడు

సరళ. సిగ్గుతో మొహం ప్రక్కకి తిప్పుకుంది

"అబ్బ! చాలెద్దురూ—అందరిమధ్యా యీ ప్రశ్నేవిటి?" అంటూ బుంగమూతి పెట్టింది

"మా చెల్లాయి అమాయకురాలనుకున్నాను— కాని, పెంకిఘటమేనండోయ్ గిరిగారూ!" నవ్వుతూ అన్నాడు, నరహరి. అందరూ నవ్వేశారు

"పదరా అబ్బాయ్, స్నానం చేద్దువుగాని—" అంటూ, సామాన్లు లోపల పెట్టే ప్రయత్నంలో పడింది, కమల

"గిరిగారూ! మీరూ యివ్వాళ్ళ యిక్కడే భోజనం చెయ్యాలి!" అన్నాడు, నరహరి

"ఈరోజు కాదండీ! మరోరోజు భోంచేస్తాగా; మా వాళ్ళు నాకోసం యెదురు చూస్తుంటారు వస్తామరి!" అంటూ ముకుందంకేసి చూసి "వస్తానండీ!" అన్నాడు.

"మించిది బాబూ! సాయంత్రం రా మరి!"

"అలాగేనండీ, మీరు చెప్పకపోయినా వస్తాను—" సరళకేసి క్రీగంటితో చూస్తూ అన్నాడు " అన్నట్టు, నరహరిగారూ, సాయత్రం మీరు రెడీగా వుండండి— నాతోపాటు మిమ్మల్ని మా మెడికల్ స్టోర్సుకి తీసుకుపోతాను— మీరు రోజూ అక్కడే కూచుని సహాయంగా వుందురుగాని—ఏమంటారు?"

"అలాగేనండీ! మీ మంచితనానికి యెలా థాంక్స్ చెప్పకోవడమో బోధ పడదు—"

"ఇన్ని పొగడ్తల బరువు నేను మోయలేనండీ! మరొస్తా— నవ్వుకుంటూ నిష్క్రమించాడు, గిరి

"సరళా! నువ్వు గొప్ప అదృష్టవంతురాలివమ్మా! నీ అదృష్టమే మన న్నందర్నీ యీ నాడు ఆనందపరవశుల్ని చేసింది మన ఇంట్లో ఓ కొత్త వెలుగును నింపింది—" తృప్తిగా అన్నాడు, ముకుందం

సరళ మొహం, సిగ్గుతో రాగరంజితమయ్యింది మెల్లగా లోపలికి నడిచింది

ముకుందం, నరహరి, పరస్పరం మొహాలు చూసుకొని నవ్వుకున్నారు నరహరి లోపలికి నడిచాడు ముకుందం వాలుకుర్చీలో కూలబడ్డాడు వుత్సాహంతో



# ఆశ్రయం




(గత సంచిక తరువాయి)

**3**

స్కూటరుమీద ఒక యువకుడు కూర్చుని వున్నాడు స్టయిలుగా బట్టలు వేసుకుని "నెక్ టై" కట్టుకున్నాడు పొత్తయిన క్రాపుని పైకి ఎగదువ్వి వున్నాడు

స్కూటరు వెనక సీటునుంచి ఒక యువతి దిగింది, వయ్యారంగా దిగి మొహంమీది చిరుచెమటని కర్చీఫ్‌తో అద్దుకుంది.

"సో, థాంక్యూ డియర్" అన్నాడు అతడు

"థాంక్యూ సోమచ్ గుడ్‌నైట్"

''అప్పుడే ! ఏదీ నా చివరి బహుమానం ..''

"అమ్మో...ఆశే..."

"చాల దారుణం డియర్", బ్రతిమాలాడు

''తప్పదు మరి. ఇది బజారు"

"మరి రేపు అదే టయిముకి..."

''అలాగే"

ఆ యువకుడు గాలిలోకి ఒక ముద్దుని వదిలాడు ఆమె నవ్వుతూ తుళ్లుతూ అడుగులు వేసింది స్కూటరు స్టార్టయి వెనక్కి తిరిగి చూసుకు పోయింది

గిర్రున వెనుదిరిగి లోపలికి వెళ్ళింది సీత

ఆమె కాళ్ళ వణుకు ఇంకా తగ్గక ముందే లలిత వచ్చింది

"అక్కా, ఇంకా నిద్రపోలేదా ?"

"లేదు లలితా ! అన్నం పెట్టనా ?"

"అబ్బ పెట్టుతల్లీ, ఇది కూడా అడగాలా ఆకలేస్తూ వుంది"

"అలాగే, కాళ్ళు కడుక్కొని రా"

క్షణాల్లో కాళ్ళు కడుక్కొని వచ్చింది లలిత పీటమీద కూర్చుని గబగబ అన్నం తింటూవున్న లలితనే చూస్తూ వుండిపోయింది సీత

కాసేపయాక తలెత్తి చూసింది లలిత అక్క చూపు ఆ పిల్లలో గాభరా కలిగించింది ఆ గాభరా అణచుకొని "ఏమిటలా చూస్తున్నావ్ ?" అని అడిగింది లలిత

"ఏంలేదు, సినిమా ఎట్లా వుంది ?"

"సినిమాకేం ? వండర్ ఫుల్‌గా వుంది"

"ఒక సంగతి చెబుతాను లలితా, వింటావా ?" అంది సీత కొన్ని క్షణాలు గడిచాక. "ఓ" అంది లలిత తల వంచుకుని.

"చెల్లీ ! సినిమాలు చూట్టానికే బాగుంటాయి కాని బ్రతుకుల్ని సినిమాల్లాగ చేసుకుంటే భరించటం చాల కష్టం లలితా ! సినిమా చూసి కన్నీరు కార్చిన మనిషే నిజస్థిన జీవితంలో ఎదురయిన అటువంటి సంఘటననే క్షమించి వదిలిపెట్టలేడు-కాకిలాగ పొడవకా మానడు. అది నువ్వు గమనించావా ?"

"ఏమిటక్కా సినిమా డైలాగు వదులుతున్నావ్ ? ఏమయింది !"

"మనం ఆడపిల్లలం లలితా. అందునా ఆర్థికంగా చితికిపోయిన కుటుంబం మనది ఇవన్నీ ఆలోచించి జాగ్రత్తపడమంటున్నాను" అంది సీత

"అక్కా ! నువ్వా నీ ముది మాటలూను అందుకే నువ్వంటే నాకు కోపం" అంటూ బుంగమూతి పెట్టింది లలిత

"పిచ్చి తల్లీ, నీ బాగుకోసమే నమ్మా నా ప్రయత్నం నన్నర్థం చేసుకో కోపంవద్దు"

"సర్లేమ్మా, పెద్ద ! అవునుగానక్కా, నేనడిగింది ఏంచేసావు?"

"ఏమిటది ?"

"అదుగో షష్ఠీ మొదలన్నమాట ! పార్టీకి డబ్బులు ఇస్తానన్నావు గదమ్మా"

"సరేలే, చూద్దాంలే"

"చూద్దామంటే గాదు, అవతల పరువుపోతుంది. మాట ఇచ్చాను"

"పరువు పోతుందనుకున్నప్పుడు మాట ఎందుకిచ్చావు ?"

"అబ్బ ! షష్ఠీ మొదలు"

"సరేలే"

"రేపు సాయంత్రానికల్లా ఇవ్వాలి మరి! మా అక్క మంచిదిగా!" అంటూ చెయ్యికడుక్కొని లేచిపోయింది లలిత

కంచంతీసి, ఎంగిలి ఎత్తి అవతల పెట్టింది సీత

గదిలోంచి కూనిరాగాలు వినవస్తున్నాయి ఆ గొంతు లలితది సీత ప్రేగులు ఆకలితో అరిచాయి అన్నం తినాలనిపించింది అంతలోనే సీత మనసు వెనక్కి లాగింది వీధితలుపులు వేసివచ్చి పడుకుంది సీత

"అక్కా! నువ్వు తిన్నావా? నువ్వా పెట్టుకో వేళకి నువ్వు తినెయ్యక ఎందుకమ్మా నాకోసం కూచోటం? సరేలే రా ఇద్దరం కలిసి తిందాం" అని లలిత అని వుంటే సీత తినేదేమోగాని - లలిత ఆ మాట అన లేదు ఆకలి, తినాలన్నా మనసు తిన నీయలేదు

నాన్న చాలరోజుల తరవాత ఇంటికి వచ్చారు

అమ్మ ఎంతో సంబరపడి హడావుడి చేసింది.

కాని అంతలోనే అలాగున అయిపోయింది నాన్న కోపగించి వెళ్ళిపోయారు అమ్మ దుఃఖంతో అన్నం మానేసి పడుకుంది (సుబ్బమ్మ ఇంకా మంచంలో కదుల్తూనే వుంది) శశిధర్ దెబ్బలుతిని ఏడ్చి నిరాహారంగానె నిద్రపోయాడు

రాజు పరీక్ష మరలా పోయింది! ఆ విచారం వాడికి లేదుగదా, పైపెచ్చు వాడు జల్సా చేస్తున్నాడు

తాగుతున్నాడు! చీకు చింత లేక తిరుగుతున్నాడు!

పులిమీద పుట్రలాగ లలిత మొదలెట్టిన పిచ్చి తిరుగుళ్లు ఈ రోజే తన కంటబడటం జరిగింది!

లలిత అమాయకురాలు

తనకి రేపు ఏమయినా మోసం జరిగితే!

ఏమిటి ఇదంతా!

ఎందుకు ఇలాగ జరుగుతూ వుంది?

ఈ కుటుంబం ఏమవుతుంది? నడి సముద్రంలో గాలివాటున కొట్టుకు పోతున్న ఈ పడవని తుఫాను ముంచెయ్యదుగదా!

ముంచెయ్యటమే జరిగితే?

అమ్మో!

ఏ దారీ తోచదు దట్టమైన అడివి లాంటి బ్రతుకులో బలమయిన బంధనాలు వేసే తీగల్లాంటి సమస్యలు!

వంటగది సర్ది, వీధి తలుపువేసి వచ్చింది సీత ఇన్ని మంచినీళ్లు త్రాగి దీపం తగ్గించి మంచంమీద నడుము వాల్చింది

చాలసేపటివరకు నిద్రపట్టలేదు

కనులు మూతలు పడలేదు

మనసు కల్లోలితమయింది గాలి తూపుకి అల్లలాడి కొండెక్కబోయిన దీపం మరల ప్రాణం నిల్పుకుంది; వెల్గులు వెదజల్లసాగింది

ఉస్సురని నిట్టూర్చింది, సీత బాగా ప్రొద్దుపోయింది సీత అలసిన కనులు ఏదో ఒక క్షణాన అరమూతలు పడ్డాయి

''టక్...టక్...టక్...''

సీతకి మెలకువ వచ్చింది "ఎవరూ ?" అంటూ పిల్చింది, జవాబు లేదు ఎవరూ లేరు, తనే పొరపాటు పడ్డాననుకుని ప్రక్కకు తిరిగి పడు కుంది సీత.

"టక్...టక్...టక్" వీధి తలుపు మీద చిన్నగా మోత

సీత వులికిపడి లేచింది, "ఎవరది ? ఎవరంటే మాట్లాడరేం?" అంది సమా ధానం లేదుగాని మరల తలుపుమీద చప్పుడయింది బహుశా రాజు అయి వుండాలి ఇటువంటి పనులు అతనికి అలవాటే

తలుపు తీసింది సీత

ఎదురుగా చీకట్లో ఒక పురుషాకారం నిలబడివుంది !

'రాజూ !"

"కాదు, నేనండి, బాబు "

"నేనంటే ?"

"ఒకసారి ఇలారండి బాబు! మీతో పనిబడింది మాటుంది" ఆనందరావు గుసగుసగా అన్నాడు

"ఏమిటా పని ?"

"అదేమిటండి బాబు ! మా ఇంట్లోకి పాము వచ్చింది, రండి దాని పని పడ దాము త్వరగా రండి మరి !"

"బాగుందండి, నన్నేం చెయ్య మంటారు ?'' అంది సీత ఆశ్చర్యంగా

"భలేగా వుందండి బాబు! మంచి కయినా, చెడుకయినా తోడుకావాలండి మరి రండి అసలే చలికి వణికిపోతు న్నాను మీకేం హాయిగా లోపలుండి మాట్లాడుతున్నారు నేను బయటున్నాను గద !''

"ఆనందరావుగారూ ! ఇది మర్యాద గాదు ఎవరయినా చూస్తే బాగుండదు ! దయచేసి వెళ్ళిపొండి "

"అరే! అదేంటండి ? రండి బాబు అని నేనంటుంటే పొండని మీరంటారు?! నేను ఒంటరివాణ్ణి, అవతల పామువచ్చే! అవునా ?"

''ఈసరికి దాని దార్ని అది పోయుంటుందిగాని మీరు వెళ్ళండి ''

'నేను వెళ్లను గాక వెళ్లను మీరు వచ్చేవరకు ఇక్కడనే వుంటా ''

"షటప్!''

"అదేంటండి బాబు ! అంత మాటం టారు! ఇరుగు పొరుగన్నాక కాస్తయిన అభిమానం వుండాలి ఒకరి కొకరు సాయం చేసుకోవాలి పో పొమ్మని




అలాగ అంటే నేను ఒక్కణ్ణి ఆ పాముతో ఎలా చచ్చేది?'

"ఎక్కడుంది ఆ పాము ? మీ ఇంట్లోనా ? లేక మీ మనసులోనా ?"

"పోనీ నా మనసులోనే అనుకోండి తెలేవారండి బాబు ! రండి మరి. ఎవరూ చూడరు లెండి అందరూ నిద్ర ళ్ళలో వున్నారు వెధవది ఆ పాము గొడవతో నాకు చచ్చినా నిద్రపట్టటం లేదు "

"నోర్మూసుకొని వెళ్ళిపొండి. ఇంకొకసారి ఇలాగ చేసేరంటే మర్యాద దక్కదు, జాగ్రత్త పిచ్చి వేషాలు వెయ్యకండి "

"తెలేవారండి బాబు ! ఎంత కోపం ! మీ కోపంకూడా అందంగానే వుంటుం దండి" అంటూ లోపలికి రాబోయాడు ఆనందరావు.

ఠక్కున అతని మొహంమీదే తలుపు వేసింది సీత గడియపెట్టి వచ్చి మంచం మీద పడుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

పున్నమ్మ గారింట్లోంచి తొలి కోడి కూసింది

సీతకి ఇక నిద్రపట్టలేదు

చీకట్లోనే లేచి వాకిలి వూడుస్తుంటే రెండు కాళ్లు వచ్చి సీతదగ్గర నిలబడ్డాయి. వాటిని గమనించి తలెత్తి చూసింది సీత. రాజు నిలబడి వున్నాడు ఎదురుగ.

"అన్నాయ్ !"

"నే నే సీతా !"

కాసేపు నిశ్శబ్దంగా గడిచిపోయింది.

"ఎవరూ యింకా నిద్రలేవలేదు గదా !"

"ఉహూ "

"గుడ్ నేను వెళ్ళి పడుకుంటాను.

నా అంత నేను లేచేవరకూ నిద్ర లేపకు :"

"అలాగే :"

"అన్నట్టు నిన్నటి సంగతి ఎవరికీ చెప్పలేదుగదా :"

"వద్దన్నావుగదా :"

''మా చెల్లాయ్ మంచిది" అంటూ గబగబ లోపలికి వెళ్ళిపోయాడు రాజు. ఉదయం లేవగానే సుబ్బమ్మగారు గొడవ పెట్టుకుంది. రాజును లేపి బెడ్ కాఫీ ఇమ్మని పదే పదే చెప్పింది ఆ మాటని సీత పాటించలేదని గొడవచేసింది

"ఈ ఇంట్లో నా మాటని ఎవరుపట్టించు కుంటారు : అద్దాలనాడే బిడ్డలుగానీ గడ్డాలనాడు కాదుగదా : ఒక పెద్దా, చిన్నా లేదు ఏంపిల్లలు: ఏంసంసారం: ఇక నావల్ల కాదు తల్లీ: అందరూ పోయి ఏ గంగలోనన్నా కలవండి...'' అంటూ గొణుగుతూనేవుంది, ఆ గొణు గుడు విని విని తలపట్టుకుని, ఇక నోరు మూసుకో తల్లీ:' అంటూ హెచ్చరిం చింది లలిత

"మూసుకుంటానే మూసుకోక ఏం చెయ్యను :" అని కోపంలో మంచం ఎక్కి ముసుగు తన్నింది సుబ్బమ్మ నోరుమూసుకుని

ఇంటిపన్లన్నీ ముగించి శశిని స్కూల్‌కు పంపించి ఆఫీసుకు వెళ్ళింది త్వరగానే సీత, సీతని చూసి కళ్లెగరేసాడు మాణిక్యరావు ఇంకా ఆఫీసుకెవరూ రాలేదు," సీతా: ఒకసారి ఇలా వస్తావు:" అన్నాడు మానిక్యరావు

"యస్సర్," అంటూ అతన్ననుస రించింది సీత,

ఇంకా ఎవరూ రాలేదు సుజాతకూడ రాలేదు. ఆఫీసు వెనకాల చెట్టుదగ్గరికి వెళ్ళి నిలబడ్డాడు మానిక్యరావు. అతని వెనకే వెళ్ళి కాస్త దూరంలో నిలబడింది సీత

"సీతతో ఒకమాట చెప్పాలని ఎన్నాళ్ళ నుండో అనుకుంటున్నాను ఈవేళ్టికి ఆ అవకాశం వచ్చింది ఆ మాట ఏదో చెప్పి నా మనసులోని గుదగుదని తగ్గించు కుంటాను," అని ఆగేడు

"చెప్పండి :"

''నిజం చెప్పద్దూ : నేను అలా ఏదో వాగుతూ వుంటాను గాని నా మనసు మంచిదే నా వయసా పెద్ద ముంచు కొనివచ్చిందిలేదు నన్ను అన్యాయంచేసి నా భార్య వెళ్ళిపోయింది కుర్రనాగ మ్మలు ఇద్దరూ ఆలనా పాలనా చూసే వాళ్ళులేక పిచ్చివాళ్ళల్లాగ తిరుగు తున్నారు అందుకని "నీకేం తక్కు వయ్యా, ఇంకో పెళ్ళిచేసుకోరాదా : అటు పిల్లల్ని చూసుకునేందుకు తల్లీ, ఇటు ఇల్లుదిద్దేందుకు ఇల్లాలూ అవసరం గద: అసలు ఆడది దీపం పెట్టని ఇల్లు ఏఇల్లు :" అని తెల్సినవాళ్ళు చెవుల్లో పోరి నా మనసు విరిచేసారు ఏవో సంబంధాలు వస్తున్నాయనుకో అయితే



సంసారమన్నాక మనసులు కలవాలిగదా ఆ వచ్చేది మొదటి భార్యలాంటిదే అయి ఇల్లు దద్దాయాగం చేసేదయితే తల నొప్పి కొనితెచ్చుకున్నట్టు అవుతుంది మరి ఆ పైన ఆ పిల్లలుండిరి...!"

"ఇదంతా నాకెందుకు చెప్తారుసార్?" అంది సీత.

మాణిక్యరావు నవ్వాడు "వస్తున్నా పాయింట్‌కే వస్తున్నా ఆగుమరి, రాత్రి మీ నాన్న మా యింటికి వచ్చాడు."

''నాన్న వచ్చారా?!''

"ఆఁ రాత్రి అక్కడే ఉన్నాడు ఇప్పుడూ అక్కడే వున్నాడు చిరకాల స్నేహితం వలన ఇద్దరం రాత్రంతా నిద్ర మాని మంచి చెడు చెప్పుకున్నాము మన సులు విప్పి కష్ట సుఖాలు ముచ్చటించు కున్నాము"

''అలాగా?!''

"ఆఁ మేం. చివరికి ఓ నిర్ణయానికి

వచ్చాము. ఆ నిర్ణయం తెల్పటానికే నిన్ను ఇప్పుడు పిలుస్తి!"

"చెప్పండి మరి."

"మీ అన్న రాజు అలాగ బాధ్యత పట్టకుండా తిరుగుతున్నాడు! నీ పెళ్ళి విషయం పోనీలే అనుకున్నా లలిత బాధ్యత వుండనేవుంది తర్వాత శశిధర్ వున్నాడు కుటుంబం అలాగ అయోమయమయిన పరిస్థితిలో వుంది ఇదంతా చెప్పి ఎంతో బాధపడ్డాడు మీ నాన్న. పాపం ఎంత గుండెధైర్యంవున్నా ఆ పరిస్థితిలో ఎవరయినా అంతేగదా!"

సీత కళ్లు తడి అయాయి

"ఒకవేళ రేపు ఎవరయినా నిన్ను కట్టుకోటానికి సిద్ధపదినా అది నీ సంపాదన కోసమేగాని అభిమానంతో గాదనేది పచ్చినిజం అటువంటప్పుడు అతడు ఈ సంసార బాధ్యతని నెత్తిన వేసుకుంటాడా అన్నదీ అనుమానాస్పదమే. ఒకవేళ ఆ వూపులో అందుకు సిద్ధపడినా ఆ తర్వాత అతడు మాటచెల్లించుకుంటాడన్న నమ్మకం ఏమిటి? ఇవన్నీ ఆలోచించి ఎంతో ఆందోళన చెందాడు మీ నాన్న..."

సీత మౌనంగా వింటూ వుండిపోయింది

"నిజంగా సీతా! ఆయనకంటే నువ్వే ఎంతో ధైర్యస్తురాలివి, నాకు నువ్వే నచ్చావు. అందుకని నేను ఆయనకి మాట ఇచ్చానులే ఎంతో ఆలోచించి చివరికి ఇది ఉభయతారకంగ వుంటుందనిపించి ఆ నిర్ణయానికి వచ్చాము. నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను మీ కుటుంబాన్ని ఆదుకుంటాను నీకయినా అంతకంటే ఏంకావాలి! అవునా!"

అవును కాదని ఏందెప్పలేకపోయింది సీత

"నీ ఇష్టం మరి మీ నాన్నయితే మాట ఇచ్చాడు ఆయనసలే మొండిమనిషి. కాదని అల్లరిపడి ఆయన్తో గొడవ పెట్టుకుంటావో, అవునని ఆయన్ని సంతోషపెడతావో నీ చేతుల్లో వుంది. మరి బాగా ఆలోచించుకో నా వుద్యోగం, హోదా నీకు తెల్సు ఇంకా వెనుక ఆస్తిపాస్తులు వున్నాయి నీకేలోటు రానివ్వను పువ్వుల్లోపెట్టి చూసుకుంటాను బాగా ఆలోచించే చెప్పు నువ్వు కాదన్నా తప్పేదిలేదు అనుకుంటాను అల్లరి అశాంతి తప్ప ఫలితంసున్న అవునంటే అందరూ సంతోషిస్తారు" మాణిక్యరావు ఆగి కళ్ళజోడు తీసి తుడుచుకోసాగాడు కర్చీఫ్తో.

ఆఫీసుజనం ఒకొక్కరే రావటం మొదలయింది

ఆఫీసులో సందడి ప్రారంభమైంది.

"సర్లెండి" అంటూ అక్కడ్నుంచి రాబోయింది సీత.

"అంటే ఒప్పుకున్నట్టేనా?!" ఆనందం, ఆశ్చర్యం అణుచుకుంటూ అడిగాడు అతను

"ఆలోచించి చెబుతాను."

"అలాగే" అన్నాడు సీత వచ్చేసింది అప్పటికి సుజాత వచ్చి మెషీను సర్దుతూ వుంది."

"ఏమిటి ముసలాయన ఏదో చెప్తున్నాడు," అని అడిగింది సుజాత

"అదొక గొడవ!" అని నవ్వింది సీత.

"అదే, ఏమిటా గొడవని?"

"చెప్తానులే."

అక్కడితో వూరుకుంది సుజాత ఇద్దరూ యంత్రాల్లాగ యంత్రాన్ని నడిపించడంలో మునిగిపోయారు

కాసేపయాక సుజాత పని ఆపింది.

"ఏమిటి సుజాతా?" అంది సీత స్నేహపిచ్చిలంగా, తనూ పని ఆపి

గుండెలమీద చేతులు పెట్టుకుని అదుముకుంటూ "నొప్పిగాఉంది సీతా." అంది సుజాత. సీత కంగారుగా లేచింది. ఇద్దరికీ సెలవుచీటీలు వ్రాసి మేనేజరు కిచ్చి వచ్చింది రిక్షామీద ఇద్దరూ డాక్టరు కళ్యాణి దగ్గరికి వెళ్ళారు,

డాక్టరు కళ్యాణి సుజాతని పరీక్ష చేసింది "ఏంలేదు,నీరసంవల్లఅలాగైంది కొద్దిగా జ్వరంకూడావచ్చింది కాస్త పని తగ్గించు. పళ్ళు అవీ తీసుకో, మందులు, టానిక్ రాసిస్తాను" అంది డాక్టరు కళ్యాణి సుజాతకు దూరపుచుట్టం అవుతుంది

"ఈ అమ్మాయి ఎవరూ?" అంది కళ్యాణి ఇంజక్షన్ ఇస్తూ, సీతని

"నా బెస్ట్‌ఫ్రెండ్, మనవాళ్ళే" అని పరిచయం చేసింది సుజాత సీత చేతులు ముడిచి నమస్కారం చేసింది

డాక్టరు కళ్యాణి గలగల మాట్లాడుతుంది, మంచి కలుపుగోలుతనం వున్న మనిషి, కాఫీలు తెప్పించింది

పనయాక వాళ్ళు వచ్చేస్తూవుంటే "అవసరం లేకపోయినా అప్పుడప్పుడు వచ్చిపోతుండండి, ఏదో నాకు కాస్త రిలీఫ్ అన్నట్లు మనం ఒకే ఏజ్ గ్రూపు వాళ్ళమవటం వలన సర్దాగా కలిసిపోవచ్చు," అంటూ హెచ్చరించింది కళ్యాణి,

మందులు కొనుక్కుని బయటికి వచ్చాక 'ఇక వెళ్తావా?' అంది సుజాత

"ఎక్కడికి వెళ్లను?" అంది, సీత గాబరాగ.

"అదే ఆఫీసుకి. ఇప్పుడు నాకు బాగానే వుందిలే."

"భలేదానివే, నిన్నిలాగ వదిలిపెట్టి నే నాఫీసుకు వెళ్ళనా? పద పద" అంది సీత స్నేహితురాలి రెక్క పట్టుకొని.

ఇద్దరూ సుజాత ఇల్లు చేరేసరికి రాజారావుగారు ఇంటిదగ్గరే వున్నారు

"ఎలా వుందమ్మా?" అని అడిగారు.

"బాగానే వుంది నాన్నా, అయినా నీకెలా తెల్సు?" అంది సుజాత ఆశ్చర్యంగా.

ఆయన నవ్వాడు, కళ్యాణి మా ఆఫీసుకు ఫోనుచేసిందిలే ఒక స్నేహితురాల్ని తీసుకుని కళ్యాణిదగ్గరకు వైద్యానికి వెళ్ళి ఇంటికి వచ్చావని చెప్పింది, ఈ అమ్మాయేనా ఆ పిల్ల?"

"అవున్నాన్నా."

సీత ఆయనకి నమస్కారం చేసింది.

"ఆశీర్వాదం తల్లీ. సుజాత తల్లిలేనిపిల్ల. నేను అసలే కంగారుమనిషిని, నేను ఆఫీసుకి వెళ్ళివస్తాను అన్నట్టు దుర్గారావు వచ్చాడా?" రాలేదన్నట్టు తలూపింది సుజాత, సీత ఆశ్చర్యంగా వింటూ వుండిపోయింది.

"సర్లే నేను వెళ్ళివస్తాను. జాగ్రత్త తల్లీ!" అని హెచ్చరించి రాజారావుగారు వెళ్ళిపోయారు.

"ఏవిటా ఆశ్చర్యం?" అందిసుజాత.

"ఏంలేదు!"

"అన్నట్లు నీకోమాట చెప్పటం మర్చిపోయాను, సీతా!" అంది సుజాత నీరసంగా.

"తర్వాత చెప్తువుగానిలే, పడుకో, రెస్టు తీసుకో, కాఫీ కలుపుకురానా?"

"థాక్స్ - అలాగే. వంటగదిలో అన్నీ వున్నాయి. కాస్త వెతుక్కోవాలి."

"అలాగే."

కాఫీ కలిపి తీసుకొచ్చింది సీత. "మరి నీకో?" అంది సుజాత. నాకు వద్దులే, నువ్వు తాగు."

"నథింగ్ డూయింగ్. ఫిఫ్టీ - ఫిఫ్టీ" అంటూ బలవంతంచేసింది. సీతకూడ తాగక తప్పలేదు. కాసేపు అయాక టానిక్ తాగించి బత్తాయిపండు ఒలుస్తూ వుండిపోయింది సీత. పైకి చూస్తూ ఆలోచనలో పడింది సుజాత

"సుజాతా!"

"ఊఁ"

"ఒక సలహా కావాలి, ఇస్తావా?"

"అలాగే"

"నేను మాణిక్యరావుగార్ని పెళ్ళి చేసుకుంటే ఎలాగుంటుంది?"

సుజాత ఉలిక్కిపడింది. "సీతా!" అంది వెంటనే సంబాళించుకుని

"నిజం, ప్రామిస్!"

"షటప్, కలలో కూడా ఆ మాట రానీకు" కోపంగా అంది సుజాత.

"కాని అదే నిజమవుతుందేమోనని పిస్తూంది."

సుజాత లేచి కూర్చుంది "ఆర్యూ సీరియస్?!"

సీత తలాడించింది

"సీతా! నాకు చాల చిత్రంగా వుంది. ఆశ్చర్యంగానూ వుంది భయం కూడా అనిపిస్తూ వుంది. సుఖంగా బ్రతకటానికి అందరికీ హక్కువుంది సీతా! నీక్కూడా. భయంకరమయిన దారులవెంట బ్రతుకుని తీసుకుని వెళ్ళవద్దు."

ప్లీజ్! అర్థించింది సుజాత

మౌనంగా వుండిపోయింది సీత.




కాసేపటికి నోరు పెగల్చుకుని – ఆ తర్వాత చాలసేపు చాల ముచ్చట్లు చెప్పుకుంటూ పోయింది, స్నేహితురాలికి సుజాత వింటూ వుండిపోయింది

గాలిలో దీపంవంటి కుటుంబపు తీరు, రోజు రోజుకి మరింత బిగిసిపోతున్న సమస్యలు, ఆ చిక్కుల్ని విడదీయటానికి తను పడే తాపత్రయాలు, అంతలోనే ఉత్సాహం తెచ్చిపెట్టేఆ ఆశలు, మరుక్షణం విఫలమై మనసుని క్రుంగదీసే వాటి తీరుతెన్నులు అలా ఆశ కలిగించి చివరికి మూసుకుపోతున్న బ్రతుకుదారులు, భయం గొల్పుతున్న భవిష్యత్తు!

విని విని అలిసి నిద్రపోయింది సుజాత, మధ్యలోనే.

వొలిచిన పండుని సాసర్లో పెట్టి మరో సాసరు దానిమీద మూత పెట్టి లేచింది సీత

కప్పులు కడిగి వంటగది సర్దింది

సాయంత్రానికని కాసిని బియ్యం తీసి ఏరింది బుట్టలోంచి నాలుగు బెండకాయలు తీసి ముక్కలుగా తరిగి పెట్టింది

ఇంకా సుజాత నిద్రపోతూనే వుంది.

వీధి తలుపువేసి, డాబామీదికి అల్లుకొచ్చిన సన్నజాజి తీగనుంచి నాలుగు పూలుకోసుకొద్దామని మెట్లెక్కింది. పైకి వెళ్ళగానే హాయిగా చల్లటి పిల్లగాలి వొంటికి తగిలింది!

అంతలో ఏవో అరుపులు వినపడ్డాయి. పూలుకోయబోతూ వున్న సీత ఆశ్చర్యంగా అటు తిరిగింది.

సీత కాలు చేతులు స్తంభించాయి!

ఆశ్చర్యంతో, భయంతో నిలువుగ్రుడ్లు వేసుకుని చూస్తూ నిలబడింది సీత ॥

## 4

ఆ ఇంటికి నాలుగిళ్ళవతల పాడు పడిన ఒక ఇల్లు వుంది విశాలమయిన ఆ ఇంటి ఆవరణలో చెట్లక్రింద చాపలు పరిచి వున్నాయి ఆ చాపలమీద కొందరు మనుషులు కూర్చుని పేకాటలో దీక్షగా మునిగిపోయారు పేకముక్కలు గబగబ నడుస్తున్నాయి. డబ్బు చేతులు మారుతూ వుంది. కూర్చుని అలా ఆడు తుంటూవున్న ఆ మనుషులకి ఇవ తలగా - ఒక మనిషిని ముగ్గురు మను షులు చుట్టుముట్టి వున్నారు

ఆ ముగ్గురిలో ఒకతను బలిసిన దున్నపోతులాగా వున్నాడు. చారల బనీను, గళ్ళపాంటులో టకప్ చేసాడు అతను బిగ్గరగా అరుస్తున్నాడు మిగతా ఇద్దరు అతని ప్రక్కన చేరి చోద్యం చూస్తున్నారు

ఆ చారల బనీను దున్నపోతు చేతులు బిగిసివున్నాయి ఆ చేతుల్లో ఆ నాలుగో మనిషి చొక్కా వున్నది. ఆ మనిషి గిజగిజలాడుతున్నాడు లబలబ మంటున్నాడు, బ్రతిమాలుతున్నాడు. దీనంగా మొహంపెట్టి వున్నాడు

అతను రాఘవయ్య !

''నాన్నా ! నాన్నా !'' అంటూ గొణిగింది సీత. నరాలు గజగజ వణి కేయి, గుండెలు ఎగసిపడ్డాయి

చివరికి ఆ ''బనీను'' రాఘవయ్యని వదిలిపెట్టాడు

''రేపు సాయంత్రంలోగా బాకీ తీర్చకపోయావో జాగ్రత్త, ప్రాణాలు తీస్తాను'' అని కొన్ని బూతులు కూసి అటూ ఇటూ వూపి వదిలిపెట్టాడు రాఘ వయ్యని. అప్పుడుగానీ వూపిరి వదల లేకపోయింది సీత పెద్దగా నిట్టూర్చి గబగబ క్రిందికి పరుగెత్తి వచ్చింది. చాలాసేపటివరకు గుండెదడ తగ్గలేదు. వంటగదిలోకి వెళ్ళి మంచినీళ్ళు తాగింది. ఇటూ అటూ కాసేపు తిరిగింది. ముందు గదిలోకి వచ్చేసరికి అప్పుడే కళ్ళుతెరిచిన సుజాత అడిగింది.

''ఏం ? అలా వున్నావు ?''

''ఏం లేదులే'' అంటూ ఎదురుగా కూర్చుని వొలిచిన బత్తాయి తొనలు విడదీసి అందించింది సీత, సుజాతకి. సుజాత మొహాన చెమట పుట్టివుంది. మౌనంగా కొన్ని క్షణాలు గడిచి పోయేయి

''అన్నట్టు అయాం సారీ, సీతా ! ఒక ముఖ్యమయిన పనిచెయ్యటం నేను మరిచాను ''

''ఏమిటది ?''

''ఒకమాట చెప్పమంటావా ?''

''ఊం ''

''నీకేమి చెప్పలేదూ ? దుర్గారావు వూళ్ళోనే వున్నాడు ! ఎవరో ఫ్రెండు కనిపించి బలవంతం చేసారట.






అందువలన అతను ఆగిపోయేడు ఇవాళ్టికి ''

సీత కళ్లు పెద్దవిచేసి చూసి రెప్ప లల్లార్చింది

"ప్రొద్దుట అతను మా ఇంటికి వచ్చి నాన్నతో చాలసేపు మాట్లాడి వెళ్లేడు. నాన్న అతన్ని కేకలు వేసేరు!"

"ఎందుకు?" అంది సీత తల వంచుకుని ఆలోచిస్తూ, "ఎందుకేమిటి, మనిషి అలాగ తయారయితే ఎవరు మాత్రం ఊరుకుంటారు సమస్యలు అందరికీ వుంటాయి అంతమాత్రానికి అలాగు డీలాపడి ఆరోగ్యం చెడగొట్టుకోవాలనుందా? అయినా అతనికేం తక్కువయిందని!"

సీత మౌనంగా వుండిపోయింది

"అతను అలాగ ఎందుకు అయేడో నీకు, నాకు, అతనికితప్ప నాలుగో మనిషికి ఈనాటివరకూ తెలీదు. అన్నట్టు అతను నీకు ఒక ఉత్తరం రాసి నీకిమ్మని ఆ బాధ్యత నాకు వప్పచెప్పాడు. ఆ సంగతే నేను మర్చిపోయానంటున్నది! చదువుతావా ఇప్పుడు?"

తల ఊపింది సీత.

సుజాత లేచి తలగడక్రింద వెతికింది ఆ తర్వాత వెతికి వెతికి టేబులు డ్రాయర్లోంచి ఒక కవరు పట్టుకొచ్చింది.

కవరు చించి, "ఎంత వుబలాటంగా వున్నా, నేను చదవలేదు, అది అతను నీకు రాసింది అందువలన అనుచితమనిపించి నా కోరికని నాలోనే అణగద్రొక్కుకున్నాను" అంటూ అందించింది, ఆ వుత్తరాన్ని అది అందుకుని చదువుకుంది సీత

"సీతగారూ!"

నేను దురదృష్టవంతుడ్ని ఎంతగా ప్రయత్నించినా మిమ్మల్ని నా మనో ఫలకంనుంచి చెరిపివేసుకోలేకపోతు న్నాను వాస్తవానికి నాకు ఈ ఊరు రావలసిన వేరే పని ఏంలేదు. నేను కేవలం మీ కోసమే అంత దూరంనించి వచ్చానని ఎవరికీ తెలీదు. ఈ సంగతి మీరు నమ్ముతారా ? నోటితో చెప్పలే నేమోననుకుని నా మనసుని కాగితం మీద పెడుతున్నాను. ఇప్పటికీ నా మనసు మీ కోసమే తాపత్రయపడుతూ వుంది. అన్ని విషయాలూ ఇదివరకే మీకు చెప్పి వున్నాను ఇకనయినా మీ మనసు మార్చుకుని సరే ననరూ ? కనీసం నా పరిస్థితికి జాలిపడయినా మీరు ఒప్పుకోలేరూ ?

సీతా ! నా వలన ఏమయినా పొర పాటు జరిగిందా ? నాకు తెలిసిగాని తెలీకగాని మీ మనసుని నొప్పించితే అందుకు హృదయపూర్వకంగా క్షమా పణ కోరుకుంటాను ఇది నా ఆఖరి ప్రయత్నం. నాలో ఇంకా చావని ఆశే నాచేత ఈ పని చేయిస్తోంది నన్ను క్షమించండి, ఇప్పుడూ మీరు కాదంటే మరల మీకు కనిపించనని మాటయితే ఇస్తున్నాను నా అదృష్టం ఎలా వుందో మరి ! – ఇట్లు దుర్గారావు."

చదవటం ముగించి ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చించేసింది సీత

"ఎందు కట్లా చించేసావు ?'' అని అడిగింది సుజాత ఆశ్చర్యంగా "ఆ విషయం నా మనసులోనే చెక్కు చెదరక నిల్చిపోతుంది ఇంకా ఇది ఎందుకు ?" అంది సీత.

"అతను ఏమంటాడు ?"

సీత తలొంచుకుంది, అశ్రువులతో కళ్ళు నిండిపోయాయి. ధారలుకట్టి బుగ్గలమీద చారికలు ఏర్పడ్డాయి

సుజాత చలించింది

లేచి వచ్చి ప్రక్కన కూర్చుని కన్నీరు తుడిచింది

"పిచ్చిదానా ! ఎందుకేడుస్తావు ?" అంది

"ఇది ఏడుపుకాదు సుజా ! సంతోషం."

"మరి ఆ కన్నీరు ?!"

"అవి ఆనందబాష్పాలు."

"సరే, నేనూ ఆనందబాష్పాలు రాలుస్తాను, విషయమేమిటి చెప్పు "

"అది నీకు తెలిసిందే."

"అవుననుకో, నీ నిర్ణయంమీదగదా, దాని తీరుతెన్నులు ఆధారపడి వుండేది ! అదేమిటో చెప్పమనే, నేననేది."

సీత మౌనంగా వుండిపోయింది.

"మరేం తొందర లేదులే నిదానం గానే చెప్పు."

తలాడించింది సీత

ప్రొద్దువాటారింది సాయంత్ర



యు వ



మయింది. స్నేహితురాళ్ళిద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు వుండిపోయారు

ఉన్నట్టుండి సుజాత మౌనాన్ని భంగంచేసింది.

"అన్నట్టు సీతా, మర్చేపోయాను. నాన్నగారు సాయంత్రం భోజనానికి ఒక అతిథిని పిలిచారు. నాకు చూస్తే ఇలాగయింది. ఇక ఆ బాధ్యత నీది. వంటగది నీకు అప్పచెప్పాను అన్నీ వెతుక్కుని ఏం చేస్తావో - అతిథుల్ని ఎలాగ సంతృప్తిపరుస్తావో నీదే బాధ్యత"

"అలాగే" అంటూ లేచింది సీత.

వంటగదిలో చాలసేపు తంటాలుపడి ఏవి ఎక్కడున్నాయో తెలుసుకుంది.

బుట్ట అడుగునించి బంగాళా దుంపలూ, దొడ్లోనించి ఒక ఆకు కూరా తీసి తెచ్చి తరిగింది. పప్పుచారుచేసి, నాలుగు అప్పడాలు వేయించింది. చేసిన వన్నీ గిన్నెల్లో సర్ది వంటగది తలుపు

వేసి ఇవతలికి వచ్చేసరికి ప్రొద్దు గూకింది చీకటి పడింది.

ఇంట్లో లైటువేసి ఇవతలకి వచ్చే సరికి సుజాత లేచి మొహం కడుక్కు వచ్చి అడిగింది "అంతా అయిపోయి నట్లేనా ?"

"ఆఁ"

"గుడ్ మంచి అమ్మాయంటే అలా గుండాలి" అని నవ్వింది.

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్. ఇదంతా నీ నుంచి నేర్చుకున్నదే సుమా !"

"ఓహో ! మళ్ళీ మెలిక నాకే వేసావన్నమాట."

"యస్ మేడమ్"

ఇద్దరూ పకపక నవ్వుకున్నారు.

"సరేలే, టయిమయింది. మందు వేసుకొని బత్తాయి రసంతాగి పడుకోండి మేడమ్."

"ఓ యస్, మైడియర్ ఫ్రెండ్. కాని ఇపుడు నేను బాగానే వున్నాను."

సీత బలవంతంవల్ల అయిష్టంగానైనా టాబ్లెట్స్ మింగి రసం తాగి పడుకుంది సుజాత

వాకిట్లో చప్పుడయింది

రాజారావుగారూ, మరో వ్యక్తీ ఏదో మాట్లాడుకుంటూ వచ్చారు వెనుక గదిలో తలుపుచాటున ఒదిగి నిలబడింది సీత

"ఎలా వుంది సుజీ ! ఆ అమ్మా యేది, వెళ్ళిపోయిందా ?" – రాజారావు.

"సుజీ కేమయింది బాబాయ్ ?"

"జ్వరంవచ్చి ఎలా అయిందో చూడు."

"మరేం కంగారు లేదులే నాన్నా. స్లయిట్ ఫీవర్, రేపటికి తగ్గిపోదూ ?!" అని నవ్వింది సుజాత. నవ్వి "సీతా ! సీతా !" అంటూ పిల్చింది

బయటికి రాబోయిన సీత కాళ్ళు నిల్చిపోయేయి తననే చూస్తూ వుండి పోయిన దుర్గారావుని గమనించి తడబడింది

"మరల సీత ఇంటికి పోవాలని తొందరపడుతూ వుంది నాన్నా. మీరిద్దరూ కాళ్ళు కడుక్కుని కూర్చోండి" అంటూ తొందరపెట్టింది సుజాత.

వాళ్ళిద్దరూ కూర్చుంచే ప్రక్కనే ఊరికే తనూ కూర్చుంది సుజాత. సీత వడ్డించింది.

"ఇవాళ వంట బ్రహ్మాండంగా వుందమ్మాయ్ !" అన్నారు రాజారావు గారు. "అక్కడికి రోజూ బాగాలేదని కాదనుకో. ఈ పూట ఇంకా బాగా వుందని నా ఉద్దేశ్యం" అని నవ్వారు.

"స్టేట్మెంటుకి కరెక్షన్లక్కరలేదు నాన్నా. సీత వంట బాగా చేస్తుందని నేనూ వప్పుకుంటాను" అని నవ్వింది సుజాత.

"నేనూ చాలా రోజులకి మంచి భోజనం చేసాను'' అని మెచ్చుకోలుగా సీతవంక చూసాడు దుర్గారావు. సీత తలవంచుకొని సిగ్గుపడింది. ఇద్దరికీ వడ్డించింది. మనసులో ఏదో తృప్తి !

వాళ్ళ భోజనం అయాక అన్నీ సర్ది ఇవతలకి వచ్చింది సీత వాళ్ళు వాకిట్లో కూర్చుని మాట్లాడుకుంటున్నారు సీతని చూసి లేచి ఇవతలికి వచ్చింది సుజాత

"సీతా ! నువ్వూ భోంచేశావా ? నీ సంగతే మర్చిపోయాను సారీ !"

''లేదులే ఇంటికి వెళ్ళి చేస్తాను "

"నీ మొహం, ఎంతసేపు ! రా నే పెడతాను "

"థాంక్స్ ! నేను వెళ్ళాలి అవతల మా వాళ్ళందరూ నా కోసమే చూస్తుంటారు ప్లీజ్."

"సరె నీ ఇష్టం అన్నట్లు ఏంచేశావ్ ! దుర్గా...మాట ఇలా రా " అంటూ పిల్చింది సుజాత

దుర్గారావు లేచి వచ్చాడు రాజారావు గారు లోపలికి వెళ్ళిపోయారు.

"ఇక సీత వెళ్తానంటోంది అందు కని పిలిచాను. అన్నట్టు నేను ఒక విషయం మరచిపోయాను ఇప్పుడే వస్తా మాట్లాడుకుంటూ వుండండి" అంటూ లోపలికి వెళ్ళింది సుజాత.

చీకట్లో ఎదురు బొదురుగా నిలబడ్డారు ఇద్దరూ.

ఏదో మాట్లాడాలని ఇద్దరికి వుంది. కాని ఎవరూ ఏమీ మాట్లాడలేకపోతున్నారు గుండెల సంచలనం, మనసుల వూగిసలాట, ఆందోళన, ఆతురత

చివరికి దుర్గారావే నోరు పెగుల్చుకుని అన్నాడు

"సుజాత ఉత్తరం ఇచ్చిందా ?"

తల వూపింది సీత.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

మరల దుర్గారావే అన్నాడు.

"ఏమిటో సీతా ! ఒకొక్కరికీ ఒకొక్క బలహీనత ఉంటుందంటారు. నా బలహీనతని నేను జయించలేకపోతున్నాను. ఏం అనుకోకు ఏదో పిచ్చివాడయి అలా ఉత్తరం రాశాడనుకొని నన్ను క్షమించు "

సీత మాట్లాడలేదు.

"రేపు తెల్లవారుజామునే నేను వూరు వెళ్ళిపోతున్నాను మరల ఇక రానేమో! అన్నట్టు మా అమ్మ నా పెళ్ళి గురించి తొందరపెడ్తుంది ఆమెకి మాత్రం నేను తప్ప ఇంక ఎవరున్నారు ? ఆమె కోరిక తీర్చక తప్పదు కాని నేను ఆమెను సంతృప్తిపరచగలనా అని !" దుర్గారావు ఆగి సీతవంక చూసాడు

సీత తల వంచుకుంది.

"ఏమంటావు సీతా ?"

సీత ఏమీ అనలేకపోయింది. ఆమె కంటివెంట గిర్రున నీరు తిరిగింది.

దుర్గారావుకి గుండె భారంగా అయి నట్లనిపించింది.

"నిజమే! ఇదివరకు ఒకసారి నాలోని ఆశ చచ్చింది కాని చిత్రంగా ఆ ఆశ ఇన్నాళ్ళకి బ్రతికి మరల చిగురిస్తో నంటుంది అదొక మొండితనం నేను వచ్చేటప్పుడు పెద్ద ఆశనే వెంటబెట్టుకొని వచ్చాను ఆ ఆశ ఫలించి సంతోషం తోనే తిరిగి వెళ్తాననిపిస్తూవుంది, సీతా నాకు!"

సీత వులికిపడింది

ఆమెకి మాణిక్యరావు మాటలు గుర్తుకు వచ్చాయి!

ఆ వెంటనే తనవాళ్ళందరూ గుర్తు వచ్చేరు

తల్లి వట్టి పిచ్చిది. బోళామనిషి, మాట పెళుసు ఓపిక తక్కువ అమా యకురాలు

తండ్రీ మంచివాడే మొదటినుంచీ అయన పని అలాగయింది ఏ పనీ చెయ్యడు నిలకడలేదు బలహీనతలు కొల్లలు. కుటుంబాన్నిమాత్రం పెంచాడు

రాజుకి బాధ్యత తెలియదు. సర్దాల్ని మాత్రం చంపుకోడు ఆలోచనలేదు, ఆవేశంమాత్రం కావలసినంత అంతలో కోపం నిదానం, నిలకడ ఇంకా అలవడ లేదు. కుటుంబానికి అతడే ఆశా దీపం ఆ దీపం పుంజుకుని జ్వలించి వెలుగుల్ని పంచాలన్న ఆశ అందరికీ!!

లలిత ఇంకా మంచి చెడు తెల్సుకోదు. ఆలోచనలేని మనిషి ముందు ముందు వున్న జీవితాన్ని గురించి ఆలోచన లేదు అందుకే ఇంకా తడబడ్తూనే అడుగులు వేస్తూవుంది, బ్రతుకు బాటలో.

శశికి ఆలోచనవుంది. కాని వాడు అర్భకుడు పైగా అవిటివాడు.వయసుకు మించిన ఆలోచనలు వాడివి. ముందున్న బంగారు జీవితాన్ని గురించి కలలు కంటాడు

ఇప్పుడు ఈ అందరికీ తనే ఆధారం. వాళ్ళంతా తనవాళ్ళు! తనమీదనే ఆశలు నిల్పుకున్న తనవాళ్ళు! తనే కాదంటే వాళ్ళంతా ఏమయిపోతారు? ఈ కుటుం బము ఎటువంటి పరిస్థితుల్లో పడి పోతుంది?! ఇదీ తన అస్తిత్వం తను ఇందులోనే పుట్టింది ఇందులోనే పెరి గింది. ఆశలు పెంచుకుంది. చీకటే అని పించినా ఆ చీకట్లోనే తడుముకుంటూ వెలుగుకోసం వెతుక్కుంటుంది

ఒకవేళ ఎవరయినా నిన్ను పెళ్ళి చేసుకోవటానికి సిద్ధపడినా అది నీ సంపా దనకోసమే గాని అభిమానంతో మాత్రం కాదనేది పచ్చినిజం అటువంటప్పుడు అతడు మీ నాన్న సంసార బాధ్యతని నెత్తిన వేసుకుంటాడా అన్నది అనుమానా స్పదమే ఒకవేళ ఆ పూవులో మొదట అందుకు సిద్ధపడినా ఆ తర్వాత అతడు మాట చెల్లించుకుంటాడన్న నమ్మకం ఏమిటి? ఇవన్నీ ఆలోచించి ఎంతో

ఆందోళన చెందాడు మీ నాన్న"... అన్న మానిక్యరావు మాటలు చెవుల్లో గింగురులెత్తి మోగినట్లనిపించింది

దుర్గారావు మంచివాడు మనసున్న వాడు ''తన'' చెయ్యి అందుకోవటం కోసం తనే అన్నిటికీ సంసిద్ధతని వెలి బుచ్చాడు కాని అతడు యువకుడు ఆవేశం వున్నవాడు పైగా ఒంటరీ కాడు అతని వెనుక అతని తల్లి వుంది బంధువులున్నారు. వాళ్లయినా వూరుకో వాలని లేదు - కనుకనే తను కాదంది. అయినా తను వదల్దు! ఆలోచించిన కొలదీ అయోమయ మన్పిస్తుంది

తనూ ఒంటరికాదు తనతోనే తన వాళ్ళుంటారు తన గురించి ఆ బాధ్యతని భుజాల కెత్తుకోవటానికి అతను సంసిద్ధుడే అయినా లోకం హర్షించదు హీన మయిన పరిస్థితిని ఎదుర్కోవాలి, తనూ, 'వాళ్ళు!'

సీత తల గిర్రున తిరిగింది

మనసు లాగుతుందిగాని ఆ మనసుని చంపటానికి అభిమానం చురకత్తులతో సిద్ధమవుతుంది - నరికి పోగులు పెడతా నంటుంది! కన్నె మనసుని - అంద మయిన ''అవతలి ఒడ్డు'' ఆకర్షి స్తుంది —

కాని ఎగిరిపడే కెరటాలు నావని ముందుకి కదలనీవు!

వీపుమీద కొరడాదెబ్బ తగిలినట్లు చలించింది సీత

''ఇంకా అవలేదా మీ సంభాషణ! ఇంతకీ ఏమిటి తేల్చారిద్దరూ!" అంటూ సుజాత వచ్చింది

ఎవరూ మాట్లాడ్లేదు. బొమ్మల్లాగ నిలబడిపోయారు

''నాన్నగారు పడుకోబోతున్నారు పెందరాళే పడుకోవటం ఆయన అల వాటు పడుకోబోయేముందు ఆయన చేత నేను ఒక 'టాబ్లెట్' మింగిం చాలి. అందుకే వెళ్ళాను సారీ" అంది సుజాతే

''ఫర్లేదులే" అన్నాడు దుర్గారావు నవ్వి.

''మరి వెళ్ళొస్తాను సుజీ! రేపు కలుద్దాం" అంటూ వెనుదిరిగి నాలుగడు గులు వేసింది సీత.

దుర్గారావు అప్రతిభుడై నిలబడి పోయేడు

కాస్త దూరం వెళ్ళి ఆగింది సీత వెనుకనే సుజాత అనుసరించి వస్తోంది. వెనుదిరిగి చూసింది సీత

దుర్గారావు అక్కడ్నే నిలబడి శిలాప్రతిమలా చూస్తూ వున్నాడు. అతనిలో చలనం వున్నట్లు లేదు

గబగబా వెనక్కి తిరిగి అతని దగ్గరికి వచ్చింది సీత

''నన్ను క్షమించండి నేను దుర దృష్టవంతురాలివి!" అతన్తో అని

వెనక్కి తిరిగి వెళ్ళి సుజాతని కలుసుకుంది

సుజాత ఏమిటో చెప్తూ వుంది

అవేమీ సీత మనసుకి ఆనలేదు.

సుజాతకి 'గుడ్‌నైట్' చెప్పి ఇంటిదారి పట్టింది. సుజాతని అప్పుడుగుదామనుకుని ఆ మాటే మరిచింది సీత ! ఇల్లు చేరేసరికి ఇంట్లో సందడిగా వుంది.

శశిధర్ ఎదురువచ్చి చెయ్యిపట్టుకుని ఆప్యాయంగా అన్నాడు, "అక్కా నీ పెళ్ళిట, నాకు చెప్పలేదేం ?"

వాకిట్లోనే రాఘవయ్యగారు చుట్ట తాగుతూ కొలువుతీరి వున్నాడు రాజు, లలిత, సుబ్బమ్మగారు ఆయన కెదురుగా కూర్చుని వున్నారు

సీతని చూచి "ఎక్కడి కెళ్ళేవే ఇప్పటిదాకా?" అంటూ నిలదీసి సూటిగా అడిగింది సుబ్బమ్మ.

"సుజాతకి జ్వరం వచ్చిందమ్మా. తనగురించే ఆలస్యమయింది"

'ఇటువంటివి సహించటానికి లేదు" అని సకిలించాడు రాఘవయ్య.

'ఒక బాధ్యత అంటూ వుండాలి పరిస్థితుల్ని గమనించాలి" అని మరల సుభాషితం పలికేడు అయన

'కూర్చో సీతా !" రాజు ఆదరం చూపించబోయేడు.

"అక్కా" అంటూ పలకరించి లలిత ఏదో చెప్పబోయింది

"సీతా ! నేను ఒకమాట చెప్తాను విను మన కుటుంబ క్షేమంకోరి నే నివాళ ఒక విషయం 'సెటిల్' చేసేను అది అందరికీ మంచిదనిపించి అలాగ చేసేను అంతా నిర్ణయమైపోయింది. వచ్చే నెలలోనే మాణిక్యరావుతో నీ పెళ్లి" అని చెప్పి మౌనం వహించేడు రాఘవయ్య

సీత కనులవెంట గిర్రున నీరు తిరిగింది

"ఇదీ అదృష్టమే అనుకో మనమా కట్నాలు పొయ్యలేము మన పరిస్థితి ఎలాగుంది మరి!ఏదో సరిపెట్టుకుపోవాలి. అయినా అతనికేం తక్కువ ?..." సుబ్బమ్మ ఆగింది.

ఆగి "సీతా ! ఇంతకీ నువ్వేమంటావే?" అని రొక్కించింది

సీత తలవంచుకుని కన్నీరు తుడుచుకుంది

"ఏమిటే ఆ పొగరు ? మాట్లాడవేం ! అవునో, కాదో ఏదో ఒకటి చెప్పి ఏడవచ్చుగా ?"

"నేను అనేదేముందమ్మా, మీ ఇష్టం" అంది సీత నోరు పెగల్చుకొని

"పిచ్చిమోడు ! అదేం ఎదురు చెప్పదని నేను చెప్పటంలా ?" అంటూ రాఘవయ్యవంక చూసింది సుబ్బమ్మ గర్వంగా చూసి వెంటనే "సర్లే పద పద, ఇప్పటికే ఆలస్యమయింది. ఆ వంట ప్రయత్న

మేదో చెయ్యాలిగద!" అంటూ తరి మింది సుబ్బమ్మ

తతబడే అడుగుల్తో లోపలికి నడిచింది సీత ఇల్లంతా చీకటిగా ఉంది అంతమింది చేసినా ఎవరికీ ప్రొద్దుగూకాక ఇంట్లో దీపం వెలిగించాలన్న ధ్యాస లేకపోయింది

దీపాలు వెలిగించి కాలు చేతులు కడుక్కొని వచ్చింది సీత మొహం తుడుచుకుని అలాగే గుమ్మానానుకుని నిలబడిపోయింది. అనాలోచితంగ అలాగ నల్లటి కారుచీకటిలోకే చూస్తూ వుండిపోయింది, కొన్ని నిమిషాలు

అంతలోనే-దుర్గారావు,గుర్తువచ్చాడు మరుక్షణమే మాణిక్యరావు ముది రూపూ తలపుకొచ్చింది మనసు మెలిదిరిగినట్లయి గుండెలు బాధతో విల విలలాడేయి. ప్రయత్నించి ఆ బాధని నిగ్రహించుకుని కాసేపటికి మనసుని దిటవు పరచుకుంది సీత

కాని, కళ్ళనుంచి జారిన బాష్ప ధారలు గుండెలమీద వెచ్చగా పడినాయి గుండెలు తడిసిపోయేయి

"సీతా!" లోపలికి వస్తూ సుబ్బమ్మ ఓ గావుకేక పెట్టింది

ఉలికిపడి, ఆ వెంటనే సర్దుకుని గబ గబ వంటపనిలో చొరబడింది సీత



బయట - 'వాళ్లు' గలగలా పెళ్ళి కబుర్లు చెప్పుకుంటున్నారు

# ఉత్తరకుమారి

శీల జగన్నాధరావు



బ్యాంక్ ఏజెంటు రావుగారి ఏకైక తనయ కుమారికి బియ్యే పాసయిన దగ్గరనుంచి బొత్తిగా కాలం ముందుకు జరగకుండా వుంది ఎమ్మే చదవమన్నాడు తండ్రి "వుహూ! ఇంత చదవాలనిపించటంలేదు డాడీ" అంది కుమారి.

"కుట్లూ, అల్లికలూ నేర్చుకోమ్మా" అంది తల్లి

"నో నో! నా కలాంటివి చిరాకు!" అంది కుమారి

"డబ్బులుపారేస్తే టైలరు కుట్టేస్తాడు దానికి కష్టపడి ఎందుకు నేర్చుకోడం?" అంది విసుగ్గా

"పోనీ సంగీతం నేర్చుకోరాదుటే?" అని అనలేదు తల్లి, దండ్రి!

కుమారి గొంతులో కోయిలలు కూయవని, వీణలు మ్రోగవని, వేణువులు రవళించవని వాళ్ళకి తెలుసు!

ఇంక...వంట పూసు ఎత్తడానికే భయపడ్డారు

కుమారికి వంట గిన్నెలు చూస్తేనే చిరాకు! కడుపులోకి అన్నం వెళ్ళటం వరకే తప్ప కంచంలోనికి అన్నం ఎలా వచ్చిందన్నది ఆలోచించటానికే విసుక్కునే కుమారి, రేపు భర్తకి ఎట్లా వండిపెడుతుందని ఆ తల్లి, తండ్రి తల్చుకు వాపోయేవాళ్ళు

"ఏమిటి మీ పిచ్చి?'' అని దబాయించింది కుమారి వాళ్ళని

''అఫ్టరాల్ వంటకే అంత వర్రీ ఏమిటి మమ్మీ? వెధవది! ఓ కుక్కని పెట్టేసుకుంటే పోయేదానికి..."

"కుక్క కుక్కలా వుంటే పరవాలేదు, తల్లీ! వాడు వండిల్లిపాలిటి పంది కొక్కు అయిపోతేనే చెడ్డ కష్టం!" అని విచారించింది, కుమారి తల్లి.

"ఆc... మీకంతా పిచ్చిభయాలు ఎంత తింటాడు?''

ఈ 'కలికాలం కంట్రీగాళ్'తో వాదించలేక నోర్మూసుకున్నారు వాళ్ళు

పన్లు చెయ్యడానికి చిరాకుపడేకుమారి బొత్తిగా ఏ పనీ లేదంటూ వూ తెగ వర్రీ అయిపోసాగింది మారేజ్ చేసేస్తామన్నారు మమ్మీ, డాడీ

"ఛ ఛ! ఇప్పట్నుంచీ మారేజ్ చేసోక్కను పెళ్ళి, కాపురం, పిల్లలూ, న్యూసెన్స్! క్షొన్నాళ్ళు పోనీ..." అని ఆర్డరు వేసేసింది కుమారి

కుమారి ''అబ్బబ్బ బొత్తిగా టైం పాసవటంలేదే!" అంటూ స్నేహితురాలు శైలజ దగ్గర రొద పెడితే, శైలజ ఆలోచించి" పోనీ బుక్సు చదూకోవే ఇన్ని పత్రికలొస్తున్నాయి! నువ్వు చదవ్వేమిటవి?" అంది.

"ఎందుకు చదవనూ? కానీ—అన్నీ చదవను—ఏవో అప్పుడూ అప్పుడూ ఓ కథా అదీ—"

''అప్పుడంటే చదువులో పడి కథలు చదవటానికి తీరుబడీ, శ్రద్ధా లేదనుకో ఇప్పుడు కావల్సినంత ఖాళీగదా?! హాయిగా చదువుకోవచ్చు ఇంకా కావలిస్తే విమర్శలు రాయి, వూసుపోతుంది

అని సలహా యిచ్చింది శైలజ

"అవును సుమా!" అనుకుంది కుమారి ఆశ్చర్యంతో, సంతోషంతో. వెంటనే వార, మాస పత్రికలన్నింటికీ చందాలు కట్టేసింది. మేడమీద, తన గదిలో ఫోమ్‌బెడ్ మీద బోర్లగిలా పడుకొని పత్రికల్ని పఠించింది ఆ తర్వాత తమ నౌకర్ని పోస్టాఫీసుకి పంపించి, కవర్లు, స్టాంపులు తెప్పించుకుంది

"సంపాదకులకు!"

మీ...మా. మాసపత్రికలో ఈ నెల కథలన్నీ ఒకదానితో ఒకటి పోటీపడినట్టున్నవి. రావ్‌గారి 'రాంభజన' మరీ మరీ చదవాలనిపించేట్టు వుంది రావ్ గారికి మీ పత్రికా ముఖంగా నా అభినందనలు అందజేస్తున్నాను...

(కుమారి, విశాఖపట్టణం)

మరో ఉత్తరం,

"ఎడిటర్ గారికి!"

ఈ వారం మీ సంపాదకీయము ఈ వీక్లీకే ఆణిముత్యము! నిజముగా జరుగుతున్నది జరుగుతున్నట్టుగా వ్రాశారు

ఇకపోతే—సీరియల్ 'జలపాతం' లో పాత్రలు అన్నియు అత్యంత సహజముగా వున్నవి. ప్రతివారము మేమంతా 'జలపాతము'లో తడిసి, వుక్కిరి బిక్కిరి అయిపోతున్నాము.

సినిమా పేజీలు బొత్తిగా ఎనిమిదే వేస్తున్నారు. రెట్టింపు చేయండి

(కుమారి, విశాఖపట్టణం)

ఇంకో లేఖ,

"చంద్రలేఖ'' ఈ మధ్య అమితముగా బాగుంటున్నది! అందుకు కారణము మీరు ''చంద్రలేఖ''ని తగినంత శ్రద్ధ తీసుకుని, అందముగా ఆకాశములో చుక్కలలో చంద్రునిలా అలరారేలా తయారుచేయటమే!

శీర్షికలన్నియూ బావున్నవి క్రిందటి సంచికలో, మధ్యపేజీలలో వేసిన 'గేలమ్' చిత్రం సెక్సీగా ఉన్నది ప్రముఖ హాస్యనటులు 'పాత్రం' గారితో ఇంటర్వ్యూ కడు ఆనక్తిదాయకముగా ఉన్నది

చంద్రలేఖ ఇంత బాగున్నది కనుక మీరు వెల ఇంకా పెంచినా మాకు బాధ లేదు...నా అభిమాన నటుడు 'బాబుల్' ముఖచిత్రం ఎప్పుడు వేయుదురు?

(కుమారి, విశాఖపట్టణం)

"కుమారీ!''

తల్లి పిలిచింది

"రాసుకుంటున్నానమ్మా రాసుకుంటున్నప్పుడు నన్ను పిలవకు!"

"ఏం రాతలే? కథ వ్రాస్తున్నావేమిటేవ్??''

కుమారి మాట్లాడలేదు కూతురికి మౌనభంగంచేసి, చీవాట్లు తిననిష్టంలేక ఆవిడ వెళ్ళిపోయింది

ఓ సాయంత్రం కుమారి మూడు పత్రికలు తెచ్చి తల్లికిచ్చింది చూడమని ఆవిడ ఆత్రంగా పేజీలు తిరగేసింది. కథల దగ్గర ఎవరెవరివో పేర్లున్నాయి గాని, కుమారి పేరు లేదు "ఏదే నీ కథ?'' అడిగిందావిడ!

కుమారి కాస్త ఫీలయి, నింపాదిగా ఉత్తరాల పేజీలు చూపించింది. ఆవిడ కళ్ళద్దాలు సర్దుకుని,జాగ్రత్తగాచూసింది.

"బావుందే నీ పేరు అచ్చులో..."

''నీకంతా వేళాకోళం'' అని కుమారి పుస్తకాల్లాక్కుంది

"అయ్యో! ఇప్పుడు నే నేమన్నానని కోపం? బావులేదూ, నీ పేరు, అచ్చులో ఎవళ్ళనయినా అనమను బావులేదని?" (బావులేదన్న వాళ్ళ నా క్షణంలో చెప్పుచ్చుకొడతానన్నట్లు చూసిందావిడ)

"చక్కగా శుభలేఖల్లో వేసినట్టు వుంది..." అని "ఇదిగో పాపా! అ బియ్యే కూడా పడేసుకోలేకపోయేవూ పక్కన?" అంది



"అవును సుమా!" అనుకుని,

"అయ్యో!" అని విచారించింది కుమారి "తనకింతవరకు తన పేరేగాని డిగ్రీ గుర్తు రాలేదేమిటి?" అని బాధ పడింది

"భోజనానికి పదమ్మా" అన్న తల్లితో,

"ఉండు నా పేరు పక్కన బియ్యే పడేసి వస్తాను..." అంది కుమారి

* * *

"బందీ చక్రం" సీరియల్ కడు రమ్యముగా సాగిపోతున్నది ఈ వారం మరీ సస్పెన్సులో మమ్మల్ని పడవేసి నారు జలజ సోపూ, టవల్స్ పట్టుకుని బాత్‌రూంలోకి ప్రవేశించినది నైట్‌గౌన్ విప్పేసి, షవర్ ఆన్‌చేసినది సోపు తీసుకొని, ఇలా ఒకసారి గుండెలకి సోపు రాచుకుని, ఆ క్షణాల్లోనే తన డియర్ కల్యాణ్ జ్ఞప్తికి వచ్చి, సోపుని కల్యాణ్‌గా భావించి గుండెలకి గట్టిగా హత్తుకోబోగా, సోపు జారిపడిపోయినది! అంతే! జలజ ఇహలోకమునకు వచ్చి, కంగారుతో వెతికినది...వెతుకుతూంది సశేషం—అని అక్కడికి ఉంచేశారు

అబ్బ! అంత మంచి సస్పెన్సులో అలా వదిలేయడము బాగోలేదండీ! ఏమైంది సోపు? దొరికిందా? జలజ స్నానం చేసిందా?

ఏమయినా బాత్‌రూమ్ వర్ణనా, కల్యాణిని సోపుతో సరిపోల్చి చూపిన విధమూ చాలా బావున్నది గీతాదేవిగారి రచనాశైలి, సరస సంభాషణలు మమ్మల్ను పరవసింపజేసి ఏవో లోకాలలో విహరింపజేస్తున్నవి! వచ్చే వీక్లీకోసం ఎదురుచూస్తున్నాం

(కుమారి, బియ్యే-విశాఖపట్టణం)

* * *

రావుశ్రీ కుతూహలంగా పత్రికలో ఉత్తరాల పేజీ తీశాడు

"ఈ వారం రావుశ్రీ గారి 'మధుర ఘడియలు' మంచివేగము పుంజుకున్నది. సుస్మితకు ఆ మధుర ఘడియలు త్వరలోనే వస్తాయని తలంచుచున్నాను మధుర మంజుల మనోజ్ఞముగా సాగి పోతూన్న ఈ నవలా రచయితగారికి నా అభినందనలు అందజేయండి!

(కుమారి, బియ్యేవి–శాఖపట్టణం)

'ఎవరీ కుమారి?' తలెత్తి ఆలోచన లలో పడిపోయాడు రావుశ్రీ

తన నవల శ్రద్ధగా చదువుతూ, ప్రతీ వారం వుత్తరం రాస్తుంది! తన నవలే కాదు, తను చూసే ప్రతి పత్రిక లోనూ ఈ కుమారి ఉత్తరాలుంటుం టాయి!! ఇన్ని పుస్తకాలెంతో ఓపిగ్గా చదువుతూ అన్ని పుస్తకాలకి ఉత్తరాలు వ్రాసే ఆమె ఆసక్తికి, శ్రద్ధకి తను మెచ్చుకోకుండా ఉండలేకపోతున్నాడు ఈ విశాఖపట్నంలోనే ఉంటుందిట!! ఎక్కడ చెప్మా ?!

కుమారిని కలుసుకోవాలనుకొన్నాడు రావుశ్రీ ఆమెతో సాహిత్యం గురించి మాట్లాడాలని, ఆమె అభిరుచులు వివ రంగా తెలుసుకోవాలని అతని మనసు తహతహలాడింది పేరు బావుంది మనిషి రూపం ఎలా వుంటుందో ?!

రావుశ్రీ పెన్నుతీసుకుని తన సీరి యల్ పడుతూన్న పత్రికకి ఇలా రాశాడు వుత్తరం, ఉత్తరాల శీర్షికకి

"కుమారి బియ్యే విశాఖపట్టణం— గారికి,

మీరు నా నవలపట్ల వెలిబుచ్చి అభిప్రాయాలకి నా కృతజ్ఞతలు దయ చేసి మీ చిరునామా వివరంగా ఇవ్వండి మీతో ముఖాముఖి మాట్లాడవలె ననుకు టున్నాను నేను విశాఖపట్టణంలోనే వుంటున్నాను..." అంటూ తన అడ్రస్ కూడా రాశాడు

కుమారి, ఈ ఉత్తరానికి జవాబేమని రాస్తుందో? అనుకున్నాడు, నవ్వుకుని

రావుశ్రీ ఉత్తరాన్ని కుమారి, శైలజకి చూపించింది

"ఎంతదృష్టం! రచయితే రాశాడే నీకు! రాయి, వెంటనే" అంది శైలజ విచ్చుకున్న ముఖంతో.

"ఏమనే? ఏం రాయనూ?"

"నీ మొహం! అలా తెల్లమొహం వేస్తావేం? నీ అడ్రసిచ్చి రమ్మని రాయి 'మీ రాకకోసం ఎదురుచూస్తున్నాను, వేయి కళ్ళతో' అని రాయి!"

"నాకేం వేయి కళ్ళు లేవు!"

"పోనీ ఆ రెండు కళ్ళతోనే!—" నవ్వింది శైలజ గలగలా

కుమారి ఇబ్బందిగా చూసించి "వస్తే ఏం మాట్లాడనే అతన్తో?"

"అదేమిటే? ఉత్తరాలంత చక్కగా రాస్తావు! మాటలాడలేవూ?" శైలజ విస్తుపోయింది



"ఏమో నాకు మాటలాడటం రాదు। అందులో అతను...మగవాడితో। శైలా ప్లీజ్। నువ్వు నా పక్కన ఉండవే, ఆ సమయంలో। నా సంగతి నీకు తెలుసుగా? అవతలివాళ్ళేమాత్రం జోరుగా మాట్లాడినా, నా నోరు దురుసుగా వచ్చేస్తుంది "

"వూఁ...సరే। అలాగే।"

రావుశ్రీ కుమారి అడ్రస్ పట్టుకుని వచ్చాడు మేడమీంచి చూస్తున్న కుమారి, శైలజ ఒకర్నొకరు చూసుకున్నారు

"అదిగో మనింటికే వచ్చాడే, ఆయనెవరో చూడు। రావుశ్రీ అయి వుంటాడు।"

ఇద్దరూ గబగబా ఎదురువెళ్ళి ఆహ్వానించారు లోపలికి

'నమస్తేలు' అనంతరం రావుశ్రీ కుమారివాళ్ళలో ఎవరయి ఉంటుందో

తేల్చుకోలేక ఇబ్బందిగా చూస్తుంటే, శైలజ కుమారి ఈమేనండీ! మీ ఉత్తరాల కుమారి! "నా పేరు శైలజ. కుమారి స్నేహితురాలిని" అంది గబగబా

పత్రికల్లో కథలమీద, నవలల మీద కుమారి రాస్తున్న ఉత్తరాల గురించి ప్రస్తావిస్తూ, ఆమె ఓపికకి, అభిరుచికి తను చాలా మెచ్చుకుంటున్నానని చెప్పాడు రావుశ్రీ తన నవల గురించి కుమారి ఏమైనా చెబుతుందేమోనని చూశాడు నిశ్శబ్దం కాసేపు రాజ్యం చేసింది. వాళ్ళ మధ్యన కుమారి శైల ఆనీ నేలనీ చూస్తుందేగాని, రావుశ్రీని చూడలేదు, నోరు విప్పలేదు శైలజకి వొళ్ళు మండింది ఈ నేలా తనూ ఎప్పుడూ చూసేవేగా? ఏమిటి దీని తత్వం? నోరు విప్పదేం? ఆయ నేమనుకుంటాడు?! ఫ్చ!

రావుశ్రీ అనుకొనే అనుకున్నాడు హతాశుడయ్యాడు. కుమారి ఎంత చక్కగా మాట్లాడుతుందో రచనల గురించి, తన రచనల గురించి అను కుంటే... ఇదేమిటి?! ఇలా? మూగ బోయింది!!

"మీరేం మాట్లాడటంలేదు" అన్నాడు నవ్వుతూ

కుమారి అప్పటికి నోరు విప్పింది "క్షమించండి! ఏదో వుత్తరాలు రాయ డమే గాని— నాకు సాహిత్యం అంటే పెద్దగా యేం తెలియదండీ! నేనేం లోతుగా చదవను. అంటే విమ ర్శనా పూర్వకంగా "

రావుశ్రీ తన కలవరపాటుని అణచు కొని "ఓహ్! దాన్దేముందిలెండి' చదువు తూంటే విమర్శ అదే పుడుతుంది మీరు అసలేం చదివారు?" అడిగాడు కొన్ని పుస్తకాలపేర్లు చెప్పి

"వుఁహుఁ! మీరడిగే పుస్తకాలు ఏం చదవలేదండీ!" అంది కుమారి

'ఓహ్!' అనుకున్నాడు రావుశ్రీ బాధగా ఫీలయి

తన నవలల గురించి ఇఁక ఆమెని అభిప్రాయాలడగడం దండగ, అను కుని నిట్టూర్చాడు. కుమారితో వెళ్ళి వస్తా నని చెప్పి లేద్దామనుకున్నాడు కాని కుమారి విగ్రహాన్ని చూస్తూంటే అక్కడి నించి వెళ్ళిపోడానికి మనస్కరించడం లేదు. ఏదో మాట్లాడాలి! మాట్లాడకుండా కూర్చుంటే బాగుండదు! కూర్చోడమే తనకి బాగుందాయె! రావుశ్రీ కదల్లేదు

"పోనీండి! సాహిత్యం వదిలేద్దాం! ఇంకేమైనా చెప్పండి? మీరు బియ్యే చది వారా?"

"అవునండీ!"

"తర్వాత పైకి చదవకపోయారా?"

"ఏంటో! ఇంట్రెస్టు లేదు" చేతి గోళ్ళు చూసుకుంది కుమారి

"మారేజి ప్రపోజల్‌లో వున్నట్టు న్నారు" అని కొద్దిగా నవ్వాడు రావుశ్రీ



కుమారి విసుగ్గా కనుబొమలు ముడి చింది "ఆలా అని మీకేం తెలుసు?" అంది గభాల్న. రావుశ్రీ మొహం వివర్ణ మైంది. శైలజ 'అయ్యయ్యో! ఈ మని షికి మృదువుగా మాట్లాడ్డం ఎప్పుడు వస్తుందో? అయనేమనుకున్నాడో!' అను కుంది బాధగా.

"క్షమించండి! నేను హద్దుమీరి మాట్లాడలేదు గద?" అన్నాడు రావుశ్రీ

శైలజ ఏదో చెబుదామనుకుంటూండే కుమారి "నా మారేజ్ విషయం మా మమ్మీకి, డాడీకే మాట్లాడ్డానికి పిలివ్వను! పైవాళ్ళకి ఎలా వుంటుంది ఆ అధి కారం?" అంది

రావుశ్రీ మంచినీళ్ళు మింగినట్టు ఏదో మింగాడు

"అవును! నిజమే! అది మీ వ్యక్తిగత విషయం" అన్నాడు, ఏదో అనకపోతే బావుండదన్నట్టు. మళ్ళా నిశ్శబ్దం ఏలింది వాళ్ళ మధ్యన. కుమారి, శైలజను చూస్తూ "అదేంటో! వెధవ పెళ్ళంటే నాకు చిరాకు, బాబూ! వెధవ పిల్లలూ, సంతా!." అంది చిరాగ్గా నవ్వి.

రావుశ్రీ 'వెధవ మొగుడు. అని అన లేదేం?' అనుకుని లేచిపోయాడు

"వెళతానండీ!"

శైలజ చేతులు జోడించింది కుమారి చేతులు ఎత్తలేదు. అతను వెళ్ళిపోతానని అనడమే చాలన్నట్టుగా గబగబా ఇంట్లోకి వెళ్ళిపోయింది. రావుశ్రీ నిట్టూర్చి శైలజకి చెప్పి, బైటకి నడిచాడు, గబగబా ఆ తర్వాత రావుశ్రీ 'ఉత్తరాల పేజీల్లో' చూడలేదెప్పుడూ




అప్పుడు—

పది సంవత్సరాలకు ముందు- నేను కొత్తగా టీచరుగా అపాయింటయి స్కూల్లో చేరిన రోజులు కొత్త కాబట్టి, కాలేజీనుండి, ఆశయాలనుండి అపుడే బయటపడ్డవాడ్ని కాబట్టి నా ఆలోచనలు వేరుగా ఉండేవి।

విద్యార్థులు చెడిపోవడానికి అతి ముఖ్యమైన కారణం ఉపాధ్యాయులేనని నా గట్టి నమ్మకం। వాళ్ళని సరైన త్రోవలో, ఉంచడంలో గురుతరమైన బాధ్యత "మాదీ" అని ఇంకో నమ్మకం।

అయితే—

విద్యార్థుల మీది తెగబడి పేము బెత్తాలతో...పిడి గుద్దులతో, తీవ్రమైన శిక్షల ద్వారా వాళ్ళని సరిచేయాలన్న కొంత మంది ఉపాధ్యాయులకూ నాకూ బద్ధ వైరం। శిక్ష కేవలం శారీరకమైనది. నువు కొట్టిన దెబ్బల తాలూకు బాధ

తగ్గిన మరుక్షణం తిరిగి సమస్య మొద టికే వస్తుందని నా గట్టి నమ్మకం।

నా ఆలోచనలు తెలిసిన కొందరు సీనియర్ టీచర్లు నన్ను ఎగతాళి పట్టించే వాళ్ళు। మరీ నా వయసు వాళ్ళయితే "మానసిక తత్త్వవేత్త" అనీ "బుద్ధ దనీ" పరిహాసం చేసేవాళ్ళు। అయినా నా నమ్మకం నాది।

ఓరోజు—

పదవతరగతిలో సైన్సుపాఠం చెబుతున్నాను ఒకటికి పదిసార్లు చెప్పి బొమ్మలు గీయించి, నాకున్న ప్రావీణ్యాన్నంతా చూపి, నాకున్న జ్ఞానాన్ని వాళ్ళకు పంచాలనే పట్టుదలతో ఉన్నాను। ముఖ్యంగా వెనక బెంచీలో మొహంమీదికి పడే పొడవైన జుత్తుతో ఎవర్నీ లెక్కచేయని చూపుతో... టీచర్లందర్నీ ఆటలు పట్టించే రామారావు అనే పిల్లవాడికి పాఠం ఎక్కించాలని నా ప్రయత్నం।

అపుడే జరిగిందో గమ్మత్తు!

"బొమ్మలేశావా ?" అడిగాను నేను

"లేదు।"

"కూచోనే సమాధానం చెబుతావేం ? లే... నిలబడు।"

"నిలబడను।"

నేను నిర్వేరపాటును కప్పిపుచ్చుకని "బొమ్మ వేయాలి— రోజూ చెబుతున్నాను।"

"నా ఇష్టం— నేను వేయను। ఏం చేస్తావో చేసుకో।" అనే 'ఛాలెంజీ' కనిపించింది వాడి చూపులో— సమాధానంలో। లోపలనుండి లావాలా కోపం ఉబుకుతున్నా బయటపడనీయకుండా చాలా సౌమ్యంగా చెప్పాను

"చూడు రామారావ్। నువు స్కూలుకు వచ్చింది చదువుకోవడానికి। చదువుకుంటే నువ్వు ప్రయోజకుడివి అవుతావని మీ తల్లిదండ్రులు నిన్నిక్కడికి పంపించారు. వాళ్ళ ఆశలు సఫలం చేయడం నీ ధర్మం। చదువుకుంటే నీకే హాయిగా గడిచిపోతుంది"

నేను పాఠం ఆపి చాలాసేపు హితబోధ చేశాను।

అంతా విని కూర్చునే నావేపు వాడో నిర్లక్ష్యమైన చూపు విసిరాడు। వాడి ప్రక్కనున్న వాళ్ళు నెమ్మదిగా నవ్వుతున్నారు.

"నాకంతా తెలుసు! మీకనవసరం!"

వాడి మాటలతో నా వళ్ళు మండిపోయింది। అప్పటిదాకా నిలుపుకుంటున్న నిగ్రహం సన్నగిల్లుతోంది అప్రయత్నంగా నా కుడిచేయి వాడి ఎడమ చెవిని పట్టుకుంది వాడు ఛటుక్కున తలెత్తి నావేపు చూశాడు।

"నీకు మర్యాదగా చెబుతున్నాను చక్కగా పాఠం విని, సరిగా చదివితే నీకే మంచిది నువు—"

"ముందు నా చెవి వదలండి।"

"—వినాలి! లేకపోతే నేనూరు కోను, అర్థమైందా?"

"ముందు చెవి వదలండి? మీరు మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకోండి!"

విసురుగా వాడి సమాధానం విని నేను చేయి వదిలేశాను! వాడికేసి పరీక్షగా చూశాను ఆవేశంతో సతమతమయాను వాన్ని కొట్టడం నాకో లెక్కలోనిది కాదు అయినా నిగ్రహించుకుని ఊరుకున్నాను!

"నువు క్లాసులో ఉండడానికి వీల్లేదు!"

"సంతోషం! ఎవడూ 'సీ' పాఠం వినబోవడంలేదు!"

వాడు పుస్తకం అందుకుని విసురుగా బయటకు వెళ్ళిపోయాడు

ఈనాడు—

స్టేషను చాలా కోలాహలంగా ఉంది! ట్రెయినుకు బెల్లయింది! అందరూ నందడిగా ప్లాట్‌ఫారంమీద హడావుడి పడుతున్నారు! వరంగల్ పోదామని స్టేషనుకు వచ్చాను నేను స్టేషన్లో నియాన్ లైట్లు ప్రకాశిస్తున్నాయి అది భోజన సమయం! రైల్వే కాంటీను వాళ్ళు వరసలుగా భోజనం పళ్ళాలు నేర్పుగా ప్లాట్‌ఫారంమీద పేరుస్తున్నారు కొందరు సప్లయర్లు రకరకాల సామగ్రిని హోటలునుండి ప్లాట్‌ఫారం మీదకి జేరుస్తున్నారు!

ఇంకా బండి రాలేదు!

అపుడు చూశాను, రామారావును ప్రత్యేకించి పరిశీలనగా చూస్తేనే గానీ గుర్తుపట్టలేకపోయాను! రెండు చేతుల్లో కలిపి పది భోజనం పళ్ళాలను లాఘవంగా తెచ్చి బేబలుమీద పెట్టి—ఎవరో తరుముతూన్నట్లు హోటల్లోకి అదృశ్యమైపోయాడు!

ఆ ఒక్క నిముషంలోనే మనిషి రూపాన్ని పరికించి చూశాను మొహం మీద వెంట్రుకలింకా అలాగే పడుతున్నాయి బాగా చిక్కిపోయాడు మొహం పాలిపోయింది తినడానికి సరయిన తిండి కరువైందని చూడగానే గ్రహించెయ్యవచ్చు!

బండి వచ్చింది—

అందరితోపాటు రామారావు భోజనం పళ్ళాలను కావలసిన ప్రయాణీకులకు అందిస్తున్నాడు పరుగెత్తిపోయి మంచి నీళ్ళందిస్తున్నాడు! నాకు కదలబుద్ధి గాక అట్లాగే చూస్తూ నుంచున్నాను అపుడే ఫస్టుక్లాసు కంపార్టుమెంటులో నుండి ప్రయాణీకుడు రామారావును తిట్టడం చూశాను

"మనిషివికాదా, ఇడియట్—బిపిల్ కంప్లెయింట్— పిలవరా మీ కంట్రాక్టర్ని—!"

రామారావు అతనిమీద నీళ్ళు ఒలికినందుకు, కూరలో ఉప్పు ఎక్కువయినందుకు, అతి వినయంగా క్షమార్పణ జెప్పుకుంటున్నాడు దాదాపు కాళ్లు పట్టుకుని బ్రతిమిలాడినంత పనిజేస్తున్నాడు

ఫస్టుక్లాసు పాసింజరు  శాంతించాడు। ఇపుడు నేను ఓమూల నిలబడి రామారావును పిలిచాను. అతను తలెత్తి నన్ను చూశాడు। చూసి వెంటనే గుర్తుపట్టాడు. చేతితో మొహంమీది చెమటను విదిలించి, "నమస్తే సార్" అని దగ్గరగా వచ్చాడు।

"ఏం రామారావ్? నేను గుర్తున్నానా।"?

అతను శుష్క మందహాసం చేశాడు.

"మీరు గుర్తులేకపోవడమేం సార్। బాగున్నారా।"

"ఆ(."

అపుడే బండికి సిగ్నలు ఇచ్చారుగానీ, ఇంకా బండి స్టార్టవలేదు।

"రామారావ్। గుర్తుందా నీకు। పది సంవత్సరాలనాడు నేను నిన్ను సరిగా చదవకపోతే శిక్షించబోయాను. నా ప్రకృతికి శిక్ష విధించటం విరుద్ధం కాబట్టి చదువుకొమ్మని నిన్ను అనునయించాను బుజ్జగించాను। అపుడు నువు బాగా నా మాట విని చదువుకున్నట్లయితే యిపుడిలా ఉండకపోయేవాడివి? నేను నీ చెవి పట్టుకున్నందుకు ఆ రోజు అంత అవమాన పడ్డవాడివి? మరి ఈ రోజు"?

రామారావు క్షణందాకా ఏమీ మాట్లాడలేదు. గార్డు బండికి పచ్చలైటు చూపాడు।

"అవున్సార్। ఈనాడు, ఆనాడు తప్పు నాదికాదు। ఈ పది సంవత్సరాలూ ఆలోచించాను। ఆ దినం నేను మీతో పొగరుగా మాట్లాడినపుడు— మిమ్మల్ని కసిరినపుడు మీరెందుకు నా చెవి వదిలేశారు।? లాగి మొహంమీద నాలుగు తన్ని నన్ను క్లాసునుండి బయటకు పోనీకుండా కట్టుదిట్టంచేసినట్లయితే నేనీస్థితిలో ఉండకపోయేవాణ్ని। నన్నిలా గాలికి వదిలేసినందుకు తప్పు నాదికాదు. మీది।"

నా బుర్ర పనిచేయడంలేదు।

రైలు హీంకరిస్తూ ముందుకు కదులుతోంటే చటుక్కున ఓ పెట్టెలోకి ఎక్కాను. ప్లాట్‌ఫారాన్ని వెనక్కు నెట్టివేస్తూ బండి ముందుకు కదులుతోంది.

రామారావు నావేపే చూస్తున్నాడు అతని కళ్లలో నా మీద "కసి" ఎంత మోతాదులో ఉందో ఆ క్షణంలో నేను కనిపెట్టలేకపోయాను.






# అరేబియన్ నైట్స్

మర్నాడు రాత్రి మంత్రి కుమార్తె తిరిగి ఇలా చెప్పసాగింది

కిందమీర్ రాజు మంత్రి సామంతులతోనూ, కవి పండితులతోనూ సభ తీరి ఉంది, అబూ అలీతో, "రాజులు మాట తప్పరు అన్న ప్రకారం కథ చెప్పు నేను మొదట్లో చేసిన వాగ్దానం మరవలేదు", అన్నాడు.

అబూ అలీ కథను పైకి తీసి ఒక్కొక్క పత్రమే చదువుతూ పోయాడు వింటున్నవారు తన్మయత్వం చెందారు కథను మధ్యలో ఆపటం రాజుకు ఎంతమాత్రమూ సమ్మతం కాలేదు కథ పూర్తి అయినదాకా అందరికీ ఆహార పానీయాలు అక్కడే ఏర్పాటయాయి

అలాంటికథ తనకు అందుబాటులో ఉండగా తనకు జన్మలో విసుగు అన్నది ఉండదని కిందమీర్ రాజుకు నమ్మకం కుదిరింది ఆయన అమిత మైన ఆనందంతో అబూ అలీ గౌర వార్థం లేచి నిలబడి, అతన్ని ఆ క్షణానే తన ముఖ్య వజీరుగా నియ మించి, తన కోక అతనిపైన కప్పి, అతనికీ, అతని వారసులకూ శాశ్వ తంగా ఒక రాష్ట్రాన్ని నగరాలతో, గ్రామాలతో, కోటలతోసహా ఇచ్చేశాడు ఆ కథను తన కథాగారంలో చేర్చి, తన మనసు చిరాకుగా ఉన్నప్పుడల్లా పైకి తీసి చదువుకుంటూ వచ్చాడు

ఆ కథనే నేను ఇప్పుడు చెప్పబో తున్నాను అది నాకు ఎలా లభ్య మయిందంటే, దాని సరిఅయిన నకలు నా వద్ద ఉన్నది.

* * *

చాలాకాలం క్రితం బస్రానగరంలో ఒక యువకుడు ఉండేవాడు అంతటి అందగాడూ, సజ్జనుడూ, నాగరికుడూ ఉండడని చెప్పుకునేవారు అతని పేరు హసన్.

అతని తల్లిదండ్రులు అతన్ని చాలా గారాబంగా పెంచారు ఎందుకంటే అతను వాళ్లకు వయసు మళ్ళిన దశలో కలిగాడు వారికి పిల్లలు లేకపోగా, ఒక సాధువు వారిచేత ఒక పాము మధ్యభాగం తినిపించాడు దాని ఫలి తంగా హసన్ పుట్టాడు

కొంతకాలానికి హసన్ తండ్రి దేహం చాలించాడు అంతులేని ఆస్తికి హసన్ వారసుడయ్యాడు అయితే తల్లి దండ్రుల గారాబంతో పెరిగి చెడి పోయిన హసన్, తన ఈడువాళ్ళతో కలిసి విందు వినోదాలుచేస్తూ, తన ఆస్తి పూర్తిగా తగలేసుకున్నాడు

హసన్‌కు చిల్లిగవ్వకూడా మిగలం కుండాపోయి, అతను దీనావస్థలో ఉండటం చూడలేక అతని తల్లి తన సొంత డబ్బుతో బజారులో నగల దుకాణం పెట్టించింది. అల్లా అనుగ్రహం వల్ల హసన్ అందం ప్రతివాళ్ళనూ ఆకర్షించటమూ, వాళ్ళు అతన్ని చూసి ఆనందించటానికిగాను దుకాణానికి వచ్చి, బేరాలు చెయ్యటమూ జరిగింది.

ఒకనాడు హసన్ దుకాణంలో కూర్చుని ఉన్నాడు బేరగాళ్ల రద్దీ చాలా భాగం తగ్గింది ఆ సమయంలో ఒక పారసీకుడు అటుగా వచ్చాడు. అతని గడ్డం తెల్లగా, పొడవుగా ఉన్నది నెత్తిన తెల్లని తలపాగా చాలా ఎత్తుగా ఉన్నది అతని నడక గంభీ రంగా ఉన్నది అతని చేతిలో ఒక ప్రాచీన గ్రంథం ఉన్నది.

ఆ పారసీకుడు హసన్‌కేసి కొంత సేపు తదేకంగా చూసి, ముందుకు వచ్చి, "ఆహా, గొప్ప స్వర్ణకారుడు !"

అని గట్టిగా అని, ఎంతో సంతోషం వ్యక్తంచేస్తూ, అందరూ మధ్యాహ్న ప్రార్థనలకు వెళ్ళిపోయేదాకా అక్కడే నిలబడ్డాడు తరువాత అతను హసన్ దుకాణంలోకి అడుగుపెట్టి, హసన్‌కు సలాం చేశాడు హసన్ తిరిగి సలాం చేసి అతన్ని కూర్చోమన్నాడు

పారసీకుడు చిరునవ్వు నవ్వుతూ కూర్చుని, "కుమారా, నువు చాలా అందమైనవాడివి నాకు బిడ్డలు లేరు అందుచేత నేను నిన్ను దత్తుచేసుకుని, నా విద్య నీకు చెబుతాను అలాటి విద్య ప్రపంచంలో ఎక్కడా లేదు దాన్ని నేర్చుకోవటానికి ప్రజలు వేల సంఖ్యలో సిద్ధంగా ఉన్నారు అయినా ఇప్పటివరకూ దాన్ని ఎవరికీ చెప్పాలని నాకు అనిపించలేదు నిన్ను చూడగానే నా అనంతరం నా రహస్య విద్య నీది కావాలనిపించింది ఈ తుచ్ఛవృత్తితో నువు నీ బతుకు సెగపాలూ, పొగ పాలూ ఎందుకు చేసుకుంటావు నీకు దారిద్ర్యమన్నది ఎలా ఉంటుందో తెలియకుండా చేస్తాను", అన్నాడు

"బాబుగారూ, మీకు దత్తుపోయి, మీ విద్య నేర్చుకోవటంకన్న నాకు కావలిసింది లేదు నాకు ఉపదేశం చెయ్యటం ఎప్పుడు ప్రారంభిస్తారు ?" అని హసన్ అడిగాడు

"రేపు", అంటూ పారసీకుడు వెళ్ళిపోవటానికి లేచాడు అతను హసన్ చెయ్యి తన రెండు చేతులలోకి తీసుకుని ముద్దుపెట్టుకుని, ఇంకేమీ అనకుండా వెళ్ళిపోయాడు

ఆనందంతో పొంగిపోతూ హసన్ దుకాణం మూసి, జరిగినది తల్లికి చెప్పటానికి ఇంటికి పరిగెత్తాడు

తల్లి అంతా విని, "ఏమంటున్నావురా, హసన్ ? నాస్తికుడైన పారసీకుడి మాటలు నమ్ముతావుటా ?" అన్నది

'ఆయన నాస్తికుడు కాదమ్మా ! ముసల్మానులు ధరించే తలపాగా పెట్టుకున్నాడు", అన్నాడు హసన్

"భ్రమలో పడకు, నాయనా ఈ పారసీకులు మోసగాళ్ళు, నీతిమాలిన వాళ్లూనూ. వాళ్ల నేర్పే విద్య బంగారం చెయ్యటం అందరినీ మోసగించటానికి ఎలాటి పన్నాగాలు పన్నుతారో అల్లాకే తెలియాలి"

హసన్ నవ్వి, "అమ్మా, మనం పేదవాళ్లం మనని మోసగించినవాడు ఏం బావుకుంటాడు ? అదీగాక, ఇంత బస్రానగరంలో అంత తేజస్సుగల ముఖమూ, అంత ఠీవి అయిన నడకా గలవాడు మరెవడూ ఉండడు ఆ పారసీకుడిలో నాకు గొప్ప లక్షణాలు చాలా కనిపించాయి మనం అతన్ని శంకించే కన్నా అల్లాకు ధన్యవాదాలు చెప్పుకోవాలి !" అన్నాడు.

దీనికి తల్లి ఏమీ మాట చెప్పలేదు,



హసన్ మాత్రం ఆత్రంతో ఆ రాత్రి కన్నుముయ్యలేదు.

మర్నాడు తెల్లవారుతూనే హసన్ బజారుకు వెళ్ళి మిగిలిన వర్తకులందరి కన్నా ముందుగా తన దుకాణం తెరిచాడు మరికొంతసేపటికి పారసీకుడు వచ్చాడు హసన్ గౌరవంగా లేచి అతని చేతులు ముద్దుపెట్టుకోబోయాడు కాని పారసీకుడు అతన్ని కౌగలించుకుని, "నీకు వివాహమయిందా, నాయనా ?" అని అడిగాడు

"లేదు నేను బ్రహ్మచారినే అయితే మా అమ్మమాత్రం నన్ను పెళ్ళిచేసుకోమని పోరుతూ ఉంటుంది" అన్నాడు హసన్

"భేష్ ! నీకు పెళ్ళి అయిఉంటే నా గుప్త విద్యకు అర్హుడివి అయి ఉండేవాడివి కావు నీ దుకాణంలో రాగి ఏమైనా ఉన్నదా ?" అని పారసీకుడు అడిగాడు

"చెడిపోయిన ఇత్తడి పళ్లెం ఉన్నది"

"అదే కావలిసింది కొలిమి అంటించి, ఇత్తడి పళ్లెం కత్తిరించి, ముక్కలు మూసలో కరిగించు"

హసన్ ఇత్తడి పళ్ళాన్ని ముక్కలుగా కత్తిరించి, ఆ ముక్కలను మూసలోవేసి, కొలిమిని గొట్టంతో ఊది, కరిగించాడు

పారసీకుడు దగ్గరికి వచ్చి, తన గ్రంథంలోనుంచి ఏవో మంత్రాలు చదివి, "హక్ ! మక్ ! బక్ ! క్షుద్ర లోహమా, బంగారంలాగా శుద్ధికా ! ఇత్తడీ, బంగారమైపో !" అన్నాడు ఇలా అంటూ అతను తన తలగుడ్డ ముడతలలోనుంచి ఒక కాగితం పొట్లం తీసి, అందులో ఉన్న కుంకం పువ్వు రంగుపొడి చిటికెడు మూసలో వేశాడు వెంటనే కరిగిన ఇత్తడి గడ్డకట్టుకుని, స్వచ్ఛమైన బంగారు కణిక అయి పోయింది

ఇది చూసి హసన్ నివ్వెర పోయాడు పారసీకుడు సూచించిన మీదట ఆ కణికను గీటురాయిమీద రుద్ది, అది స్వచ్ఛమైన బంగారమని తెలుసుకున్నాడు నగలు చేసేవాళ్ళు అలాటి బంగారంకోసం తహతహ లాడతారు

హసన్ పారసీకుడి చెయ్యి మళ్ళీ ముద్దుపెట్టుకోబోయాడు కాని పారసీకుడు అతన్ని నివారించి, "వెంటనే ఈ బంగారాన్ని తీసుకుపోయి బజారులో అమ్మి డబ్బు ఇంటికి తీసుకుపోయి భద్రంగా దాచు ఈ సంగతి మాత్రం నరమానవుడికి తెలియనీకు" అన్నాడు

హసన్ త్వరగా బజారుకు వెళ్ళి, బంగారు కణికను రెండువేల దీనారాలకు అమ్మి, పరిగెత్తుకుంటూ తల్లివద్దకు వెళ్ళాడు ఆ ముసలిదానికి ఆశ్చర్యంతో నోట మాట రాలేదు. హసన్ నవ్వి, అదంతా పారసీకుడి విద్యా ప్రభావం అని చెప్పగానే ఆమె బెదిరిపోయి, చేతులెత్తి, "అల్లాతప్ప దేవుడు లేడు ! అల్లాకు తప్ప శక్తిసామర్థ్యాలు లేవు ! ఆ పారసీకుడితో ఏంచేశావు నాయనా!" అన్నది

"ఆయన నాకు బంగారం చేసే విద్య నేర్పటం మొదలుపెట్టాడు. ముందుగా నాకు క్షుద్రలోహం బంగారం ఎలా అవుతుందో చూపాడు", అన్నాడు హసన్

తరవాత అతను తల్లి ఆరాటాన్ని పట్టించుకోకుండా, వంటింటినుంచి ఒక ఇత్తడి సన్నికల్లు తీసుకుని, తన దుకాణానికి పరిగెత్తాడు అక్కడ పారసీకుడు అతనికోసం ఎదురుచూస్తున్నాడు

హసన్ సన్నికల్లు కింద ఉంచి, కొలిమి ఊదసాగాడు

"ఏంచేస్తున్నావు ?" అని పారసీకుడు అడిగాడు.



ఎండా కాలానికీ వానా కాలానికీ ఇదే బాగా తేడా!!
వానాకాలంలో మాకు లాగుడుతో పనే వుండదు!!!

"మా అమ్మ సన్నికల్లు బంగారం చేద్దాం", అన్నాడు హసన్

"నీకేమన్నా పిచ్చా ? ఒకేరోజు రెండుసార్లు బంగారు అచ్చులు బజారులో అమ్మితే అందరూ సందేహించరా ? బంగారం చేసినందుకు నాకు శిక్షపడుతుంది, తెలుసా ?" అన్నాడు పారసీకుడు నవ్వి

"అది నిజమే కాని మీ విద్య త్వరగా నేర్చుకోవాలని ఉంది."

పారసీకుడు మరింత గట్టిగా నవ్వి, నువ్వు మళ్ళీ పిచ్చిగా మాట్లాడుతున్నావు, హసన్ ఈ విద్య తాలూకు రహస్యాలు నడిబజారులో తెలుసుకుందామనా నీ ఉద్దేశం ? నీ శిష్యరికం దుకాణాలమధ్య, పోలీసువాళ్ళ కళ్ళ ముందు సాగుతుందనుకున్నావా ? నీకు నిజంగానే శిష్యరికం చెయ్యాలని ఉంటే నీ పరికరాలు తీసుకుని మా ఇంటికి రా" అన్నాడు

ఏమీ సంకోచించకుండా హసన్ తన పనిముట్లు తీసుకుని, పారసీకుడి వెంట బయలుదేరాడు దారివెంట నడుస్తూండగా అతనికి, పారసీకులను గురించి తన తల్లి అన్నమాటలు గుర్తుకొచ్చాయి అతని తలలోకి వెయ్యి రకాల అనుమానాలు ప్రవేశించేసరికి, అతను ఆగి ఆలోచనలో పడ్డాడు

అది చూసి పారసీకుడు మళ్ళీ నవ్వి, "నవు నిశ్చయంగా పిచ్చివాడివే, హసన్ ఎంత అదృష్టం నీకు పట్టబోతున్నది। నువు ఏమని పస్తాయిస్తున్నావు ? నేను కోరేది నీ సుఖమే... కాని, నాయనా, నన్ను గురించి నీకు ఎలాటి సందేహం ఉన్నా, నా గుప్త

విద్య నీకు మీ ఇంటనే బోధిస్తాను", అన్నాడు

"అలా అయితే మా అమ్మ తృప్తి పడుతుంది", అన్నాడు హసన్

"అలా అయితే పద !" అన్నాడు పారసీకుడు

ఇల్లు చేరినాక హసన్ పారసీకుణ్ణి వసారాలో ఉండమని, తమ ఇంటికి వచ్చిన అతిథి గురించి తల్లికి చెప్ప టానికి, చెంగున లేడిపిల్లలాగా లోపలికి పరిగెత్తాడు

"అమ్మా, ఆయన ఇప్పుడు మన ఇంట ఉప్పుతింటాడు గనక నీకు భయం అవసరంలేదు", అన్నాడు వాడు తల్లితో

"అల్లా మనని చల్లగా చూడాలి, నాయనా ! ఉప్పుతినటం మనలో పవిత్ర బంధంగాని, అగ్నిపూజించే పాపిష్ఠివాళ్ల దాన్ని పవిత్రం అనుకోరు. మనకు చేటు వచ్చిపడింది, బాబూ... నేను మనిషిని చూస్తే, అతన్ని వెళ్ళ గొట్టనంటావు కాని ఆ నాస్తికుడు ఉండగా నేను అసలు ఇంట్లోనే ఉండను చచ్చిపోయిన మీ తండ్రి సమాధిమీద ఒట్టు ! వాడు వెళ్ళినాక ఇల్లంతా కడిగి ధూపం వేస్తాను. నిన్ను కూడా ఒక నెలరోజులపాటు తాకను అయితే, తీరా ఆ మనిషి వచ్చాడు గనకా, మనకు బంగారం ఇచ్చాడు గనకా, మీ ఇద్దరికీ వంటచేసి, పొరు గిళ్ళకు వెళ్ళిపోతాను", అన్నది హసన్ తల్లి హసన్ పారసీకుడివద్దకు వెళ్ళాక ఆమె పుష్కలంగా దినుసులు కొని, కోడి కూరా, దోసకాయ కూరా, పచ్చళ్ళూ, ఊరగాయలూ చేసిపెట్టి, చప్పున పొరుగిళ్ళకు వెళ్ళిపోయింది.

హసన్ తన మిత్రుణ్ణి వంటింట్లోకి తెచ్చి, "మన మధ్య ఉప్పుబంధం ఉండాలి", అంటూ కూర్చోమన్నాడు

"అవును ఆ బంధం తెంచరానిది", అన్నాడు పారసీకుడు

ఇద్దరూ పక్కపక్కనే కూర్చుని భోజనం చేసేటప్పుడు ఆయన, "బిడ్డా, హసన్ ! ప్రమాణ పూర్తిగా నాకు నీ మీద ఎంతో ప్రేమ ఉండబట్టే నేను నీకు రహస్యవిద్య నేర్పబోతున్నాను", అంటూ తన తలగుడ్డ మడతనుంచి పసుపురంగు పొడిగల పొట్లం తీసి చూసి, "ఒక్క చిటికెడు పొడితో అరమణుగు ఇత్తడిని బంగారంగా మార్చవచ్చు దీన్ని తయారుచెయ్య టానికి వెయ్యి మూలికలూ, వెయ్యి ధాతువులూ ఉపయోగించాను ఇందు కోసం నేను పడ్డ శ్రమా, ప్రయాసా గురించి నీకు ఒకనాడు చెబుతాను", అని ఆ పొట్లం హసన్‌కు ఇచ్చాడు. హసన్ దాన్ని పరిశీలిస్తూండగా, మత్తు మందు తీసి, హసన్ తినబోతున్న ఆహారంలో కలిపాడు హసన్ ఆ పొడి కేసే చూస్తూ, ముద్ద నోట పెట్టుకుని







మింగి, మరుక్షణం స్పృహతప్పి పడిపోయాడు

పారసీకుడు విజయగర్వంతో కేక పెట్టి, లేచి నిలబడి, "ఆహా, హసన్! నీ కోసం ఎన్నేళ్ళు వెతికానురా! ఇప్పుడు నాకు చిక్కావు ఇంకేం తప్పించుకుంటావు?" అని, చేతులు పైకి మడిచి, హసన్ తల మోకాళ్ళకు ఆనేటట్టు మడిచి, దృఢంగా బంధించాడు. తరవాత ఒక బట్టలుగలపెట్టె ఖాళీచేసి, హసన్‌ను అందులో పెట్టాడు కిందట బంగారం అమ్మగా వచ్చిన దీనారాలు కూడా ఆ పెట్టెలో పెట్టి, పారసీకుడు బయటికి వెళ్ళి, ఒక కూలి వాణ్ణి తెచ్చి, వాడిచేత పెట్టె మోయించుకుని, తిన్నగా సముద్రతీరానికి వెళ్లాడు. అతనికోసం అక్కడ ఒక ఓడ సిద్ధంగా ఉన్నది పారసీకుడు అందులో ఎక్కగానే, లంగరుఎత్తి పడవ ప్రయాణం అయి వెళ్ళిపోయింది

హసన్ తల్లి తిరిగి వచ్చి చూసుకుంటే, తన కొడుకు లేడు, డబ్బు లేదు, పెట్టె లేదు. బట్టలు చిందరవందరగా పారేసి ఉన్నాయి. బయటి తలుపు బార్లా తెరిచి ఉన్నది రాసిపెట్టి ఉన్నది జరగనే జరిగిందనీ, ఇంక తనకు హసన్ కనిపించడనీ ఆమె అర్థంచేసుకున్నది ఆమె రొమ్ములు బాదుకుని తన కొడుకుకోసం శోకాలు పెట్టింది హసన్ వార్త ఏమైనా తెలుస్తుందేమోనని ఇరుగు పొరుగు ఇళ్ళకు వెర్రిగా పరిగెత్తింది ఆమెను ఊరడించటం ఎవరి తరమూ కాలేదు. ఆ తరవాత ఆమె నట్టింట ఒక సమాధి కట్టించి, దాని చెంత ఏడుస్తూ కూచుని కాలం గడపసాగింది. ఆ సమాధిమీద హసన్ పేరూ, అతను మాయమైన రోజూ రాసి ఉన్నాయి

ఇంతవరకు చెప్పి, మంత్రి కుమార్తె తెల్లవారుతూ ఉండటం గమనించి మౌనం వహించింది

ఉదయం వచ్చిన ఆ ఉత్తరాన్ని పదే పదే చదివినా అందులో వున్నదేమిటో ఒక పట్టాన అర్థంగాలేదు నాకు వజ్రమని భ్రమించింది మసిబొగ్గుగా నిరూపణ ఆయితే ఎంత నిరాశ పేరుకుపోతుందో, ఈ లేఖలోని సారాంశం గూడా శివరాంమీద నేను పెంచుకొన్న ఉన్నతమైన భావాలన్నింటిని సమూలంగా పెరికివేసి తీరని ఆవేదనతో నా మనసును కప్పివేసింది. శివరాం నా క్లాస్ మేట్, అంతకుమించి ఆత్మీయుడు.



# కాటుతిన్న మనిషి

## పి.వి. రమణ

ఒకే కంచం, ఒకే మంచంగా అల్లుకుపోయాం వాడి వివాహమై అయిదు సంవత్సరాలకు పైనే అయింది ఆ పెండ్లికి నేనుగూడా వెళ్ళాను ఈడూ జోడూ సరిపోయిన ముచ్చటైన జంటని ఎంతగానో మురిసిపోయాన్నేను. అసలు కాలేజీలో అమ్మాయిల్ని చూస్తేనే అదో రకంగా కంపించిపోయే శివరాం, ఈ శ్వసనాలతో, వ్యాపకాలతో ఎంతగా ఎదిగిపోయాడు! లలితైనా అనాకారి గాదు. ఒక విధంగా చెప్పాలంటే ఆమె ముందు వీడు దిగదుడుపే మనసులో మరుగుతున్న అన్ని సందేహాలను అదిమిపట్టి ఆ ఉత్తరాన్ని మరోసారి పరిశీలించాను.

"ఒక అపరిచితురాలినుండి ఈ లేఖ ఏమిటాని మీరు ఆశ్చర్యపోవచ్చు. ఏం జేయను? ఒక అవసరం, అంతకు మించిన ఆపద నాచేత ఇట్లా వ్రాయి స్తున్నది. మావారికి మీరు ఆప్తమిత్రు లని తరచూ వారు చెప్పేదాన్నిబట్టి తెల్సింది. అందుకే ఈ చనువు తీసికొంటు న్నాను. ఈ సాహసం చేస్తున్నాను. వారు మొదట్లో నన్నూ, ఇంటినీ విడిచి క్షణంగూడా వుండేవారు కారు. నా దుర దృష్టంకొద్దీ ఈ మధ్య వారి కలవదని దురభ్యాసమంటూ లేదు నన్ను గూడా మర్చిపోయేటంతగా ఆ దవాళ్ళ తో స్నేహా లేర్పడ్డాయి వారికి భార్యనే దానికి ఇంతకు మించిన నరక మేముం టుంది? ఏడ్చాను మొత్తుకొన్నాను. హెచ్చరించాను ఆరోజు కారోజు వారి పోకడ హద్దుమీరిపోతున్నది. కనీసం మీరైనా వచ్చి వారిని అదుపులో పెట్ట గలరని, నా కాపురాన్ని నిలబెట్టగలరనే ఆశతో ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. తప్పక వస్తారుగదూ!

మీ సహాయాన్ని కోరే
లలితా శివరాం"

వెళ్దామంటే అఫీసు వ్యవహారాల్లో క్షణం వెసులుబాటు లేదు "కనీసం మీరైనా వచ్చి" అనే లలిత అర్థింపు నా మనసును జాలితో నింపివేస్తున్నది నా బాధ్యతలను గుర్తుచేస్తున్నది. నా నరాల్లో ఏదో ఆత్మీయత; ఏదో అనుబంధాల తాలూకు విచిత్ర సందడి; ఏమైనాసరె వెళ్ళాలి. తప్పక వెళ్ళాలి. శివరాంకి బుద్ధి చెప్పి సరైన దార్లో పెట్టాలి ఆ కాపు రాన్ని మళ్ళీ నిత్య వసంతంగా రూపు దిద్దాలి. అయిదొందల మైళ్ళదూరం అయిదడుగులే నన్న భావం కల్గింది నా తప్పుడు వస్తున్నానంటూ ఓ టెలిగ్రాం పంపి ఆ రాత్రే రైలెక్కాను

నన్ను చూస్తూనే అనుకోని ఆపదేదో ఎదురైనట్లు, ఊహించని ఉప్పెన ముంచుకొచ్చినట్లూ బిక్కచచ్చిపోయిన ముఖం పెట్టాడు శివరాం వాడి కాళ్ళల్లో, కళ్ళల్లో కంగారు స్పష్టంగా కన్పి స్తున్నది. గొంతు పెగుల్చుకొని 'సీవా' అన్నాడు.

"నేనేరా, ఏమిటిట్లా వూడిపడ్డానని ఆశ్చర్యపోతున్నావా ?" కాదన్నట్లు తలూపాడు శివరాం వాడి ముఖంలో ఇంకా ప్రసన్నత రాలేదు ఆ కంగారు తగ్గలేదు. ఎట్లా తగ్గుతుంది? చేసిన ఘన కార్యానికి నా ముందు తలెత్తుకోవద్దూ వెధవ.

స్నానమదీ పూర్తిచేశాను. నా వెంటే వున్నాడు చిన్ననాటి ముచ్చట్లన్నీ ఏకరువు పెడుతున్నాడు. నా కళ్ళు మాత్రం లలితకోసం వెదుకుతున్నై. బహుశ లోపలే వున్నదేమో, ఏదు చేసే పన్లకి బయటకు రావటానికి ముఖం చెల్లటం లేదేమో పాపం ఇల్లాలను కొన్నాను.

"భోజనానికి పద" తాళం చేతిలోకి తీసుకొంటూ అన్నాడు శివరాం.

"తాళమెందుకురా ఇప్పుడు ?"

"హోటలు కూడే సీగ్గూడా."

మవునంగా వాణ్ణి అనుసరించాను. భోజనం చేస్తున్నంతసేపూ నా మనసొక తేనెతుట్టే అయింది లలిత పుట్టింటిగ్గాని వెళ్ళిందా ? అక్కడకు వెళ్ళటం సమం జసమే అయినా, నన్ను రమ్మని దేనికి వ్రాసినట్లు ? ఆమె పరోక్షంలో నేనే తప్పూ చేయలేదని వీడు ఋకాయిస్తే, లలితెప్పుడొస్తుందిరా అని వీణ్ణడిగితే, బాగుండకపోవటమటుంచి, నా రాక మీదే వీడికి సందేహాలేర్పడొచ్చు. ఏదో తింటమయిందనిపించి ఇంటిముఖం పట్టాం.

అర్ధరాత్రి గేటు బయట కారాగిన శబ్దం నవ్వులు, టాటాలు, గేటు తీసు కుని ఓ స్త్రీ ఆకారం మా మంచాల్ని సమీ పించింది నా గుండెల్లో సన్నని వణుకు. శివరాం తలదిండుక్రింది తాళంచెవులు తీసికొని వరండావైపు వెళ్ళిందామె పోతూ పోతూ ఓ క్షణం ఆగి నా మంచం వైపు ప్రశ్నార్థకంగా చూసింది, ఈ మనిషెవరా అన్నట్లు

ఆవిడ తలుపు తీసి లోపల కెళ్ళ గానే శివరాంను తట్టి పిల్చాను వాడు వులకలేదు, పలకలేదు సరిగదా కనీసం వాడిలో కదలిక గూడా లేదు. ఎంత బండనిద్ర వీడిది! నా దృష్టంతా లోపలే వుంది వీడి స్నేహితురాలేమో ! ఎం చొరవ! ఎంత చనువు, ఇల్లాలు లే విషయం తెల్సికొని నేరుగా ఇంటికే రా పోకలు సాగిస్తున్నది ఆమెనని ప్రయో జనమేముంది ? ఆలోచనల్తో ఆ రాత్ర కంటిమీద కునుకే రాలేదు ఆ వచ్చి నావిడ ముఖాన్ని గుర్తించటానికి గూడా వీలులేనట్లుగా గుడ్డి వెన్నెల పైగా నిర్భయంగా తల పైకెత్తి చూడలేని నా పరిస్థితి

"నా భార్య లలిత" అంటూ ఉదయం శివరాం పరిచయంచేసిన వ్యక్తి ని చూసిన నాకు నోట మాట రాలేదు. ఆశ్చర్యంతో విప్పారిన కళ్ళు కొన్ని క్షణాలట్లాగే వుండిపోయాయి ఈవిడా లలిత! శోకంతో మ్లానమై దీనాతిదీనంగా వుంటుందని వూహించిన ఆమె వదనం వేయి కాండిల్సు బల్బులా వెలిగిపోతు న్నది. తైల సంస్కారం లేక చిక్కువడి వుంటుందనుకొన్న జుట్టు స్థానంలో అతి నాజుకుగా వున్న బర్మాముడి ఏడుపుతో ఉబ్బిపోయిన కళ్ళుగాదు నే జూసింది కొసకంటా దిద్దిన కాటుకతో మిలమిలా మెరిసిపోతున్నై అవి మరి నన్ను రమ్మనమని వ్రాసిందెందుకో! నా రాక నాకే ప్రశ్నార్థకంగా వుండిపోయింది ఆనాడెప్పుడో పెండ్లినాడు చూసిన లలిత ఈమేనా అన్న సందేహంలోనే నేను తన్నుకులాడిపోయాను

ఆ తర్వాత రెండ్రోజులున్నాను.



లలిత దర్శనమే గగనమైపోయింది ఏ అర్ధరాత్రో అపరాత్రో ఆమె రావటం, తిరిగి ఉదయమే వెళ్ళిపోవటం, ఈ విషయాన్ని శివరాం అసలు పట్టించుకొన్నట్లే లేదు ఇదేదో అలవాటైన తంతే అన్నట్లుగా వుంది వాడి పోకడ ఆ వాతావరణం నాకు చెప్పరానంత ఇబ్బందిగా వుంది. నన్ను రమ్మనమని ఉత్తరంలో అంతగా ప్రాధేయపడ్డ లలిత, అసలా విషయమే నాతో ప్రస్తావించకపోవటమటుంచి, పట్టుమని పది నిముషాలైనా ఇంటిపట్టున వుండకపోవట మేమిటి? అంతుపట్టని ఈ చిత్రంతో నా తల తిరిగిపోయింది

శివరాంను పరిశీలనగా చూశాను వాడి కళ్ళలో కళాకాంతుల్లేవు ముఖమంతా పాలిపోయి, దైన్యం తాండవిస్తున్నది సగం చచ్చిన మనిషిలా బితుకు బితుకుమంటూ కన్పించాడు వాడు నా గుండెల్లో ఏదో వెలితి వేదన, అసలు

వీళ్ళద్దరూ భార్యా భర్తలేనా! చల్లని కబుర్లు లేవు. అసలు పరామర్శలే లేవు ఆత్మీయత, అనురాగం అనే పదాలే వీళ్ళకి తెలియవేమో, ఒకింట్లో వుండే వింత శత్రువుల్లా అగుపించారు ఆ దంపతులిద్దరూ నాకు వీళ్ళద్దరి మధ్యా ఏదో అగాధముంది అది ఆకాశమంత లేదా ఈ సృష్టంత.

మరో రెండ్రోజులుండి తిరుగు ప్రయాణమైనాన్నేను నా తో పా టే స్టేషన్ కొస్తున్న శివరాంను ఏదో అడగాలని, ఈ మిష్టరీ కొంత గాకపోతే కొంతైనా తెల్సుకోవాలని నా మనసు ఉబలాటపడింది

"శివరాం,.."

"నీవడగ దల్చింది నాకు తెల్సురా"

"ఏమిటది!?"

"స్టేషన్ దగ్గర చెప్తాలే పద."

స్టేషన్ కొచ్చాం. ప్లాట్ఫారం చివరగా నున్న బెంచీమీద నేనూ వాడూ కూర్చొన్నాం మా యిద్దరి మధ్యా అగాధ లోయలాటి నిశ్శబ్దం నేను సిగ్నల్ వైపు చూశాను.

"వస్తుందిలేరా బం డి. ఆ రా ట పడకు."

"బండికోసం గాదు. ఏం తోచక చూసానంతే"

"లలిత వ్రాసిన లేఖ గూర్చే గదూ నీ ఆలోచన!"

తొట్రుపడి వాడివైపు చూశాను నా తడబాటును గమనించినట్లుగా జీవం లేని నవ్వు నవ్వాడు శివరాం మరు క్షణంలో వాడి ముఖం గంభీరమైపోయింది "ఆ ఉత్తరం వ్రాసింది లలిత కాదు"

"మరి?"

"నే నే"

"నువ్వా!" ఒక విచిత్రమైన అవస్థ నాది.

వాడు నిరామయంగా నావైపు చూశాడు ఆ కన్నుల్లో సన్నటి నీటి పొర అనునయంగా వాడి భుజంమీద చేయి వేశాను.

"దేనికి వ్రాశావట్లా?"

"కాస్త శాంతికి కోల్పోయిన మనస్సుకు కొంత పూరట"

"శివరాం!"

"అంతేగాదు. నేనూ ఒక మగవాణ్ణేనని చాటించుకోవాలనే ఉబలాటం గూడా మిత్రులందరికీ అట్లా లేఖలు వ్రాయించింది"

విషాదంగా వాడివైపు చూశాను

"లలితకు క్లబ్బులూ, మిత్రులూ తప్ప, నేనూ ఇల్లూ పట్టం ఏదో మొక్కుబడిగా తప్ప, ఆపేక్షగా నా చెంతకే రాదు"

"వారించకపోయావా!"

తల అడ్డంగా వూపి నిర్వేదంగా నవ్వాడు శివరాం

"అలివిగాని ఆలిని కట్టుకొని మురిగి






చచ్చేరా ముండాకొడుకని ఒక సామెత వుంది చూశావ్; అది నాలాటివాణ్ణి చూసి వ్రాసిందే"

"మార్చుకోటానికైనా ప్రయత్నం చేయకపోయావా?"

"నేను తెలిసికొనేటప్పటికే చేతులు కాలిపోయినై. అవమానం భరించలేక ఒకనాడు మక్కెలిరగతన్నాను."

"ఏమైంది తర్వాత?"

"నన్ను నోటి కొచ్చినట్లు తిట్టింది బజారున పడింది. అసలు నన్ను చేసికొని ఆవిడ తన జీవితాన్నే త్యాగం జేసిందట"

"ఏ విషయంలో?"

"నావంటి కూపస్థ మండూకాన్ని భర్తగా స్వీకరించినందుకు"

ఆ క్షణంలోపోయి లలితను చంపేద్దామన్నంత ఆవేశమొచ్చింది నాకు. మగవాడు దేన్నైనా భరించి నింద్రొక్కుకోగలదు గాని, భార్య బరితెగిస్తే మాత్రం అది నరకమే. నా శివరాం గుండెల్లో కూడా ఈ అగ్నిపర్వతముందా?

"మొదట్లో బ్రతుకు దుర్భరం అనుకొన్నాను నన్ను నేను చంపుకొని రాజీ కుదుర్చుకొన్నాను. వెకిలి నవ్వుల్ని, వేలుపెట్టి చూపటాల్ని గరళంలా దిగమింగుకొని ఏదోవిధంగా జీవించటం అలవాటుచేసుకొన్నాను."

శివరాం గుండెల్లో కోత, కన్నుల్లో వూట, నరాల్లో నిప్పు, మనసులో సమరం. జాలిగా వాణ్ణి చూస్తూ వుండిపోయాను.

"ఆమెగారి ప్రతాపం శృతిమించింది. ప్రచారం పరిధులు దాటింది. పదిమంది

కళ్ళు నా మీదే. "నీలో పౌరుషం, రోషం చచ్చాయా? నీవూ మగవాడి వేనా?'' అని ప్రశ్నించినట్లుందే చూపులు......" చెప్తూ తల వొంచుకున్నాడు శివరాం. మాట్లాడుతున్నపుడు వాడి గొంతుకు అడ్డంగా ఏదో వుండ నా మనసు విలవిల లాడింది రెండు నిమిషాలు గడిచిపోయాయి

"నీవూ నన్నసహ్యించుకొంటున్నావ్ గదూ?" ప్రశ్నించాడు శివరాం.

''లేదురా, మనసారా అభినందిస్తున్నాను."

"దేనికి?''

''ఇంత విషంలోనూ అమృతంలా వున్నందుకు "

జాలిగా నవ్వాడు శివరాం. ఆ నవ్వు నిండా నిరాశలు, నిట్టూర్పులూను

"శివరాం..."

''అడగరా ''

''ఆ ఉత్తరం దేనికి వ్రాశావ్?"

"నా భార్య గుర్తించకపోయినా కనీసం మీరైనా నేనూ మగవాణ్ణే నన్న భావాన్ని బలపర్చుకొంటారని ఆ ఆశతోనే మిత్రులందరికీ ఇట్లా లేఖలు వ్రాశాను.''

''మరి మిత్రులందరూ నిన్నపార్థం చేసికొంటే, నిజంగా నువ్వు చెడిపోయావని తలపోస్తే "

''నాక్కావాల్సింది అదే. ఈ నరకం కంటే అదే తృప్తి నాకు "

''నాలాగే నీ మిత్రులందరూ ఇక్కడ కొస్తే?''

''అంతదూరంనుండీ రారనే నేనను కొంది. వచ్చింది నీ వొక్కడివే "

కులాలను కన్న మతంలా, మతాల మధ్య భీభత్సంలా నిప్పులు కక్కుతూ వచ్చింది రైలు. బండి కదిలేంతసేపూ కిటికీ ప్రక్కనే నిలబడి నాతో మాట్లాడుతూనే వున్నాడు శివరాం. చెవులు చిల్లులు పడేంత శబ్దం చేస్తూ ఆవిరి కక్కి ముందుకు సాగింది ఇంజన్. పుట్టెడు జబ్బులో పడి, ఇహ ఎన్నడూ కోలుకోలేనట్లు బలహీనంగా వెనుదిరిగిపోతున్న నా శివరాం గుండెల్లోని ఆవిరిని గూడా, ఇట్లా ఇంజన్‌లా తోడివేయ గలిగే శక్తే నా కుంటే..., నన్ను నేనే తిట్టుకొంటూ ఒక నిట్టూర్పు విడిచాను






"సరూ! ఓ సరోజాదేవిగారూ!"

"వస్తున్నా! వస్తున్నానండీ."

"వచ్చావూ! రా! మరీ ఇంత సేపయితే ఎలా? నే వచ్చేసరికల్లా ముస్తాబయి ఎదురుచూస్తూ ఉండాలి! తెల్సిందా?"

"తెల్సింది!"

"ఏమిటి తెల్సింది?"

"మీరు చెప్పింది, నేను విన్నదీ!"

"అయితే ఈ శుభ సందర్భంలో ఒక్క చిన్న...!"

"........."

"అబ్బ! ఎంత తియ్యగా ఉంది! మొన్న మనిద్దరం షాపుకు వెళ్ళి కొనుక్కొచ్చామే రెండు వందలు పెట్టి, ఆ పూలి పూలి చీరకట్టుకుని... మాచింగ్ బ్లౌజు వేసుకుని ... మేకప్ పూర్తిచేసు

కాని ... పదినిమిషాల్లో రడీ అవ్వు కారులో బంగారు కొట్టుకెళ్ళి రవ్వల నెక్లెస్‌కు ఆర్డరిచ్చి వద్దాం ఆ తర్వాత డీలక్స్‌లో సినిమా ! అటునుంచటే వెళ్ళి హోటల్లో భోంచేసి వద్దాం ఇంటికొచ్చిన తర్వాత ఐహుమతిగా ఏమివ్వాలో తెలుసుగా ?"

"తెలియదు !"

"తెలియదు పాపం! నాటీ గర్ల్ !"

"........."

"ఏం సరూ ! రడీ అయినట్లేనా?"

"ఓ !"

"అయితే పద మరి!"

స్టీరింగ్‌ముందు కూర్చుని పక్కన కూర్చున్న అందాలరాశి సరోజ భుజం మీద చెయ్యివేసి కారు స్టార్టుచేశాడు మోహన్ అనుకున్న కార్యక్రమాలన్నీ పూర్తిచేసి వచ్చేసరికి రాత్రి పదిన్న రయింది కారు గారేజిలో పెట్టి లోనికి వచ్చారిరువురూ

"ఏం సరూ ! ఇవ్వాళ చాలా ఆనం దంగా గడిచింది గదూ !"

"ఊ !"

"సినిమా చాలా బాగుంది గదూ !"

"అవును "

"అందులో హీరో హీరోయిన్నిలాగే నలిపి నలిపి చేశాడు గదూ !"

"........."

"ఏం సరూ మాట్లాడవ్ ! ఆనంద పారవశ్యమా ?"

"........."

"ఎవరూ మన ఆనందానికంత రాయం కలిగించకూడదనేగా ! స్తోమ తుండీగూడా - నౌకర్లు చాకర్లు లేకుండా గడుపుతున్నాం ! వాళ్ళుంటే అన్నిటికీ అడ్డమే ! ఏమంటావ్ ?"

"మీరు చెప్పేదాన్ని కాదనలేదను కుంటాను "

"చాలా రాత్రయింది, ఆ లైటు వళ్ళు పొగరణుచు మనలోని కోర్కెలన్నీ వెలుగుతోందది !"

మౌనంగా అతను చెప్పింది చేసింది సరోజ

మరికొన్ని క్షణాలలో వారి పడక గదిలో మధురమైన శ్వాసలు !!

* * *

"సరోజా ! సరోజా !"

"వచ్చే ! వచ్చే !"

"నీకో వార్త చెపుతాను వింటం నీ ధర్మం !"

"అలాగే "

"నేను నువ్వనుకునేటంతటి మంచివాణ్ణి కాదు ! సరోజా కాదు ! ఏమంటావ్ ?"

"కొత్త వార్త వింటున్నాను !"

"వార్తకాదు వార్తలు అను ! ఇంకా చాలా చెప్పబోతున్నాను ! అందులో మొదటిది—ఇటు చూడు దీన్నేమంటారో తెలుసా."

"ఇదివరకు తెలియకపోయినా






ఇప్పుడు చూసి తెలుసుకోగలశక్తి ఉంది నాకు !"

"వెరీ గుడ్ ! అయితే ఇది 'విస్కీ బాటిల్' అని గ్రహించావన్నమాట. దీన్నేం చేస్తారో తెలుసా ?"

"అదిగూడా వివరంగా మీరే చెపుతారనుకుంటాను."

"ఎస్. గ్లాసుల్లో దీన్నిపోసి సోడా కలిపి ఐసుముక్కలువేసి ...జీడిపప్పో, మిక్చరో తింటూ కొంచెం కొంచెం తాగుతారు. అలా తాగుతుంటే ఎలా ఉంటుందో తెలుసా ?"

"నాకు తెలియదని మీకు తెలుసుననే భావిస్తున్నాను. మీకూ తెలియదని ఇన్నాళ్లూ పొరపడ్డానని ఇవ్వాళే తెలుసుకుంటున్నాను !"

"ఈ విషయంలో కాస్త నీ సహాయం కావాలి. చేస్తావా సేరోజా ?"

"........."

"అంటే నిన్నుగూడా తాగమని నేనంటానని నవ్వూహించుకుంటున్నావా ? నేను ఫూల్‌ను కాదు సరోజా! ఫూల్‌ను గాదు. చెడిపోయిన మంచివాణ్ణి ! ఆఁ ! ఇంతకీ చేస్తావా హెల్ప్ చెయ్యవా ?"

"మీ అర్ధాంగిని ! కొన్ని కొన్ని విషయాలలో నా యిష్టా యిష్టాలతో ప్రమేయంలేకుండా ప్రవర్తించాల్సి ఉంటుంది. చెప్పండి ! ఏంచెయ్యాలో ? నేను తాగనక్కర్లేదని మీరే అన్నారుగా !"

"ఏంలేదు సరోజా !"

"ఈ విస్కీని ఈ నాలుగు గ్లాసుల్లో పోసి కాస్త అందిస్తే చాలు."

"ఓస్ ! యింతేగదా ! ఈమాత్రం సహాయానికి మీరింత ఇదవుతారెం

దుకూ ? అంతేగాదు, ఒకవేళ ఈ సీసా లోని విస్కీ అంతా అయిపోయినా మీకు నిషా తల కెక్కకపోతే నేనే వెళ్ళి మరో బాటిల్ పట్టుకొస్తాను సరేనా ?"

"థాంక్యూ - సరోజా ! థాంక్యూ ! భార్యంటే ఇలా ఉండాలి ! భర్త కన్ని విధాలా సహకరిస్తూ నిజంగా నువ్వంటే నేను గర్వపడుతున్నాను ! బై ది బై ! నాలుగు గ్లాసుల్లో పొయ్యమంటున్నారు ఎవరెవరికి ? అని అడగలేదే సరోజా ! తోచలేదా ?

"తోచక కాదు ! మీరే చెపుతారు గదా అనే మీ మీద నమ్మకంతో!"

"ఫైన్ ! యూ ఆర్ కరెక్ట్ ! మిగతా మూడు గ్లాసులు నా ఫ్రెండ్స్ కోసం. వాళ్లెలాంటి ఫ్రెండ్స్ అని అడుగు సరోజా ! చెపుతాను !"

"ఇవన్నీ అడక్కుండానే చెప్పిన మీకు అవిగూడా అడక్కుండానే చెప్పే ప్రేమ నాపై మీకుండి ఉంటుందను కుంటాను !"

"ఆల్ రైట్ ? అలాగేకానీ ! అలాగే ! చెప్పేస్తున్నా ! ఆ ఫ్రెండ్సు ఎవరో ... ! ముగ్గురికీ మూడు రకాల ప్రత్యేకతలున్నాయ్ !"

"అన్ని ప్రత్యేకతలున్న ఫ్రెండ్సును కలిగిన మీ అదృష్టం కొనియాడ దగ్గది !"

"అవును సరోజా ! నువ్వు చెప్పింది అక్షరాలా నిజం ! మొదటి ఫ్రెండు అందంలో ! రెండో ఫ్రెండు ఆనం దంలో ! మూడో ఫ్రెండు వెర్రెక్కిం చటంలో సిద్ధహస్తులు ! వారి పేర్లు తెలుసుకోవాలనిపించటంలేదా సరోజా నీకు ?"

"అనిపిస్తోంది ! చాలావరకు అర్థ మవుతోంది గూడాను విషయం"

"యూ ఆర్ రియల్లీ మార్వెలస్ ! ఆ ఫ్రెండ్సు, పేర్లు మిస్ కామిని ! జూలీ, అండ్ బేగం ! వాళ్ళనెలా రిసీవ్ చేసుకుంటావో సరోజా ? తిడ తావా కొడతావా ?"

"నిక్షేపంలా రిసీవ్ చేసుకుంటాను ! ఎదురెళ్ళి ఆప్యాయంగా కౌగలించు కుని...మా వారి మానస చోరులారా ! రండి ? రండి ! అంటూ నడుంమీద చెయ్యేసి నడిపించుకొస్తా నొక్క క్కర్లే "

"ఆ తర్వాత.. !"

"కిచెన్‌లో కెళ్ళి గాస్ స్టౌవ్ వెలి గించి ఓ పదినిమిషాల్లో చక్కటి వంట కాలు చేసి పట్టుకొస్తాను."

"బ్రేవో ! తర్వాత."

"వారి ముగ్గురి మధ్య మిమ్మల్ని పూలరంగడిలా కూర్చోబెట్టి వండినవి నైస్‌గా వడ్డిస్తాను "

"నైస్ నైస్ ! తర్వాత. త్వరగా చెప్పు. వళ్ళు వేడెక్కుతోంది !"

"ఇంకా వేడెక్కేందుకు విస్కీ గ్లాసుల్లో పోసి యిస్తాను !"



''అదయిన తర్వాత ?''

'అరె! ఆ మాత్రం మర్చిపోతానా! మధువయిన తర్వాత మగువ కావాలిగా మీ మగరాయులకు! అందులో మీకు ముగ్గురు కావాలనకుంటాను మరి వారిని మీ కప్పగించి.''

అదేమిటి సరూ! వారి పొందు విందులా ఉండేమాట నిజమేగానీ... మధ్య మధ్యలో మందులా నువ్వు లేక పోతే ఎలా ?''

"వద్దు లెండి! మందు వికటిస్తుందేమో!"

''దట్సాల్‌రైట్! ఈ రాత్రంతా వాళ్ళ ముగ్గురి బిగి కౌగిలిలోనే కరిగి పోనీ... ! ఏరీ! ఇంకా రావటంలేదు వాళ్ళు వెయిట్ చేస్తుండు! పది నిము

షాట్లో పిలుచుకొస్తాను కార్లో వెళ్ళి నువ్వుమాత్రం ఫుల్‌గా కోపరేట్ చెయ్యాలి సుమా !"

"తప్పకుండా !"

గాలిలో తేలిపోతున్నట్లుగా సంతోషం చిందిసే ముఖంతో బయటికి వెళ్ళి పోయాడు మోహన్ అతను తీసుకు రాబోయే అతిథులకోసం ఎదురుచూసే సరోజ ముఖం నిబ్బరంగా ఉంది ఆమె మస్తిష్కంలో ఏయే ఆలోచనలు తిరుగాడుతున్నాయో ముఖం చూసి ఎవరూ చెప్పలేరు !

మరి కొంచెంసేపట్లో దిగాలు ముఖం వేసుకుని తిరిగి వచ్చాడు మోహన్ ప్రశ్నార్థకంగా చూస్తున్న సరోజతో,

"వాళ్ళు రాలేదు సరోజా ! పచ్చి మోసం చేశారు !"

"అరె ! ఏం జరిగింది ? పాపం !"

"నాకన్నా ధనవంతుడొకడు వాళ్ళని ముందే బుక్ చేసుకున్నాట్ట నాకా విషయం ముందుగా చెప్పలేదు వాళ్ళు!"

"వెరీ సారీ !"

"సారీ ఎందుకు ! ఇంకో అమ్మాయిని తెచ్చుకుంటాను ! వాళ్ళు ముగ్గురూ కలిసినా తన కాలిగోటికి పోలనటువంటమ్మాయిని తెచ్చుకుంటాను అసలా అమ్మాయి పర్మనెంటుగా నా డిస్పోజల్‌లోనే ఉందనుకో ! నీకేమన్నా అభ్యంతరమా ?"

"అభ్యంతరమో కాదో ఈపాటికి మీరు గ్రహించే ఉండాలే !"

"ఆల్‌రైట్ ! అయితే తెచ్చేసుకుంటున్నా!" అంటూ గబగబా వెళ్ళి వీధి తలుపులు మూసేసాడు మోహన్

"మరచిపోయారేమో ! ఆ అమ్మాయిని తెచ్చుకోండి, సేవలు చేస్తానన్నాగా !"

"ఇదిగో ! ఇదే ! ఆ అమ్మాయి !" అంటూ రెండుచేతుల్తో బలంగా సరోజను చుట్టేశాడు మోహన్ ముద్దులు కురిపించేశాడు బుగ్గలనిండా. ఇందాకటినుంచి నిబ్బరంగా ఉన్న సరోజకు ఇప్పుడు అబ్బురంగా ఉంది

"ఏమిటండీ ? ఇదంతా" అంది మెల్లగా

"భార్యామణిగారికో చిన్న పరీక్ష ! అయితే దాన్లో దేవిగారు బ్రహ్మాండంగా నెగ్గారు ! అందుకే అందుకోండి మా జేజేలు !" అంటూ నుదురు చుంబించాడు ప్రేమగా

"సర్‌ప్రైజుతో చచ్చిపోతున్నాను, అసలు విషయం చెబుదురూ!"

"ఏంలేదు స్వీట్ హార్ట్ ! సాధారణంగా ఆడవాళ్ళు సంతోషంలో పొంగిపోయి ... సంతాపంలో కుంగిపోయి ... సంసారాన్ని కలతలమయం చేసుకుంటారని నా మిత్రులు వాదించుకుంటుంటే విన్నాను దాన్ని నీ మీద 'ఎక్స్పెరిమెంటు' చెయ్యాలనిపిం




చింది. వేశాను! మొన్నరోజు సంతోష సందర్భంలోనూ ఇవాల్టి సంచలనం సన్నివేశంలోనూ నువ్వు పాటించిన నిగ్రహం నిబ్బరం శ్లాఘనీయం! విస్కీ తాగటం పరస్త్రీల వళ్లో పరవశించటం అనేవి నేను కల్పించిన గాధలు. వైన్స్‌షాపువాడు నా చిన్ననాటి క్లాసుమేటు. వాడి సహాయంతో ఆ బాటిల్ తెచ్చాను. రేపు పొద్దునే ఇచ్చేయాలి! తీపి రుచిని చేదు రుచిని సమానంగా గ్రహించగల శ్రీమతికి కించిత్ మనస్తాపం కలిగిస్తే...అందుకు క్షంతవ్యుణ్ణి! దాని కారణంగా ఈ రాత్రికి శిక్షించగూడదు సుమా! ఈ ఏకైక పత్నీవ్రతుణ్ణి!" అని ముగించాడు మోహన్.

ఆమె ముఖంలో అలవోకగా మెరిసిపడే ఆనందం చూసి తబ్బిబ్బయిన మోహన్ - తన్మయత్వంతో లైటు ఆర్పేశాడు.







# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?

అవసరాల రామకృష్ణారావు

(గత సంచిక తరువాయి)

## 12

విజయవాడ స్టేషన్‌లో దిగి రిక్షాలో కూచుని మదన్‌గోపాలస్వామి ఇంటివైపు వెడుతున్న యాలిస్ మనస్సు పరిపరి విధాల పోయింది. ముందుగా జానకిని కలుసుకుందామా అనుకుందిగాని ఆమె శలవలకి వాళ్ళ అక్కగారి ఊరు వెళ్ళిందని తెలిసింది. గీతా కాన్వెంటుకు వెళ్ళి బాబుని చూద్దామా అనిపించక పోలేదుగాని అదెక్కడుందో సరిగా తెలీదు, అయినా వాళ్ళకిమాత్రం క్రిస్మస్ శలవలుండవా! "ఇంతవరకూ వచ్చాక ఇంకా దొంక తిరుగుళ్ళు దేనికి? అక్కడికే వెడతాను అడగవలసిన మనిషినే అడుగుతాను-నిండా మునిగిన యిక చలి దేనికి నాకు? ఇంక చెడిపోయేదేముంది నా బతుకులో?" అని నిశ్చయించుకుంది.

ముందురోజు సాయంకాలం అప్పటికప్పుడు కిరణ్ ఆఫీసులోనే విజయవాడకి వెంటనే బయలుదేరాలనే నిశ్చయానికి వచ్చేసింది యాలిస్. అక్కడ చీటీ పెట్టి రిక్షా ఎక్కి ఇంటికి వచ్చేస్తుంటే "పోనీ మరొకసారి రాఘవయ్యని కలిస్తే?" అనిపించినా 'వీళ్ళందరూ చేసిన ఉపకారం ఇంత' వరకు తీసుకొచ్చింది. ఇక ఇతడొకడు ఉద్ధరించడమే తరవాయి. ఇతనివల్ల ఇంతవరకూ నష్టపోయిన ధనమూ,

కాలమూ చాలు !' అని తొందర తొంద రగా తన కాటేజ్ చేరింది. ఎందుకైనా మంచిదని డబ్బు పూర్తిగా విత్‌డ్రా చేసి ఇంట్లో ఉంచింది. ఆ పెద్ద నోట్లు చిన్న పర్సులో కుక్కి జాకెట్ లోపలికి తోసేసింది. చిన్న హేండ్‌బేగ్‌లో అవ సరమైన సామాన్లు పెట్టుకుని కాటేజ్ తాళం వేసేసి ఇవతలి కొస్తూంటే వాచ్ మెన్ కనిపించాడు. "రెండురోజుల్లో తిరిగొస్తానని పెద్దమ్మగారికి చెప్పు" అంటూ రిక్షాలో కూచుని తాళాలు విసిరింది.

"ఎక్కడికి ?" అనే వాడి మాట వినిపించుకోకుండా రైల్వేస్టేషన్‌కి రిక్షాని పోనిచ్చింది. ఇంతవరకు తను ఇచ్చుకున్న సంజాయిషీలు చాలు. నిజమైన ప్రేమికులనుకుని తను చనువు ఇస్తే వాళ్ళు చేసిన ఆ అజమాయిషీలు చాలు.

తనెక్కే ప్యాసింజరు రాడానికింకా రెండుగంటల టైముంది. ఈలోగా తనని వెతుక్కుంటూ కిరణ్‌గాని స్టేషనుకి రాడు కదా !

యాలిస్ అనుకున్నట్టే అయింది.

మరో గంటా గంటన్నరకి ప్రభు దాసుతో సహా వచ్చి పడ్డాడు స్టేషనుకి. వచ్చినవాళ్ళు ఓ పట్టాన వెళ్ళరే ! ఎలాగో కనుగప్పి తప్పించుకోగలి గింది తను. వాళ్ళు తిరిగి వెళ్ళిపోయా రని తెలిసేవరకూ తన ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకోవలసి వచ్చింది.

ఎన్ని విధాల చెప్పినా ఎందుకింతగా వెంటాడుతున్నారు ! ఇంకెందుకు ? వాళ్ళ యింట్రస్టు వాళ్ళకుంది గనక. ఎంత తేనెపూసిన కబుర్లు చెప్పినా పిల్లాడితోసహా తల్లిని తనదాన్ని చేసు కోడానికి ఎందరు మొగాళ్ళకి దమ్ము లున్నాయి ! ప్రభుదాసుకి కావలసింది తన శరీరం, తన సౌందర్యం అంతే. అందుకనే పిల్లాణ్ణి తను తెచ్చుకోకుండా పీలైనంతగా అడ్డుపడుతున్నాడు. అలా డైరక్టుగా చెప్పకుండా తనకేదో సాయంచేస్తున్నట్టు పైకి నటిస్తూ - ఇంక మీరెన్ని ప్రయత్నాలు చేసినా లాభంలేదు. ఏ విధంగా చూసినా లీగల్‌గా మీరు మీవాణ్ణి తెచ్చుకునే అవకాశం లేదు - మీకు ముఖ్యురాలైన మార్గరెట్ మీ పక్షాన సాక్ష్యం ఇవ్వ నంది. ఇక మీరు కోర్టుకెళ్ళడం అనవ సరం - అని కిరణ్‌చేత చెప్పించాడు !

ఈ కోర్టులూ, ఈ ప్లీడర్లూ గంగలో కలవనీ...

ఈ ప్రపంచమంతా ఏకమైనా తనని, పిల్లాణ్ణి వేరుచెయ్యగలదా ?

"నువ్వెవరివో మాకు తెలీదు - నీ దిక్కున్నచోట చెప్పుకోపో" అనిమదన్ కనక అంటే ?

అంటే !

"ఎవర్తివే నువ్వు ! ఈ వేణు

గోపాల్ నా కొడుకు నేనే కన్నాను పిణ్ణి. అట్టే మాటాడేవా, నిలువునా ముక్కలు చేయిస్తాను."

అని వసంత సవాలు చేస్తే?

చేస్తే?

ప్రయాణమంతా ఇవే ఆలోచనలు. ఇలాంటివే ఆందోళనలు ఒక్కొక్కప్పుడు చెప్పలేని దైన్యస్థితి. మరొక క్షణంలో లోకాన్నంతటినీ జయించగల ఆత్మధృతి.

"మంచి మాటలతో నా బాబుని నాకు అప్పజెప్పేరా సరేసరి..."

"అప్పజెప్పం, ఏంచేస్తావే? అసలు ఎవత్తివంట నువ్వు?"

"చెప్తాను వినండర్రా వెర్రి వెధవల్లారా! ఈ మేడలూ, ఈ సోఫాలూ, ఈ వైభవాలూ, ఈ వైభోగాలూ మీకేం సుఖం ఇవ్వలేకపోయాయి. ఎంతటి కోటీశ్వరులో అంతటి కటిక దరిద్రులు మీరు! నాలాంటి దిక్కులేని దాని ఒక్క కొడుకునీ దొంగిలించుకుని తెచ్చుకోవలసినంత ముష్టి పీనుగులు మీరు! మీ ఐశ్వర్యం మీ నెత్తిన పెట్టుకుని తగలెట్టడానికి కూడా పనికిరానంత నిర్వీర్యం. ఇక నేనా? రత్నగర్భని. మీకు నిత్యం ఆనందమిచ్చే ఊపిరి ఎక్కడిదనుకున్నారు. నా దగ్గర్నుంచి కొట్టుకొచ్చిందే! నాది నేను మళ్ళీ పట్టుకుపోడానికి వస్తున్నాను. పట్టుకుపోయి తీరతాను కూడా. ఎవత్తివే నువ్వు? - అని అడిగారుగా, తెలిసిందా? అప్పుడు చూస్తాను మీ మొహాలు ఎలా ఉంటాయో!"

తాత్కాలికమైన అంతటి ధైర్యమే మరుక్షణంలో చెప్పలేనంత భయంగా మారిపోయింది.

"బాగా భాగ్యవంతులని విన్నాను. జమీందారు ఫాయీలో బతుకుతున్నారని తెలుసుకున్నాను - ఆ దుర్మార్గులు నన్ను లోపలికైనా రానిస్తుందో రానియ్యరో! దర్శనంకోసమే ఎన్నాళ్ల పడిగాపులుపడి కూచోవాలో! ఎన్ని మెట్లు ఎక్కాలో, ఎన్ని తెరలు తొలగించుకోవాలో వారిని కళ్లతో ఓసారి చూడాలంటే!"

"ఎవర్తో పిచ్చిది. ఏమిటేమిటో వాగుతోంది. గేటు లోపలికి రాకుండా దీన్ని తరిమికొట్టండి" అని గుమ్మంలోంచే తగిలేస్తే!

"మదన్! మనసున్నదాన్ని. ఒకప్పుడు నీకు మనసైనదాన్ని. నన్ను రెచ్చగొట్టకు. నిజంగా పిచ్చిదాన్ని చెయ్యకు. ఏళ్ళ తరబడి యీ రోజుకోసం ఎదురుచూశాను. ఈ ఆశతోనే బతికాను. మనస్సుని మించిన న్యాయస్థానంలేదు. నిజాన్ని మించిన తీర్పులేదు. వేలకొద్దీ అబద్ధపు రికార్డులని సృష్టించావు. కాని నీ ఆత్మకి తెలిసిన ఈ ఒక్క నిజాన్ని పూడ్చిపెట్టలేవు. నీకూ, నాకూ రుజువెందుకు.

సాక్ష్యాలెందుకు ? నువ్వు ఏదైనా కొన గల ధనవంతుడివి. ఈ బీదరాలి ఒకే ఒక సంపదమీద కూడా నీకు కన్నెందుకు? ఏ అల్లరీలేకుండా నా బాబుని నా కిచ్చెయ్యి."

"ఇవ్వను. ఇవ్వనుగాక ఇవ్వను. ఇవ్వడానికేనా ఇంత కష్టపడి తెచ్చుకున్నాను ? తిరిగి అప్పజెప్పడానికేనా యీ అయిదేళ్ళూ యీ పంచప్రాణాల్నీ పెంచుకున్నాను? ఇందరు జనమూ, ఇంతటి ప్రపంచమూ, ఇంతటి న్యాయ వర్గమూ, ఇవన్నీ నావైపే. ఎప్పట్నుంచో వీటినన్నీ నా కైవసం చేసుకున్నాను. ఒక్కరంటే ఒక్కరు నీ వైపు చెప్పరు. నువ్వు అయిదేళ్ళు కూడబెట్టిన అయిదువేలూ ఆ పరిమళ చేతిలో పెట్టినా – అరక్షణంలో లక్ష అందించి నావైపు పలికించగల సమర్థత నేను పోగుచేసిన ఆస్తికుంది. ఎవరు నిర్భాగ్యులు, నువ్వు ఈ భూమ్మీదే ఉన్నావా, 'ఏలిస్ ఇన్ ది వండర్ లేండ్' లా మాట్లాడుతున్నావా ?"

అడుగడుగునా బెదిరిస్తున్న అసహాయతకి యాలిస్ క్రమక్రమంగా లొంగిపోక తప్పలేదు. బంగళా దగ్గిర పడినకొద్దీ ఆమెలో చెప్పలేని బెంగ క్రుంగదీసింది.

రైల్లో రాత్రి తెల్లవార్లూ నిద్రలేదు. స్టేషన్ దిగగానే మొహం కడుక్కొని నీళ్ల కాఫీ తాగింది గాని మరో పావుగంటకి వాంతి చేసేసుకుంది. కడుపులో ఏదో బాధ, భరించలేని తలనొప్పి.

అయినా యాలిస్‌ని భావాల నీడలు బెదిరించక వదలలేదు. ఆ స్థితిలో కూడా ఆమె ఓటమి ఒప్పుకోదలచలేదు. చేతకానితనం కసిగా, న్యూనతాభావం పగగా మారి – బుస్సున లేచింది ఆమె మనసు.

"అలాగే మదన్, అలాగే చేద్దువుగాని... బాబుని నువ్వే ఉంచుకుందువుగాని... పిచ్చికుక్కని కొట్టినట్టు నీ గేటులోంచే నన్ను తరిమి తరిమి వెళ్ళగొడుదువుగాని...

కాని ఒక్క విషయం మరచిపోకు...

"దెబ్బతిన్న హృదయం ఇది. పగబట్టిన పన్నగం ఇది. ఇంత సుళువుగా ఇది బతికుండగా నిన్ను వదిలిపెడుతుందనుకోడం నీ భ్రమమాత్రమే ! నువ్వు డబ్బుతో కొనలేనిదీ, నీ వైపు తిప్పుకోలేనిదీ లోకంలో ఒకటుందని మరచిపోకు. అది నేనే ! అది చాలు నీ బతుకు క్షణక్షణం నరకప్రాయం చెయ్యడానికి !

ఆనాడు అయిదేళ్ళకిందట దంతపు భరిణ పంపించావే, దాని అడుగు అరలో నువ్వు నాతో తీయించుకున్న ఫొటో ఉంది సుమా !

పాపం నేనేమైపోతానో అని నన్ను

నడివీధిలో వదిలిపెట్టిననాడు పచ్చ నోటు ఒకటికాక ప్రేమతో సలహా ఇస్తూ చిన్న ఉత్తరం కూడా రాశావు. నీ పూర్తి సంతకంతో సహా అది ఇప్పుడు నేను తీసుకు వచ్చిన సంచీలో భద్రంగా ఉంది సుమా !!

లోకంలో నువ్వొక్కడివే తెలివైన వాడివనుకోకు, మదన్ !"

"రాసవిహార్" అనే అక్షరాలు కళ్ల బడగానే రక్తమంతా ఒక్కసారి మొహంలోకి వచ్చినట్టు త్రుళ్ళిపడింది యాలిన్. రిక్షా దిగి, వాడికి డబ్బులిచ్చి పంపేసింది. నీరసంగా ఆశ్చర్యంగా అడుగులువేస్తూ మెయిన్ గేటు దగ్గిరకి నడిచింది.

## 13

"ఎవరు కావాలమ్మా ?" అన్న గేట్‌మన్ పిలుపుకి వెంటనే జవాబు చెప్పలేకపోయింది యాలిన్. ఓ గడీ నిలదొక్కుకుని అంది–

"అమ్మగారు ఉన్నారా ?"

రాత్రి తెల్లవార్లూ కలతపడ్డ మనస్సుతో, రేగిన జుట్టుతో, నలిగిన బట్టలతో తన మటుకు తనకే చికాకు కలిగించేలా ఉన్నా, ఎక్కడో ఏదో పెద్దరికపు లక్షణం ఆ బంట్రోతుని, గౌరవించేలా చెయ్యడం ఆశ్చర్యమే.

"లోపలికింకా బోలెడు దూరం నడవాలి. కేకేసి మా అబ్బాయిని పిలవమంటారా — అమ్మగారి దగ్గిరకి మిమ్మల్ని దగ్గిరుండి తీసికెళతాడు అన్నాడు.

"అక్కర్లేదులే - నేనే వెళ్లగలను. ఇదివరకు రాలేదు గనకనా !" అని దబాయించి లోపలికి జొరబడింది ఆమె.

దూరంగా కనిపిస్తున్న పెద్ద బిల్డింగూ, చుట్టూ పెద్ద ఆవరణా చూడగానే అనాధ శరణాలయం జ్ఞాపకం వచ్చింది. అప్పుడు తను ఉన్నది ఒక పబ్లిక్ సంస్థ. ఇదొక ప్రైవేట్ బిల్డింగు. దానిచుట్టూ ఇనపముళ్లతీగెలు ఉండేవి. దీని చుట్టూ పెద్ద సిమెంటు గోడ. ఒక్క ముక్కలో చెప్పాలంటే దానికంటే ఇదే అందంగా ఉంది. బిల్డింగ్‌కి దారితీసే రోడ్డుకి ఓ పక్క కూరగాయల తోట. ఇంకో పక్క పూల తోట. మిరప పళ్ళు. మందార మొగ్గల తోటీ, టమోటాలు, గులాబీలతోటీ పోటీ పడుతున్నట్టు - మంచులో, ఎండలో మెరుస్తున్నాయి. కనీ కనిపించని దూరంలో ఓ పాక. ఏ తోట మాలిదో! ఏమైనా అంతటి ఆవరణలో జన సంచారం అతి తక్కువ- పూలతోటలో కొళాయి కనిపించి ప్రాణం లేచి వచ్చింది యాలిన్‌కి. పక్కగేటు తీసుకుని లోపలికి వెళ్ళి గబగబా మొహం కడుక్కుంది. గబగబా కడుపు పట్టినన్ని నీళ్లు తాగేసింది.

మెయిన్ బిల్డింగునుంచి ఏదో కారు స్టార్ట్ అవుతున్న చప్పుడు వినిపిం

చింది ఆమెకి. గబగబా కొళాయి కట్టేసి గేటు మామూలుగా వేసేసింది. తొందర పడి తను బయటపడిపోకూడదని ఆమె నిశ్చయించుకుంది. గబగబా నాలుగు అడుగులువేసి గుండ్రంగా దట్టంగా కత్తిరించబడిన ఓ మందార గుబురు వెనక దాగుంది.

సరిగ్గా ఆ గేటు దగ్గిరకి వచ్చేవేళకి కారు స్లో అవడంతో ఆమె గుండె దడ దడ కొట్టుకుంది. కాని అది తనని గుర్తించికాదని ఆమె తెలుసుకుంది. తను గమనించలేదుగాని అక్కడనుంచి మెయిన్ గేటుకు దారితీస్తున్న రోడ్డు సరిగ్గా ఆ గేటు దరిదాపుల్లోనే చిన్న మలుపు ఉంది. కొంచెం స్లో అయి, చిన్న టర్నింగ్ కొట్టి కారు వెళ్ళిపోయింది.

కారు వెళ్ళిపోయింది గాని - ఆ కొద్ది సమయంలోనే - తను చెట్ల చాటునుంచి గమనించిన దృశ్యం మాత్రం - ఆమె స్మృతి పథంలోంచి ఎప్పటికీ కదలనిది.

ఒక నిమిషంపాటు చూస్తేనేం, కొన్ని నెలలపాటు తనతో కాపురం చేసిన మనిషిని అంత సుళువుగా మరచి పోగలుగుతుందా తను !

అయిదేళ్లయిపోయినా నిన్నో మొన్నో చూసినట్టనిపించింది ఆమెకి ఆ మొహం. క్రింద పెదవిని నొక్కి పెట్టిన ఆ పళ్ళు, ఏమీ ఎరగనట్టున్న, ఎంతో జాలిగొలుపుతున్న ఆ కళ్ళు - తనని నాశనం చేసినవి అవే. ఈ జీవితంలో తనింక మరచిపోగలిగేనా ఆ చూపులు ! ఆ చురుకు కళ్ళు, ఆ సూది గెడ్డం, ఏసుక్రీస్తు మొహం పోలిక ఎన్నాళ్లయినా తనకి గుర్తే.

ఏసుక్రీస్తు మాట రాగానే పరమ పవిత్రమైన తమ మత గ్రంథంలో, సామెతల గ్రంథంలో ఆరవ అధ్యాయం నుంచి దయామయి పదేపదే ప్రవచించే విషయం ఒకటి ఆమెకు గుర్తుకొచ్చింది.

పరమ దయాళువు అయిన మన ప్రభువుసహా అసహ్యించుకునేవి ఆరు ఉన్నాయి. మీరు గుర్తించారు కదా!

గర్వంతో కూడిన కన్నులు.

అబద్ధమాడే నాలిక.

అమాయిక ప్రాణాలను బలిగొనే చేతులు.

దురాలోచనలకి దోహదంచేసే హృదయం.

తప్పుడు మార్గంవైపు త్వరపడే చరణ ద్వయం.

దొంగ సాక్ష్యం ఇచ్చే వ్యక్తి

ఈ ఆరూ అందరూ విసర్జించదగ్గవి.

ఆ మాట గుర్తురాగానే వక్రమైన నవ్వొకటి పుట్టుకొచ్చింది ఆమెకి.

"నిజమే ! ఈ ఆరూ విసర్జించదగినవే... కాని ఈ ఆరూ ఒకే వ్యక్తిలో ఉంటే ? మదన్, చెక్కు చెదరకుండా కార్లో కూచుని షికార్లు చేస్తున్నావు. నిన్నెంతగా ఒక వ్యక్తి ద్వేషిస్తోందో

పాపం నువ్వు ఎరగవు. నా బాబుని నాకు కాకుండా చేశావు. నీ బతుకుని నీకు కాకుండా చెయ్యకుండా ఊరు కుంటానా నేను ! నిన్ను సర్వనాశనం చెయ్యడానికి కంకణం కట్టుకున్న వ్యక్తి, ఇప్పుడు నీ ఆవరణలోకే ప్రవేశించిందని నీకు తెలీదు. నువ్వు ఇంట్లో లేకపోవడమే మంచిది. సరైన దుర్ముహూర్తం చూసుకునే, నేను అడుగెట్టేను. ఈ పూలతోట ఇకముందు ముళ్లబాట. ఈ మేడ రేపట్నుంచీ గాలిమేడ. డబ్బు ఇచ్చే పైతొడగులతో ఎల్లకాలం కులుకుదామని చూస్తోంది కాబోలు, నువ్వు అగ్నిసాక్షిగా పెళ్ళాడిన అర్ధాంగి ! ఇప్పుడే వెడుతున్నాను. ఇకముందు మీ బతుకు అనుదినం మృత్యుముఖం. ప్రతి క్షణం ప్రత్యక్ష నరకం..."

అడుగులో అడుగువేసుకుంటూ, అడుగడుక్కీ తను ఆడవలసిన అబద్ధాలు నెమరువేసుకుంటూ యాలిన్ ముందుకి నడిచింది.

గుమ్మంలోనే గుర్రమంత కుక్క. వీళ్ళ బతుకులే కుక్క బతుకులు– అని నవ్వుకుంది ఆమె. యాలిన్‌ని అంత దూరం నుంచి చూడగానే పెద్ద పెద్ద అరుపులు మొదలెట్టింది అది. కట్టేసి ఉందిగాని కండలు చీల్చేసును.

ఎవరో ఒకావిడ – దుస్తులయితే సామాన్యంగానే ఉన్నాయిగాని ముక్కున మెరిసే వజ్రపు కాంతి ఆమె గొప్పతనాన్ని బయటపెట్టేస్తోంది – తలుపు తీసుకు వచ్చింది. పెద్ద దాసీది ఏమో ! ఆ మహారాణీ దర్శనం అవడానికి ఎన్ని అంతరాలు ఛేదించుకు వెళ్లాలో !

వస్తూనే కుక్కని అదిలించి ఊరుకోబెట్టింది.

"ఎవరైనా వస్తూ ఉంటారు, కాస్సేపు ఇక్కడ ఉండవే అంటే ఆ రామికి క్షణం కాలు నిలబడదు. ఎవరమ్మా, అక్కడే నిలబడిపోయారేం? లోపలికి రండి.''

అని చిరునవ్వుతో ఆహ్వానించింది.

"మదన్ గోపాలస్వామిగారు లేరాండీ?" అంది యాలిన్ మెట్ల దిగువ నించే.

"అయ్యో, ఆయన ఇప్పుడంటే ఇప్పుడే కారుమీద వెళ్ళిపోయారు, సుమండీ ! దారిలో మీకు ఎదురయే ఉండాలే !"

"ఏమో నేను బాగా అలసిపోయి ఉన్నాను. రాత్రంతా సరిగ్గా నిద్ర లేదు..."

"అవును. చూస్తే తెలుస్తూనే ఉంది. మాటే కాదు, మీ అడుగుకూడా తడబడుతోంది. లోపలికి వచ్చి ఫేన్‌దగ్గిర కూచోండి."

ఇంకో గడి తనక్కడ నిలబడిపోతే ఆమె కిందకి దిగొచ్చి తన రెక్కపట్టుకు తీసికెళ్లేదేమో – అనిపించి యాలిన్ మెట్లెక్కి లోపలికి వెళ్ళింది.

తనని వెంటనే పరిచయం చేసుకోకపోవడం చాలా అసందర్భ మనిపించింది. అవతల మనిషి అడక్కపోయినా సరే–

"రాత్రి మా అక్కయ్యగారి అమ్మాయి పెళ్ళండీ. మరీ మరీ రాస్తే దగ్గిరవాళ్లూ, బాగుండదని అంతదూరం నుంచి వచ్చాను. రాత్రి ఒక్కటే హడావిడీ, అల్లరీ. బొత్తిగా నిద్రలేదు. మాటల సందర్భంలో ఎవరో చెప్పేరు మదన్ బంగళా గుంటూరు రోడ్డులో ఉందని. పోనీ చిన్నప్పుడు కలిసి చదువుకున్న వాళ్లంకదా, ఓసారి చూచి పోదామని వచ్చాను. ఓ గడీ ముందైనా వచ్చాను కాదు. ఎక్కడికి వెళ్ళిపోయాడో ఏమిటో. పోనీ వాళ్ల ఆవిణ్ణయినా చూసి వెడతాను వచ్చినందుకు. ఆవిడెక్కడుంటారు, ఓసారి పిలుస్తారా ?"

"నేనావిణ్ణి పిలవడం కుదరదండీ."

"అదేం ?"

"నేనే ఆవిడని కనక !" అంది వసంత పకపక నవ్వుతూ.

అప్పటికి యాలిన్ సీలింగ్ ఫేన్ కింద మెత్తని కుర్చీలో కూచుని వేడి వేడి కాఫీ తాగుతూ ఉంది. వసంత మాట విని త్రుళ్ళిపడింది ఆమె. కాఫీ ఒలికింది చీరమీద.

"ఫరవాలేదులెండి. ఎలాగా స్నానం చేసేస్తారుగా ? రంగమ్మని వేణ్ణీళ్ళు పెట్టమని చెప్పేను. అంతదూరం ప్రయాణంచేసి వచ్చారు. పైగా పెళ్ళి బడలిక ఒకటీ. స్నానంచేస్తేగాని ఆ దరిద్రం వదల్దు.

ఇంకో పావుగంటకి గోరువెచ్చటి నీళ్ళు స్నానం చేస్తూంటే ఏదో పోయింది దొరికినట్టు పాత తలపు ఒకటి పలకరించింది ఆమెను. మొట్టమొదట్నుంచీ చెప్పలేనంత శుభ్రం యాలిన్‌కి. ఏ కాలమయినా విధిగా రెండుసార్లూ స్నానం చేసేది. స్నానం అంటే — శుభ్రపడకుండా ఒక్క చర్మ రంధ్రమయినా మిగిలిపోకూడదు; అంత పిచ్చి. స్నానం అరగంటా గంటా చేసే బాదస్తులు కొందరుండొచ్చు. కాని స్నానం అయేక అంతసేపూ తుడుచుకునేవాళ్లు ఉండరు. అంత వెర్రి ఆమెకి.

"మంచు ముక్కనయినా మంచి నీళ్లతో కడుక్కుంటే గాని నోట్లో వేసుకోవు, ఏం చిత్రమమ్మా నీది !" అని వెక్కిరించేది మార్గరెట్.

అవును. మంచుముక్కలాగో మల్లెమొగ్గలాగో తను పరిశుభ్రంగా పవిత్రంగా ఉండగలిగింది, ఆర్ఫనేజ్‌లో ఉన్నంతకాలమే. బతుకే బూడిద అయిపోయాక ఇక పరిశుభ్రత అనగా ఎటువంటిది ! మళ్ళీ దయామయి ఇల్లు చేరుకున్నాక — అక్కణ్ణుంచి కాలేజ్‌కి వచ్చి స్థిరపడ్డాక—ఏం ఉన్నా లేకపోయినా — మొదట్నుంచీ రక్తంలోంచి పుట్టుకొచ్చిన శుచి శుభ్రతలు అమలుపరచకుండా ఉండలేకపోయేది.

"నీ ఇంటికి వచ్చిన వాళ్ళకి సిగరెట్టు కాల్చడానికి భయం, ఎక్కడ నుసి కింద రాల్చేస్తామో అని ! అసలికి యింటిముందు తురాయి చెట్టుకయినా బెదురు అనుకుంటాను, ఎండుటాకులు రాలుస్తే యజమానురాలు ఎక్కడ దెబ్బలాటకొస్తుందో అని !" అనేవాడు కృపానంద్. (సశేషం)




వర్షం కుండపోతగా కురుస్తోంది. కలకత్తా నగరంలో ఏది వచ్చినా విపరీతంగానే వస్తుంది. మెట్రో థియేటర్ ప్రాంగణంలో మబ్బుపట్టిన ఆకాశం వైపు విసుగ్గా చూస్తూ నిలుచుని వున్నాను. సినిమా వదిలిపెట్టడంతో జనం తొక్కిడి అధికమయ్యింది. మరో అయిదు నిముషాల తరువాత వర్షంలో తడుస్తూ ఎదురుగా వున్న ట్రామ్ డిపో వైపు అధిక సంఖ్యాకులు వెళ్ళడంతో సందడి తగ్గింది.

ఎంతసేపని ఆకాశం వైపు చూడను. అందుకని చుట్టూ చూశాను. ఆమె సినిమా నుంచి వస్తోందో లేదో ఎంతసేపటినుంచి నా వైపు ఆవిధంగా కన్నార్పకుండా చూస్తోందో తెలియదుగాని నేనామెవైపు చూడగానే పెదవులపై చిరు దరహాసం చిందించింది. దాంతో నా గుండె కలుక్కుమంది.

సాధారణంగా ఆడవారివైపు సూటిగా చూడటానికి జంకే నాలో ఏదో నూతన శక్తి ప్రవేశించింది. ఆమె వైపు నుంచి

దృష్టి మరల్చడం ఒకపట్టాన సాధ్యపడ లేదు నాకు.

ఆమెలో ఏదో వింత ఆకర్షణ వుంది. ఆ ఆకర్షణే నన్ను అయస్కాంతంలా కట్టి పడవేసింది. ఆమె ముందుకు అడుగు వెయ్యడం గమనించిన నేను ప్రమాదం శంకించి అతి కష్టంమీద దృష్టి రోడ్డు మీద కురుస్తున్న వర్షంమీదకి కేంద్రీక రించాను.

ఆమెవైపు నేనావిధంగా చూడడం సభ్యతకాదని హెచ్చరించడానికే ఆమె నా వైపు వస్తోందనే భయం నాలో ప్రవే శించింది. ఎంతసేపీ వర్షానికి జడవడం అని తడుస్తూనే వెళ్ళిపోతున్నారు కొందరు. మెట్రో ఆవరణలో జనం పలచబడ్డారు. సాయం సమయపు చీకట్లు కలకత్తా నగరాన్ని క్రమ క్రమంగా కబళించివేస్తున్నాయి.

ఆమె నా ప్రక్కన నిలుచుంది. నా హృదయస్పందన నాకు స్పష్టంగా వినిపి స్తోంది.

ఒకడుగు ముందుకు వేసి చెయ్యి చాపి "పాడు వర్షం ఎంతకీ తగ్గడంలేదు," అందామె ఆంగ్లంలో.

ఏమన్నా అనడానికి నా కంఠం నాతో సహకరిస్తే కద. వణుకుతున్న పెదవు లతో ఆమెవైపు చూశాను.

ఆమె ముఖంలో ప్రశాంతత తొంగి చూస్తోంది. ఆ చిరునవ్వు ఆమె స్నిగ్ధ సౌందర్యానికి వింత అందాన్నిస్తోంది.

"మీరెంతదాకా వెళుతున్నారు ?" అనడిగింది నా వైపు చూస్తూ.

కాస్మాపాలిటన్ నగరాలలో స్త్రీ పురు షులు యిటువంటి సమయాలలో ఈ విధంగా పలకరించుకోవడంలో ఆశ్చర్యం లేదు గానీ నాకు ఎన్నడూ యిటువంటి సంఘటన ఎదురవ్వకపోవడంతో అసలే భయపడే నేను ఆమె ప్రశ్నకి సమాధానం యివ్వలేదు.

ఆమె చిన్న బుచ్చుకున్నట్లు మొహంలో స్పష్టంగా ద్యోతకమయ్యింది.

"క్షమించండి... నాకు చిన్నప్పటి నుంచి అతివాగుడు అలవాటు. క్షణం మాట్లాడకపోతే తోచదు. మిమ్మల్ని చూస్తే ఎవరో ఆప్తుల్ని చూచినట్లుగా అనిపించింది అందుకే చొరవగా మాట్లా డాను" అంది నొక్కుకుంటున్నట్లుగా.

అంతమందిలో ఆమె నన్నే ఆప్తుడిగా భావించడం నాకు గర్వాన్ని కలుగ జేసింది. అక్కడున్న వారందరూ ఆమె కంటికి దుర్మార్గులుగా కనిపించారో లేదో గానీ నా కంటికి మాత్రం ఆ విధంగా కనిపించారు. ఆమెవైపు చూడలేక చూడలేక చూశాను ఆమె వెనక్కి అడుగు వెయ్యడంతో వెళ్ళిపోతుందేమో నన్న భయం కలిగింది నాకు.

స్త్రీ దేన్నయినా సహిస్తుంది కానీ మగవాడిలోని పిరికితనాన్ని మాత్రం సహించలేదనే వాక్యాలు గుర్తుకు వచ్చాయి. నాలోని అహం దెబ్బతింది

కంఠం సవరించుకుని 'మీరు అన్యధా భావించకండి నా స్వభావమే అంత. ఇంట్లో అందరూ నన్ను ముంగి వెధవ అంటూంటారు. మీరే చెప్పండి. యిక్కడి వంటరి జీవితంలో ఆఫీసు, రూం. పుస్తకాలు-యివే ప్రపంచమయినపుడు ఎవరైనా అంతే కదా" అన్నాను.

ఆశ్చర్యం! ఆమెని చూస్తూ వుంటే మాటలు అవంతట అవే వస్తున్నాయి. ఆమె చిరునవ్వు నవ్వుతూ "మీరింత చక్కగా మాట్లాడుతూంటే మిమ్మల్ని ముంగి అని ఎవరన్నారు," అంది ఆశ్చర్యపోతున్నట్లుగా చూస్తూ.

ఆమె మాటలు నాలో ధైర్యాన్ని యినుమడింపజేశాయి. "నేను జతిన్‌దాస్ వీధిలో వుంటున్నాను" అన్నాను.

"నా ప్రశ్నకి యిప్పటికి సమాధానం వచ్చిందన్నమాట "అందామె చిరునవ్వు నవ్వుతూ.

నేను సిగ్గుపడ్డాను. "నేనూ అటువైపే వెళ్ళాలి. హిందూస్థాన్ పార్క్ వీధిలో వుంటున్నాను నేను" అందామె.

ఆ తరువాత మా మధ్య కొంతసేపు మౌనం తాండవమాడింది.

హఠాత్తుగా ఆమె నా వైపు తిరిగి "మీరు 'అమానుష్' చూశారా?" అనడిగింది.

"బెంగాలీ వర్షన్ చూశాను."

"మిమ్మల్ని ఈ క్షణంలో చ్చూస్తూ వుంటే ఉత్తమకుమార్ జ్ఞాపకం వస్తున్నాడు," అంది నవ్వుతూ.

"కృతజ్ఞుణ్ణి" అన్నాను నవ్వుతూ.

ఈసారి ఆమె నావైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"ఉత్తమకుమార్ నా అభిమాన హీరో. అతనితో నన్ను పోల్చినందుకు కృతజ్ఞుడిని. కానీ ఆ సినిమాలో అతనిలా భగ్నప్రేమికుడిని మాత్రం కాకూడదని మనసారా వాంఛిస్తున్నాను" అన్నాను నవ్వుతూ.

ఆమె కూడా నవ్వింది.

"వర్షం యిప్పట్లో తగ్గే సూచనలు కనిపించడంలేదు" అన్నాను ఆకాశం వైపు చూస్తూ.

ఇంతలో ఒక టాక్సీ అటువైపుగా వెళుతుండటం చూసిందామె. "టాక్సీ" అని కేక వేస్తూ "మీకభ్యంతరం లేకపోతే మన మిద్దరం ఒక ప్రాంతంలోనే వున్నాం కాబట్టి ఈ టాక్సీ షేర్ చేసుకుందాం" అంది.

ఆమె పక్కన కూర్చుని ప్రయాణం చెయ్యడంకన్న జీవితంలో యింకేమీ అక్కర్లేదనిపించింది నాకా క్షణంలో. మౌనంగా తల వూపాను.

టాక్సీలో మేమిద్దరం మౌనంగా కూర్చుని వుండటం టాక్సీ నడుపుతున్న సర్దార్జీకి వింతగా తోచినట్లుంది, ఒకటి రెండుసార్లు వెనక్కి తిరిగి చూశాడు.

ఆమెలో ఎటువంటి ఆలోచనలు చెల




రేగుతున్నాయో నాకు తెలియదు గానీ నాకు మాత్రం లవ్ ఎట్ ఫస్ట్ సైట్ (తొలిచూపులో ప్రేమ అందాము) అంటే అర్థమేమిటో బోధపడింది. తియ్యటి ఆలోచనలలో విహరిస్తున్న నేను ఆమె పలకరింపుతో ఉలిక్కిపడ్డాను.

"మీరు మరోవిధంగా భావించకుండా వుంటే రాష్‌బిహారీలోని ఆషాస్టోర్స్ ముందు ఒక్క నిముషం ఆగుదాం. నేను చీర సెలెక్ట్ చేసి పెట్టుకున్నాను. ఇవాళ జీతాలిచ్చే రోజు కదా, ఈ రోజొచ్చి తీసుకుంటానని చెప్పాను."

"ఓ ష్యూర్... కానీ మీరీవిధంగా నన్ను పరాయివారిక్రింద జమకట్టి 'మరో విధంగా అనుకోకండి... మరో విధంగా భావించకండి' అని అనకండా వుంటే చాలు" అన్నాను.

"మన పరిచయమయి అరగంట కూడా కాలేదు," అందామె నవ్వుతూ.

నాకు మాత్రం యిది జన్మ జన్మల అనుబంధంలా వుంది," ఆ మాట అంటూంటే నా గొంతు బొంగురు పోయింది. ఆ తరువాత ఆమె ఏమనుకుంటుందోనని సిగ్గుపడ్డాను.

ఆమె నా వైపు చూసి చిరునవ్వు నవ్వుతూ "నేను చెప్పలేకపోయాను. మీరు చెప్పారు" అంది.

నాలో ఆశాలత తలుక్కుమంది. ఆమె వైపు చూసి ఏదో చెప్పబోయాను. ఆషా స్టోర్స్ సమీపించడంతో నేను మౌనం వహించాను.

ఆమె టాక్సీ దిగుతూంటే "నేనూ వస్తాను," అంటూ ఆమె వెనుకే వెళ్లాను. ఆమె చెప్పినట్లు ముందుగానే చీర ఎంచుకోవడంవలన అంతగా ఆలస్యమవలేదు.

"ఈ చీర నాకు బాగుంటుందా?" అనడిగిందామె.

"మీరు కట్టుకుంటే ఈ చీరకి అందం వస్తుంది. కానీ ఒక్కటే కొరత" అన్నాను గంభీరంగా.

ఆమె ప్రశ్నార్థకంగా నా వైపు చూసింది.

"ఆ బిల్లు నా చేతికిస్తే ఆ కొరత తీరుతుంది..." అంటూ ఆమె చేతిలోని బిల్లు వైపు చూశాను.

ఆమె విస్తుబోయి నా వైపు చూసింది–

"నో...నో... నేను చీర కొనుక్కుంటే మీరు ఖరీదు చెల్లించడ మేమిటి?" అంది.

నేను గతుక్కుమన్నాను. "క్షమించండి. నేను మరో ఉద్దేశ్యంతో అన లేదు. మన స్నేహ చిహ్నంగా కానుక యిద్దామనిపించింది. నాకు చిన్నప్పటి నుంచి యిదొక చెడ్డ అలవాటు" అన్నాను.

"ఏమిటి... ఆడపిల్లలకి కానుక లివ్వటమా?" అంది నవ్వాపుకుంటూ.

నా మొహం ఎర్రబడింది. ఆమె అది చూసి విరగబడి నవ్వింది. ఆమె నవ్వుతూంటే మరింత అందంగా కనిపించింది నాకు.

"నన్నింత అపహాస్యం పాల్జేసిన తరువాతయినా ఆ బిల్లు నా చేతికిస్తారా?" అన్నాను.

ఆమె తల అడ్డంగా తిప్పడంతో నాలోని అహం దెబ్బతింది. చటుక్కున ఆమె చేతిలోని బిల్లు లాక్కుని చూశాను. ఆరవై రూపాయల చిల్లర అయింది. ఆ రోజే జీతం రావడం వలన పర్సు బరువుగా వుంది. సందేహించకుండా ఖరీదు చెల్లించాను. ఆమె నావైపు అసంతృప్తిగా చూడడం గమనించాను కాని నేనది ఖాతరు చెయ్యలేదు.

ఇద్దరం టాక్సీలోకి జొరబడ్డాం. వర్షం అప్పటికి కాస్త తగ్గుముఖం పడుతోంది.

"కోపమా?" అనడిగాను.

"ఇటువంటి పనులు చేస్తే ఎవరికి కోపం రాదేమిటి?" అందామె.

"ఈ సారికి క్షమించి వదిలెయ్యి."

"అదిగో... ఒక బహుమతి యివ్వగానే ఏకవచన ప్రయోగమా?" అందామె నవ్వుతూ.

"ఐయామ్ సారీ."

"నో...నో... నాకు ఆ విధంగా పలకరిస్తేనే బాగుంది."

హిందుస్థాన్ పార్కులో ఎటువైపు మీ యిల్లు?" అనడిగాను.

"అదిగో ఆ ఎదురుగుండా కనిపిస్తున్న యిల్లే..." గ్రౌండ్ ఫ్లోర్‌లో వుంటున్నాం.అంటూ టాక్సీవాడికి సూచన లిచ్చి ఆపుతూ" లోపలికి వచ్చి ఒక కప్పు టీ సేవిస్తే ధన్యురాలి నవుతాను," అందామె నవ్వుతూ.

అటువంటి ఆహ్వానానికే ఎదురు చూస్తున్న నేను చటుక్కున క్రిందికి దిగి టాక్సీవాడికి మీటరు చెల్లించబోయాను.

"పోనీ ఆ పనయినా నన్ను చెయ్యనిస్తారా ?" అందామె.

"నో...నో."

"మనం షేర్ టాక్సీలో వచ్చాం కాబట్టి షేర్ చేసుకుందాం." అంటూ బలవంతాన మూడు రూపాయలు నా చేతిలో కుక్కి తలుపు తాళం తీసింది.

"ఎవరూ లేరేమిటి ?" అనడిగాను, ఎవరూ లేకపోతేనే బాగుండుననిపించిన నేను.

"నేనూ అమ్మ మాత్రమే వుంటున్నాం. అమ్మ బెనారస్ వెళ్ళింది," అందామె చిరునవ్వు నవ్వుతూ.

"ఎందుకూ ?"

"చేసిన పాపాలు క్షమించమని, చేస్తున్న పాపాలు చూడకుండా వదిలెయ్యమని ఆ విశ్వేశ్వరుని కోరుకోడానికి కాబోలు"

"ఛ... అవేం మాటలు" అన్నాను.

మాగజైన్స్ చూస్తూ వుండండి. చిటికెలో వచ్చేస్తాను." అంటూ లోపలికి వెళ్ళింది.

నేను సోఫాలో కూర్చుని ఫిలిమ్‌ఫేర్ తిరగేస్తున్నానన్న మాటే గాని నా మనస్సంతా ఆమె మీదే వుంది.

పదిహేను నిముషాల తరువాత ట్రేతో పాటు వచ్చిన ఆమెతో "ఇదేనా చిటికెలో రావడం..." అంటూ ఆమె వైపు చూసి ఆగిపోయాను

ఆమె నేను కానుకగా యిచ్చిన చీర కట్టుకుంది. ఆ చీరలో ఆమె అందం ద్విగుణీకృతమయ్యింది. నా గుండె లెందుకో దడదడలాడాయి.

ఆమె నావైపు చూసి చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వు నా మీద సమ్మోహనాస్త్రంలా పనిచేసింది.

అది ప్రేమో... ఇన్‌ఫాట్యుయేషనో తెలియని అయోమయావస్థలో పడ్డాను. అదేదయితే నాకేం... ఆమె నాకు కావాలి. ఆమె లేనిదే జీవితం అంధకారమన్నట్లుంది నాకు.

"ఇవన్నీ ఎందుకు ?" అనడిగాను సింగడాలు, స్వీట్స్‌వైపు చూస్తూ.

"తినడానికి" అంటూ నవ్విందామె. నేను రోషంగా మొహంపెట్టడంతో పగలబడి నవ్విందామె. అలా వూగిపోతూ నవ్వుతూంటె ఆమె పమిట క్రిందకి జారింది. లోనెక్ జాకెట్ ఆమె సౌందర్యలహరిని బహిర్గతపరుస్తోంది. నా కంఠం పొడారిపోయింది. ఆమె నా అవస్థ నెంతమాత్రం పట్టించుకోకుండా,

"సింగడాలంటే నాకిష్టం," అంటూ ట్రేలోని ప్లేటు మా మధ్యన పెట్టి టీ కప్పులలోకి కెటిల్‌లోంచి టీ నీరు వంచింది. ఇన్ని చేస్తున్నా ఆమె పయిట కప్పుకోవడం మాత్రం చెయ్యలేదు.

నేను ఆమె వైపు చూడలేక టీ కప్పు వైపు దృష్టి మరల్చాను. నా చేతులు వణుకుతున్నాయి. ఆ వణుకుపాటు కప్పి

పుచ్చుకునేందుకు ప్రయత్నిస్తున్నాను నేను

"టీ చాలా బాగుంది" అన్నాను. వెచ్చటి తేనీరు త్రాగిన తరువాత కొంత స్వాస్థ్యం లభించింది నాకు

"థాంక్స్... కానీ చీరగురించేం చెప్పలేదు" అంది చిరునవ్వుతో.

అప్రయత్నంగా తల పైకెత్తాను థాంక్ గాడ్ ! ఆమె నా అవస్థ గమనించి నట్లుంది పయిట నిండుగా కప్పుకుంది

"యూ ఆర్ మార్వెలస్" అన్నాను

"నేను చీరగురించి అడిగాను" చిలిపిగా అందామె

"యూ ఆర్ లుకింగ్ మార్వెలస్... ఓకే" అన్నాను

"రియల్లీ"

"నాకు అబద్ధం చెప్పడం చాతకాదు"

అంటూనే ఎంత పచ్చి అబద్ధం చెప్పారు" అంది నవ్వుతూ

ఆ తరువాత మరో పదినిముషాలు సరదాగా మాట్లాడుకున్నాం ఆమె ఎదురుగా వుంటే నాకు కదలాలనిపించడం లేదు ఎందుకో ఆమె వైపు చూస్తూ అట్లాగే కూర్చుండిపోవా లనిపిస్తోంది

"నేనిక వెళ్తాను," అన్నాను అయిష్టంగా లేచి నిల్చుంటూ

"అంత వర్షం కురుస్తూంటే ఎక్కడికి వెళతారు?" అంటూ కిటికీలోంచి బయటకి చూసింది వర్షం బాగా పెద్దదయింది

"వర్షం కాస్త తగ్గాక వెళ్ళొచ్చు" అంటున్న ఆమె మాటలు కాదనలేక సోఫాలో కూలబడ్డాను

"దేశంలో మరో మూల 'వర్షమో రామచంద్రా' అని గొడవపెడుతూ వుంటే అక్కడ కురవకుండా కుండ పోతగా యిక్కడ కురుస్తోంది" అందామె నవ్వుతూ

నేను ఏదో ఒకటి అనేలోపలే కరెంటు పోయింది

"ఛ...ఛ .. ఈ కరెంట్ ఒకటి... పోతే రెండుమూడు గంటలదాకా దిక్కుండదు" అని విసుక్కుంటూ "కొవ్వొత్తులు తీసుకు వస్తానుండండి" అంటూ లేచి నిలుచుందామె

వర్షం బాగా ఎక్కువయింది చలిగాలి రివ్వున వీస్తోంది ఉన్నట్లుండి వస్తున్న మెరుపులు తప్ప చుట్టూ గాఢాంధకారంగా వుంది.

కొవ్వొత్తులకోసం వెళ్ళబోయిన ఆమె టీపాయ్ తగిలి క్రిందపడబోయింది నేను చటుక్కున ఆమెని పట్టుకున్నాను నా శరీరం ఆమె స్పర్శతో గగుర్పొడిచింది. నా పట్టునుండి విడిపించుకునేందుకు ఆమె ప్రయత్నం చెయ్యలేదు కొన్ని సెకన్లు ఆ విధంగా మా మధ్య దొర్లాయి

ఇంతలో ఉన్నట్లుండి పిడుగుతో పాటు మెరుపు మెరిసింది ఆమె చటుక్కున నా కౌగిలిలో ఒదిగిపోయింది.



నేనామె వెన్ను నిమురుతూ గాఢంగా నా బాహువుల మధ్య బంధించి వేశాను

నా పెదవులు ఆమె అధరాలతో కలవడానికి ఉత్సుకత చూపుతున్నాయి

మనం ఎదురు చూడని సంఘటనలు, అవకాశాలు అప్పుడప్పుడు తారస పడుతూవుంటాయి. అందులో నిండు యవ్వనంలో వున్న యిరువురు స్త్రీ పురుషులకి వారికి కావలసిన దేమిటో తెలిసిన తరువాత యిటువంటి అవకాశం ఎదురుపడితే దాని నొక మరుపురాని సంఘటనగా మలచుకోవడం వారి ఆవేశోద్వేగాలమీద ఆధారపడి వుంటుంది.

మా యిరువురి మధ్య ఆవేశానికి— ఉద్వేగానికి కొరతేం లేదనిపించింది నాకు విరజిమ్ముతున్న సెగల పొగల అనుభూతి చూసిన తరువాత.

బయట వీస్తున్న పెనుగాలి తలుపు లనే ద్వారాలు మూసుకున్నాయి అదే సమయంలో వలపు అనే ద్వారం మా యిరువురి మధ్య తెరుచుకుని మమ్మల్ని కవ్విస్తూ ఆహ్వానించింది

లైట్లు వెలిగి అరగంట పైనే అయి వుంటుంది మరో లోకంలో విహరిస్తున్న మేము చటుక్కున స్పృహవచ్చిన వారిలా విడివడ్డాము

ఆమె నాకు దూరంగా జరిగింది నా బలహీనతకి సిగ్గుపడ్డాను ఆమె వైపు చాలా సేపటివరకు చూడలేకపోయాను.

ఆ తరువాత ఆమెని సమీపించి "నన్ను క్షమించు... ఆవేశంలో చెయ్యకూడని పని చేశాను" అన్నాను

"అందుకు నా సహకారమూ వుందిగా" అంది చిరునవ్వు నవ్వుతూ.

ఆమె మోములో ఆ క్షణంలో కూడా చిరునవ్వు ప్రత్యక్షమవడం నాకు ఆశ్చర్యాన్ని కలుగజేసింది

ఆవేశంతో ఆమె చెయ్యి పట్టుకుని "నీకు నేను అన్యాయం చెయ్యను" అన్నాను

ఆమె తదేకంగా నా వైపు చూసింది

'నిన్ను తప్పకుండా పెళ్ళిచేసుకుంటాను'' అన్నాను, ఆమె నమ్మటం లేదన్న బాధతో

ఆమె పేలవంగా నవ్వింది.

"ప్లీజ్ నన్ను నమ్మవూ" అన్నాను ఆమె చేతులు పట్టుకుంటూ ,

ఆమె బాధగా నవ్వుతూ..." నమ్మి ప్రయోజనం లేదు " అంది

ఆమె కే విధంగా నచ్చచెప్పాలో తెలియలేదు నాకు "ప్లీజ్" అన్నాను.

"వర్షం తగ్గినట్లుంది " ముభావంగా అందామె

"నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను." మరోసారి దృఢస్వరంతో అన్నాను.

ఆమె హృదయంలో అగ్నిపర్వతాలు చెలరేగుతున్నాయి ''దయచేసి నన్నొంటరిగా వదలి వెళతారా ?" అంది

నే నామెవైపు చూసి ఏదో చెప్పబోయాను

"ప్లీజ్" అందామె.

ఆమె పరిస్థితి ఊహించాను. ఆ సమయంలో ఏ స్త్రీ అయినా ఒంటరితనాన్ని అభిలషించడం సహజం మౌనంగా, భారంగా అడుగులు వేస్తూ తలుపుదాకా వెళ్ళాను వెనక్కి తిరిగి చూసిన నాకు శూన్యంలోకి చూస్తున్న ఆమెని చూడగానే ఆమె దగ్గరకెళ్ళి ఆమెని నా కౌగిలిలో బంధించి ధైర్యం చెబుదామన్న కోరిక కలిగింది అతి కష్టంమీద ఆ కోరిక చంపుకుని బయటపడ్డాను

* * *

మరునాడు సాయంత్రం ఆఫీసు నుంచి త్వర త్వరగా బయటపడి రూంకి వచ్చి ముస్తాబు చేసుకుని ఆమె కిష్టమైన సింగడాల పొట్లం కట్టించుకుని హిందూస్థాన్ పార్క్ వైపు బయల్దేరాను.

వర్షం జల్లు నాలు గత సాయం త్రపు తియ్యటి సంఘటనని గుర్తుకు తెస్తోంది.

ఈపాటికి ఆమె మనో నిబ్బరం తెచ్చుకుని వుంటుంది. ఆమెతో జీవితం ఆనందమయం చేసుకుంటాను. ఇన్నాళ్లకు జీవితంలో పోగొట్టుకున్న వస్తువేదో దొరికిన అనుభూతి నాలో కలుగుతోంది. ఆమె కోసమే నేను, నా కోసమే ఆమె జన్మించామనిపించింది నాకు.

ఆమె నా కోసం ఎదురుచూస్తూ వుంటుంది. ఇంత ఆలస్యంగా వచ్చినందుకు బుంగమూతి పెడుతూ అలక వహిస్తుంది — ఈ విధంగా ఆలోచిస్తూ వెళుతున్న నాకు హఠాత్తుగా ఒక విషయం జ్ఞాపకంవచ్చి నవ్వొచ్చింది.

ఇంతవరకు ఆమె పేరు నాకు తెలియదు. నా పేరు ఆమెకి తెలియదు !

పేర్లు తెలియకుండా ప్రేమేమిటి ?

అయినా ప్రేమకి పేర్లెందుకు ? — ఆ ఆకర్షణ అటువంటిది- నన్ను నేను సమర్థించుకున్నాను.

ఆమె యిల్లు సమీపించాను. నిన్న నేనిచ్చిన చీర ఆమెకి ఎంత బాగా నప్పింది. ఆమె బహుశా ఆ చీరే కట్టుకుని వుంటుంది.

ఆమె మోములో ఎంతటి ప్రశాంతత వుంది. తీర్చి దిద్దిన ఆ సౌందర్య రాశి లభించడం నిజంగా నా అదృష్టం.

ఆమె యింటి గుమ్మం సమీపించాను. తలు మూసివుంది. మృదువుగా తలుపు తట్టాను. ఆమెకి వినిపించినట్లు లేదు.

ఇంతలో నాలో ఒక చిలిపి ఆలోచన ప్రవేశించింది. కిటికీ దగ్గర్నుంచి సకిలింతలు చేసి ఆమెని భయ భ్రాంతురాలిని చేద్దామనుకున్నాను నేను.

కానీ...

ఆమెని దిగ్భ్రాంతురాలిని చేద్దామనుకుని కిటికీవైపు వెళ్ళిన నేను దిగ్భ్రాంతి చెందాను. నా చేతిలోని సింగడాల పొట్లం నలిగిపోతోంది. నా కాళ్ళు వణుకుతున్నాయి.

నా మనస్సులాగే పొట్లంలోని సింగడాలు చితికిపోతున్నాయి.

ఆమె నేను బహూకరించిన చీర విప్పతోంది. ఎదురుగా బల్లమీద అంతకన్న ఖరీదయిన చీర వుంది.

ఆమె దృష్టి ఆ చీర మీద వుంది.

ఆమె కెదురుగా నల్లటి దుబ్బుమీసాల బెంగాలీబాబు ఆమెని నమిలి మింగేసేటట్లు చూస్తూ కూర్చుని వున్నాడు.






# అప్పిచ్చువాడు

ప్రకాశరావు

ఉపోద్ఘాతం ఏమీ లేకుండా కుర్చీలో కూర్చుంటూనే చనువుగా అడగదల్చుకున్న విషయానికి వచ్చాడు రాజన్.

"కాస్త డబ్బు సర్దగలరా ?"

"కాస్త దబ్బైతే సర్దగలను" చమత్కారం ఒలకబోశా న్నేను. అదే తరువాత కొంపలు ముంచుతుందని నాకేం తెలుసు !?

"కాదు, కాదు డబ్బు కాస్త సర్దగలరా అనాల్సింది, నేను" రాజన్ సరిదిద్దుకున్నాడు.

"ఏం కొంపలంటుకున్నాయి ఇప్పుడు ?"

"మొన్న కలకత్తా టూరుకని అడ్వాన్సు డ్రాచేశాను ఫస్టుక్లాసు రిజర్వేషన్ దొరక్క త్రీ టయర్‌లో ప్రయాణం చేసినందుకు దాని తాలూకు డబ్బు రిటర్న్ చేయాలి. పై నెల

జీతంలో కోసుకోవయ్యా అంటే మన అకౌంట్సు ఆఫీసరు కాదు కుదరదు, ఫైనాన్సియల్ ఇయర్ పూర్తి అవుతూంది కదా. అకౌంట్సు బాలన్సు చేయాలి. ఈ నెలిల్లోనే అంటాడు. అంత డబ్బు మన అకౌంటులో లేదు. మీరు సర్దితే పై నెల జీతంలో ఇచ్చేస్తాను.

"వస్తు తేదీ ఇంకా పన్నెండు రోజులే అకౌంట్సు ఆఫీసరుకు మాత్రం ఇదేం పట్టు? ఈ గొడవలన్నీ ఎందుకని. ఎంత కావాలి?" అని మాత్రం అడిగాను.

చిన్న కాగితం ముక్క నా ముందుకు తోశాడు రాజన్—ఏడువందల అరవై రెండు చిల్లర.

డ్రాయర్‌లోంచి చెక్‌బుక్ లాగి ఏడువందల డెబ్బైకి చెక్కు వ్రాసి ఇచ్చాను. ధన్యవాదాలు చెప్పి తన ప్రతిజ్ఞను పునరుద్ఘాటించి మరీ వెళ్ళాడు రాజన్. మరీ డబ్బుకి కటకట ఇప్పట్లో లేదు. మరో వేయి రెండువందలున్నాయి బ్యాంకి అకౌంటులో ప్రస్తుతం. నిట్టూర్చి మళ్ళీ పేపర్లు దిద్దటంలో పడ్డాను.

స్టూడెంట్సుతో రిసర్చి ప్రాబ్లమ్స్ చర్చిస్తూంటే మిశ్రా తలుపుతట్టి లోపలికి వచ్చాడు.

"కాస్త బయటకు రాగలరా? మీతో అర్జంటుగా ఒక ముఖ్య విషయం మాట్లాడాలి," సంకోచంగా అన్నాడు.

ఏమిటీ అంత ముఖ్య విషయం అనుకుంటూ అతని వెనకే వెళ్ళాను.

"ఏం లేదు—అర్జంటుగా లక్నో వెళ్ళాల్సి వచ్చింది. పై వారంలో మా తమ్ముడి పెళ్ళట. రేపే బయల్దేరి వెళ్ళాలి. మన దేశంలో తెలుసుగదా మీకు పెళ్ళి అనగానే ఇవతలి జనానికూడా కోలెడాముదం. పెళ్ళికి వెళ్ళకపోవడం ఘోర తప్పిదం కింద లెక్కవేస్తారు. అందునా స్వంత అన్న పెళ్ళి అనగానే మా ఆవిడ హడావుడి చెప్పక్కర్లేదు. ఫారిన్ రిటర్న్‌డ్ డాక్టర్ మిశ్రా ఘోష.

"ఓ నాలుగైదు సరితే మీకు పోస్టు డేటెడ్ చెక్ ఇస్తాను. పై నెల్లో డ్రా చేసుకోండి. ప్లీజ్..."

నా వద్ద డబ్బు వుండగా లేదు అని కచ్చితంగా చెప్పలేని బలహీనత మొహమాటానికి దారితీస్తుంది. ఎప్పుడూ ఇలా సందిగ్ధావస్థ నుండి తేరుకోకుండానే మిశ్రా చకచకా చెక్‌బుక్ తీసి వ్రాయటం కూడా పూర్తిఅయింది, అంతలోనే నేను తేరుకుని అన్నాను. "మధ్యాహ్నం కచ్చితంగా చెప్పగలను. ఇప్పుడే చెక్కు వ్రాయకండి."

"నో, నో... ఇది బిజినెస్ కాదనుకోండి. ఒకే డిపార్టుమెంటులో వున్న వాళ్ళం అంచేత మీ వద్దకు మొహమాటం లేకుండా వచ్చాను. మిగిలిన వాళ్ళ సంగతి చెప్పాలా ఇక? మీలా ఓపెన్ మైండెడ్, హెల్ప్‌ఫుల్ నేచర్డు కారు, ఉట్టి దేవురింపు మొహాలు. అందుకే మీరంటే నేను ఏమాత్రం సంకోచించ

కుండా మా యింటి విషయాలు కూడా మాట్లాడ గలను." నన్ను ఉద్ధరిస్తున్న ఫక్కీలో మాట్లాడాడు మిశ్రా

ఇహ తప్పించుకోవడం ఎలాగూ చేత నవలేదు ఇంతలో రాజన్‌కు ఇచ్చిన డబ్బు గుర్తుకు వచ్చింది. వస్తుడాటి వారంరోజులయింది అతడినడిగి డబ్బు పుచ్చేసుకుంటే మళ్ళీ బ్యాంకి అకౌంటుకు టొక్క పెట్టకుండా మిశ్రాకు డబ్బు సర్దవచ్చు

"ఫరవాలేదు చెక్కు వుంచండి. మధ్యాహ్నం ఏమైందీ చెప్పగలను ఈ లోగా మీ కెక్కడేనా సర్దుబాటవుతే నా అవసరం వుండదు ఎలాగూ!" తెలి విగా మాటాడాననుకున్నా.

మిశ్రా వెళ్ళిపోయింతర్వాత రాజన్ డిపార్టుమెంటుకు ఫోను చేశాను దాదాపు రోజూ కనిపించే రాజన్ పోయిన పది రోజులుగా ఎక్కడా కలిసినట్టుగా జ్ఞాప కంలేదు బహుశా సెలవులో వున్నా డేమో?

"హలో? హలో రఘూ, నేను రాజన్ స్పీకింగ్."

"సారీ రాజన్! అర్జంటుగా నాకు డబ్బు అవసరం వచ్చింది. ఓ అయిదు వందలు సర్దగలరా?" ఖర్మ నా డబ్బు కోసం నేనే బతిమాలుకోవాలి!

కాసేపు అవతలివేపు నిశ్శబ్దం

"హలో...సో సారి రఘూ. మీ డబ్బు విషయమే పూర్తిగా మరచి పోయాను సుమా! ఇంట్లో హడావుడితో ఎక్కడా తీరడంలేదు, మీరు కూడా బొత్తిగా నల్లపూసై పోయారు మాఆవిడ కూడ ఒకటే సాధింపు 'మిస్టర్ రఘు రావటంలేదేం?' అని ''ఏంటి మీ రిసర్చి కుర్రాళ్ళు అంతగా కాల్చుకు తింటు న్నారా?''

"అబ్బే! పై నెల్లో ఓ కుర్రాడు వెళ్ళి పోవాలని గోలపెడుతున్నాడు అతడికి అపాయింటుమెంటు లెటర్ వచ్చింది. ఈ మధ్యనే దాంతో ఎక్కడా తీరటంలేదు. మరో వారం రోజులదాకా నన్ను క్షమిం చాలి"

"దానికేంలే కానీ, పై వారం మా యింటికి రాకపోతే వూరుకునేది లేదు. మధ్యాహ్నం మా ప్యూనుతో చెక్కు వంపిస్తాను, అయామ్ రియల్లీ సారీ! ఏం అనుకోకూడదు మీకు చాలా ఇబ్బంది కలుగ జేసినట్టున్నాను సో సారీ. థాంక్యూ!"

మధ్యాహ్నం రాజన్ ప్యూన్ రాలేదు కాని మిశ్రా మళ్ళీ వచ్చాడు రాజన్ చెక్కు వచ్చినా లాభంలేదు మిశ్రా రేపు వెళ్ళిపోతాడు రాజన్ చెక్కు ఏడు వందలపైన—మిశ్రాక్కావలసింది ఐదు వందలు ఇలా ఆలోచించి ఐదు వంద లకు చెక్కు వ్రాసి మిశ్రాపరం చేశాను పై నెల్లో ఇన్సూరెన్సు అనువల్ ప్రీమి యమ్ కట్టాలి రాజన్ చెక్కూ మిశ్రా

డబ్బు రెండూ నన్ను చేరితేనేగాని ఇన్సూరెన్సు కార్పొరేషన్ బాగుపడదు

మర్నాడు పనిలోపడి బొత్తిగా మరిచి పోయాను రెండోరోజు ఫోనుచేస్తే రాజన్ డిపార్టుమెంటులో లేడు మరో రెండు రోజుల తరువాత ఫోనుచేస్తే క్లాసులో వున్నాడు చిరాకేసి రాజన్‌ను నాకు ఫోను చేయమని చెప్పి వూరుకున్నాను. మర్నాడు లైబ్రరీలో ఎదురైన రాజన్ బిత్తరపోయినట్టుగా అనిపించింది నాకెందుకో, ఎంతో గిల్టీగా క్షమాపణ చెప్పుకున్నాడు నేను మరేం ఫరవాలేదు— పై నెల దాకా నాకంత ఇబ్బంది లేదు. అని చెప్పినా వినిపించుకోలేదు

"మా ప్యూనుకు చెక్ ఇచ్చి నాలుగు రోజులైంది ఆ లోఫర్ మీకు ఇచ్చినట్టు లేదు నిన్న మీరు ఫోను చేసినట్టుగా మా డిపార్టుమెంటులో చెబితే కనుక్కున్నాను మీకు చాల ఇబ్బంది కలుగజేశాను ...సో సారీ " గబగబా వెళ్ళిపోయాడు రాజన్

మర్నాడు రాజన్ ప్యూను వచ్చి చెక్కు ఇచ్చి వెళ్ళాడు అదేరోజు ఆ చెక్కును బ్యాంకిలో జమకట్టాను

రాజన్ చెక్కు జమ కడుతుంటే నాకు మిశ్రా పోస్టుడేటెడ్ చెక్ జ్ఞాపకం వచ్చిటిది వస్తు తారీకు ఇంకా వారం రోజులేవుంది, కాని ఎంత వెదికినా ఆ చెక్ దొరకలేదు పైగా అతడు ఆ చెక్ నాకు ఇచ్చినట్టుగా కూడా జ్ఞాపకం రాలేదు చెక్ వ్రాసినట్టుగా మాత్రం గట్టిగా గుర్తు మిశ్రా తిరిగి రాగానే అడగాలని టేబుల్ కాలెండర్‌లో నోట్ చేసుకున్నాను

కాని రాజన్ ప్రవర్తనే నాకు గమ్మత్తుగా అనిపించింది ఎప్పుడూ పలకరించి స్కూటర్‌మీద లిఫ్ట్ ఇచ్చేవాడు ఇప్పుడు గమనించనట్లుగా పక్కగా దూసుకుపోతున్నాడు ఎదురయితే హఠాత్తుగా స్పీడు పెంచి తప్పుకు పోతున్నట్లుగా అనిపించేది లైబ్రరీలో ఎదురైతే 'హలో !' అని దాటుకు పోయేవాడు అతడి ఇంటికి వెళ్లాలని ఎన్నిసార్లు అనిపించినా ఎందుకో, బహుశా ఈ ప్రవర్తన వల్లే వెళ్ళలేక పోయాను

ఇన్సూరెన్సు ప్రీమియమ్ డ్యూడేట్ వచ్చింది వేయిన్నరకు చెక్కు వ్రాయబోయి పాస్‌బుక్కు చూసుకుంటే డబ్బు తక్కువగా వుంది, రాజన్ ఇచ్చిన చెక్ తిరిగి వచ్చింది మిశ్రా చెక్ ఇచ్చినట్టుగా జ్ఞాపకంలేదు. రాజన్ కనిపించడమే గగనమై పోయింది తెగ చిరాకు వేసింది నాకు

మిశ్రాను కనుక్కుంటే "సారీ రఘు: అప్పుడు మీకు చెక్ ఇవ్వడం మరచి పోయాను పై నెల్లో తప్పకుండా ఇచ్చేస్తాను. ప్లీజ్ బేర్ విత్‌మీ..." ఇంగ్లీషులోనూ హిందీలోనూ తెగ ఇదైపోతూ ప్రాధేయపడ్డాడు.

"పై నెల్లో తప్పకుండా ఇవ్వండి

దయచేసి" అనిమాత్రం అన్నాను మళ్ళీ నా కష్టాలు ఏకరువు పెట్టడం ఇష్టంలేక

మా ప్రొఫెసర్ కూతురి పుట్టినరోజు పార్టీకి వెళ్లి దగ్గరలోనే ఉన్న రాజన్ యింటికి వెళ్ళకుండా వుండలేకపోయాను రాజన్ ఇంట్లో లేడు, శ్రీమతి రాజన్‌ను అడిగాను, "ఇప్పుడప్పుడే వస్తారా! ఎంత సేపైంది వెళ్ళి!'' ఇంతదూరం వచ్చి అతడిని కలుసుకోకుండా వెళ్ళబుద్ధివేయ లేదు.

"చాలా సేపైంది వెళ్ళి — ఎటు వెళ్ళారో తెలియదు "

ఓ పది నిమిషాలు వెయిట్‌చేసి చూద్దామనిపించింది వద్దని ఎంతచెప్పినా వినిపించుకోకుండా శ్రీమతి రాజన్ కాఫీ చేసి తెచ్చారు కాఫీ త్రాగుతూంటే వాళ్ళ ఇంటో పరిస్థితులూ, ఇబ్బందులూ చెబుతున్నారావిడ.

"మీ డబ్బు మరో రెండు వారాల్లో తప్పకుండా సర్దేస్తాం ప్లీజ్ ఏం అనుకోకూడదు మొదట తీసుకున్నట్లుగా మీ డబ్బు వెంటనే తిరిగి ఇవ్వలేక పోయారు వారు ఈ విషయమే మదన పడిపోతున్నారు ...

ఆవి దలామాట్లాడుతూంటే నిర్విణ్ణుడి నయ్యా న్నేను అంతే నేను నా బాకీ తాలూకు డబ్బు వసూలు చేసుకునేందుకు వచ్చాననుకుంటున్నారా ఈవిడ? వడ్డీ వ్యాపారస్థుడిలా, ఇంటిమీదపడి యాగీ చేసేవాడిలా కనిపించానా నేను! ఎవరికేనా డబ్బు సర్దితే డబ్బుతోపాటు వాళ్ళ ఇంటికి వెళ్ళే స్నేహాన్ని కూడ కోల్పోతా మన్నమాట. రాజన్ చెక్ తిరిగివచ్చిన సంగతి నేను రాజన్‌కు ఇంకా చెప్పలేదు అంటే చెక్ తిరిగి వస్తుందని రాజన్‌కు మొదటే తెలుసు! అందుకే అలా తప్పుకు తిరుగుతున్నాడు పరిపరి విధాలుగా ఆలోచనలు మెదడులో తిరిగాయి గొంతంతా తడి ఆరిపోయింది ఆవిడ గరిట తిరిగేసి నా తలపై బాదినా అంత తెల్లబోయే వాడిని కాదేమో! కాస్సేపు ఏం మాట్లాడ లేకపోయాను. గబగబా కాపీ తాగి నన్ను నేను తమాయించుకుని......

"ఫరవా లేదమ్మా మనలో మనకు అంతమాత్రం సహాయం చేసుకోకుంటే ఎలా...మా ప్రొఫెసర్ ఇంటికి వచ్చాను దగ్గరలోనేగదా అని ఇలా రాజన్ గారిని కలిసేందుకు వచ్చాను... పొడి పొడిగా మాట్లాడాను.

మరింకేం చెప్పాలో తెలియక వస్తానని లేచాను కూర్చోమని ఆవిడ చెప్ప లేదు రాజన్‌కోసం కూర్చోవటం నాకు శక్యంకానిపని

మరో నెలరోజుల తర్వాత రాజన్ ప్యూను ఒక సీలువేసిన కవరూ దాంతో పాటు రాజన్ వ్రాసిన చిన్న నోటూ తెచ్చి ఇచ్చాడు ఆ కాగితం వెనకే ధన్యవాదాలు చెబుతూ వ్రాసి సంతకంచేసి తిప్పి పంపాను ఆ కవరు విప్పికూడా చూడాలనిపించ లేదు నాకు. రాజన్




మాత్రం ఎక్కడేనా ఎదురైతే "హలో రఘూ!" అని మాత్రం అని తప్పకు పోతూంటే ఎంతో బాధగా అనిపించేది. స్నేహం మూలంగా డబ్బు సర్దితే దాని వల్ల నా ఇబ్బందుల విషయం అటుంచి స్నేహమే నిలువలేదు. నా తప్పు ఏమిటో ఎంతకూ అర్థంకాలేదు।

మిశ్రా నేనూ, ఒకే డిపార్టుమెంటు అవటం మూలాన ఎప్పుడూ ఇక్కడా, అక్కడా కలుసుకోవటం తప్పదు అతడు నెలకో వంద వందాయాభై ఇస్తూ ఆర్నెల్లు పొడిగించాడు. కాని అతడు కూడా మొదట ఉన్న స్నేహభావంతో ఎప్పుడూ మాట్లాడలేదు, మళ్ళీ.

బిలియర్డ్సు ఆడి చేతులు తుడుచుకుంటూ బయటకు వస్తూంటే శుకా నెమ్మదిగా అన్నాడు.

"మీతో ఓ చిన్న విషయం మాట్లా డాలి."

ఇలా 'మాట్లాడలంటే' అర్థం తొందర గానే తెలిసిపోయింది నాకు. రెండుసార్లు చేతులు కాలాక ఏమైనా సరే ఇక ఎవ్వ రికీ డబ్బు సర్దడం పెట్టుకోకూడదని దృఢంగా నిశ్చయించు కున్నానెప్పుడో. డబ్బు విషయం ఎలా వున్నా దానివల్ల వచ్చే మొహమాటాలకూ, పట్టింపులకూ తట్టుకోలేన్నేను.

"ఏంటా విషయం?" నా ఆలోచన లను అణచిపెట్టి వీలైనంత సౌమ్యంగా అన్నాను.

"అసలిలా మీతో మాట్లాడవల్సివచ్చి నందుకు నన్ను మన్నించాలి మీరు," మృదువుగా అన్నాడు శుక్లా పైపు అంటి చుకుంటూ," కాని నాకు మీ స్వభావం తెలుసు అందుకే ఇలా ధైర్యం చేస్తు న్నాను..."

మరోసారి దృఢంగా అనుకున్నాను. ఇతడు డబ్బు విషయం ఎత్తగానే "నో ఐ ఏమ్ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ" అనేసి గబగబా దాటుకు వెళ్ళిపోవాలని.

కాస్పేపాగి, పొగనములుతూ మళ్ళీ అన్నాడు శుక్లా.

"...రాజన్, మీరూ క్లోజ్ ఫ్రండ్స్ కదూ?" అతడలా మాట్లాడుతూంటే విం తగా అనిపించింది నాకు, మనస్నేహం అంత గొప్పది కాకపోయినా మీతో చెప్పాలనిపించింది. దయచేసి నన్ను అపార్థం చేసుకోకండి ... మిమ్ములను 'మర్చంట్ అఫ్ వెనీస్' అనీ 'షైలాక్' అనీ సంబోధిస్తూంటే సహించలేక పోయాను. ఏదో అత్యవసరంగా మీవద్ద కాస్త డబ్బు తీసుకుంటే ఆ డబ్బు తిరిగి వచ్చేదాకా డిపార్టుమెంటులో ఇంటికి వెళ్ళి సాధించేవారని డాక్టర్ మిశ్రా అతడూ జోకులేసుకుంటూ వుంటే ఆ విషయం మీకు చెప్పి హెచ్చరించటం భావ్యమని తోచింది నాకు. మీ రింకా ఈ వూరికి కొత్త. వీళ్ళ అలవాట్లూ, స్వభావాలూ మీకు సరిగా తెలియవు. మీ మెతకదనాన్నీ, సౌమ్య స్వభావాన్నీ ఇతరులు వాళ్ళ అవసరాలకు వాడుకో వచ్చు. ప్రత్యేకించి డబ్బు విషయంలో జాగ్రతగా వ్యవహరించాలి. ప్రతిరోజూ డబ్బుతో పేకాట ఆడుకొనే వాళ్ళకు మీ డబ్బు తీసుకుంటున్నప్పుడు వుండే ఆత్రం తిరిగి ఇచ్చేప్పుడు ఎలా వుం టుంది.? వాళ్ళ బలహీనతలను కప్పి పుచ్చుకునేందుకు మీ గురించి చెడ్డగా మాట్లాడితే దాంట్లో ఆశ్చర్య పడాల్సిన విషయం ఏమీలేదు. కానీ, హామ్లెట్‌లో పోలోనీయస్ అడ్వైస్ మరచి పోయారా మీరు?..."లోన్ అఫ్ట్ లూజెస్ బోత్ ఇట్‌సెల్ఫ్ ఎండ్ ఫ్రండ్..." అని? నేను మాత్రం దాన్ని తు. చ. తప్ప కుండా పాటిస్తాను."

నా భుజంమీద చేయివేసి గట్టిగా నొక్కాడు శుక్లా.

"రండి టీ తీసుకుందాం?"

యాంత్రికంగా శుక్లా వెంట నడిచాను.

---



# సరళాదేవి పొదుపు

ఎస్. పురుషోత్తమాచార్య

ఈ మధ్య నా కథలు అడపా దడపా వివిధ పత్రికల్లో పడుతూనే ఉన్నాయి. పాఠకులు పత్రికాముఖంగా తెలుపుతూ వున్న అభిప్రాయాలవల్ల వారు నా కథల్ని బాగానే ఆదరిస్తున్నారని తెలుస్తోంది దాంతో నాక్కూడా పేరొస్తోంది. కదా అన్న భావం నాలో జీర్ణించుకుపోసాగింది. ఈ సమయంలో నాకో ఆలోచన వచ్చింది. నా కెలాగూ 'పేరొస్తుందన్నది' నిర్వివాదాంశం. అయితే నేనొక్కణ్ణే పేరు తెచ్చుకుని ఓ వెలుగు వెలిగిపోవడం నా కెంత మాత్రమూ ఇష్టంలేదు. నా జీవితంలో నా శరీరంలో, నా కష్టసుఖాల్లో అన్నిట్లోనూ భాగం పంచుకుంటూన్న అమాయకురాలైన నా భార్య నలా గాలి కొదిలేసి నేనలా కీర్తికవాటాల వైపు పరుగులు తీయటానికి నా మనసంగీకరించటంలేదు. అంచేత మా ఆవిడచేత కూడా ఒకటీ అరా కథల్రాయించి

ఆవిడ పేరుని కూడా వెలుగులోనికి తీసుకరావడానికి నడుం కట్టుకున్నాను. మొదట్లో ఆవిడ పేరు పెట్టి నేనే ఎందుకు వ్రాయకూడదని తోచింది. కాని అలాంటి పెడత్రోవలు త్రొక్కటానికి నా హృదయం అంగీకరించటంలేదు.

ఆ క్షణం నుంచీ రచయిత్రికి కావల సిన గుణగణాల్ని మా ఆవిడలో అన్వే షించసాగేను.

మా ఆవిడ పిట్టగోడ దగ్గర నుంచుని "ఇహ వెళ్ళొస్తాను సరళగారూ!" అంటూనే గంటలకొద్దీ కాలు కదపని ప్రక్కింటి పద్మనాభంగారి సతీమణికి "పనులైపోయాయాండీ?" అంటూ పంచనచేరే ఎదురింటి ఏకాంబరంగా రింటావిడకూ, యిరుగమ్మ, పొరుగమ్మల కథల్ని అతి సహజంగా, అతి నేర్పుగా వున్నవీ లేనివీ కల్పిస్తూ చెబుతూండటం నేను చాలా సార్లు విన్నాను దాంతో మా ఆవిడలో కూడా రచయిత్రికి కావలసిన కల్పనాశక్తి నా కళ్ళకి ద్యోతకమవుతూ వచ్చింది.

మర్నాడు ఏదో వారపత్రికలో నా కథనిచదివినన్నభినందించటానికి వచ్చిన నా మిత్రులు కొందరు యధాలాపంగానే "మీ ఆవిడచేత కూడా కథవ్రాయించ రాదుటోయ్! ఎంచక్కా మీ దంపతుల కథల్ని చదువుతూ మురిసిపోతాం!" అంటూ కూచున్నారు. దాంతో నా ఊహకి ప్రోద్బలం లభించినట్లయింది యిక మా ఆవిణ్ణి రచయిత్రిగా తీర్చి దిద్దటమే నా ప్రథమ కర్తవ్యంగా తోచింది.

అయితే యిక్కడో చిక్కొచ్చి పడింది. మా ఆవిడెపుడో చిన్నతనంలో వెలిగించిన చదువు ఏడోక్లాసు! అది కేవలం మా ఆవిడకి చాకలిపద్దులు వ్రాయటానికీ, అంగట్లోంచి తేవలసిన సరుకుల్నేకరువు పెట్టటానికి మాత్రమే పనికివస్తోంది. నేను ఆశ్చర్యపడవల్సి వచ్చిన రోజున మాత్రం ఏ పత్రికో ముందుంచుకుని అందులోని వాక్యాల్ని గుణకారాలూ, భాగహారాలుగా విభజిస్తూ గొణుక్కుంటూ కన్పిస్తుంది. ఆ వాక్యా ల్లోని సారాంశం ఏమాత్రం ఆవిడకు బోధపడిందన్నదే నా కంతుపట్టని విషయం. అలాంటి పరిస్థితుల్లో ఆవిడ చేత నేను కథనెలా వ్రాయించగలనన్న అధైర్యం నాలో ఆరంభంలో అంకురిం చింది. కాని స్థిరచిత్తుడనయిన నే నా భావాన్ని త్వరలో నేతొలగించుకునిమానవ ప్రయత్నానికి మాత్రమే పాటు బడ టానికి నిశ్చయించుకున్నాను. ఆ రోజు నుంచే మా ఆవిడచేత పత్రికల్ని చది వించటానికి నాంది పలికాను. ఇహ అప్పట్నుంచే నాకు కష్టాలు ఆరంభ మయ్యాయి.

క్రొత్తపత్రిక వచ్చిందంటే చాలు! మా ఆవిణ్ణి వంటయింట్లోంచి బయటికి పంపి ఆవిడ పనుల్ని నేను చేయటం




ప్రారంభించేను. అప్పట్నుంచే ఎన్నడూ లేంది మా ఆవిడ నాపై విసుక్కోవటం ప్రారంభించింది. నాపై భయంతో అపత్రికని తిరగవేస్తుందేకాని అది చదివిన పాపాన పోవటంలేదని నేను గమనిస్తూనే ఉన్నాను. ఆవిడ ధ్యాసంతావంటయింట్లో నేను చేస్తున్న పనులమీదే వుంటుంది. ఆవిడ పత్రిక చదువుతుందా లేదా అని గమనించటానికి నేను అడపా దడపా యివతలికి రావటమూ, ఆ కారణంగా నేను చేస్తున్న పనుల్ని మంటకలపటమూ జరిగింది. ఓ సారి పొయ్యిమీది పాలని గమనించకుండా నేలపాల్జేశాను. మరో సారి కూరను మాడ్చేయటమూ, అన్నం వారుస్తూ నా అరచేతుల్ని బొబ్బ లెక్కించుకోవటమూ, జరిగింది. అదే సమయంలో నేనేంచేస్తున్నానా అంటూ నన్నే గమనిస్తున్న మా ఆవిడ కాస్తా ఆ పత్రికని నేలకి విసిరికొట్టి సుడిగాలిలా వంటయింట్లోకి దూసుకవచ్చి నన్నోదులుపు దులిపి బయటికంపి ఉసూరుమంటూ మళ్ళీ తన పనుల్లో తాను లీనమయ్యేది. ఈ విధంగా మా ఆవిడలో కథాజ్ఞానం కలిగించటానికి గాను నేజేసిన ప్రథమ ప్రయత్నం విఫలమైపోయింది.

యిహ యిది సరియైన పద్ధతి కాదంటూ మరో ప్రయత్నం ప్రారంభించాను. మా ఆవిడకు పనులన్నీ అయిపోయాకగొడ్డులాపడి నిద్రపోటం అలవాటు ముమ్మందు మా ఆవిడ కదలికకుగాను మా యింటి తలుపులన్నింటినీ మార్చవలసి ఉంటుందని భవిష్యత్తు నన్నను క్షణం హెచ్చరిస్తూనే వుంటుంది. అసలే మాది క్రొత్తయిల్లు. అతి త్వరలో నేవున్న తలుపుల్ని పీకేయించి క్రొత్తవి పెట్టించ

వలసి వస్తుందేమోనని నేను భయపడని క్షణాలు అరుదు యిహ అవిణ్ణలా మధ్యాహ్నముపూట నిద్రపోతూ గున్న ఏను గులా ఎదిగిపోవటాన్ని అరికట్టటానికి నిశ్చయించుకున్నాను. దానికో పథకాన్ని ఆలోచించాను.

మధ్యాహ్నం నిద్రపోకుండా ఉండేట్టు ఆ సమయంలో పత్రికల్ని విధిగా చదివేట్లుగా ఏర్పాటుచేసి ఒకే దెబ్బకి రెండు పిట్టలు! అనుకుంటూ అతి సంబరపడిపోయాను. కాని ఆ మండుటెండలో నేను విశ్రాంతిని కోల్పోయి పిల్లల్ని కనిపెట్టుకుని వుండవలసి వచ్చింది. పెద్దవాడసలే పెంకి వెధవ! రెండోవాడు రౌడీవెధవ! యిద్దర్నీ ఓ పట్టాన బుద్ధిగా వుంచలేకపోయాను. ఆ నా ప్రయత్నంలో వాళ్ళు నాచేత నాలుగు చెరువుల నీళ్లని త్రాగించినంత పని చేసేరు.

మా యింటిని మా అమ్మా నాన్నల అనంతరం మా అన్నదమ్ములు పంచుకోగా నా వాటాకో వరండా, పెద్దగదీ, ఓ చిన్నగదీ, దాన్నానుకొని వుండే వంటగదీ వచ్చాయి. ఆ యిల్లు మా కుటుంబానికి ముక్తసరిగా బాగానే సరిపోతోంది. చిన్న గదిని సామాన్లకి, పెద్ద గదిని డ్రాయింగ్ కం బెడ్‌రూంగా వాడుకుంటున్నాం.

యిప్పుడిక్కడ మళ్ళీ చిక్కొచ్చిపడింది. ఆ పెద్దగది కాస్తా మధ్యాహ్నం వేళ మా పిల్లల అల్లరితోనూ వారిపై నే వేసే కేకలతోనూ మార్మోగి పోతుంది ఆ అలజడిలో మా ఆవిడ పత్రికా పఠనము కుంటుపడుతున్నట్టు తోచింది ఎన్ని యిక్కట్లున్నా పడి, ఎన్నిదుముల్నయినా ఎదుర్కొని మా ఆవిడలో పఠనాశక్తి పెంపొందించి కథారచనా జ్ఞానంకలిగించి కనీసం ఒక్క కథనన్నా ఆవిడచేత వ్రాయించకుండా గుండెల మీద చేతులేసుకు నిద్రపోకూడదని శపథం చేసుకున్నాను కదా మరి?

అందుకోసం మర్నాటి మధ్యాహ్నం పూట మా ఆవిడ పత్రికా పఠనానికి భంగం కలుగకుండా వుంటానికని మా పిల్లల్ని వరండాలోకి చేర్చి పెద్ద గది ముందు తలుపుని బిడాయించి ఓ వాలు కుర్చీలో చెరగిలపడిపోయి ప్లాటుకోసం పాట్లుపడసాగాను.

మిట్టమధ్యాహ్నపు ఎండ నిప్పులు చెరుగుతోంది. వేడిగాలులు వీస్తున్నాయి. అరగంటసేపు ఆలోచనల్లో మునిగిపోయి ఓ కథాకల్పనకి నాంది పలికి ప్రక్కకి చూచేసరికి నాకడుపుతరుక్కుపోయింది. చురచుర లాడుతూన్న కటిక నేలపై ఆడుతూ, ఆడుతూనే నిద్రలోకి జారిపోయారు పిల్లలు. మెల్లిగా లేచి ఆ వంక నడిచేను. పెద్దగదిలోనుంచి కాగితాల రెపరెపలు వినిపించేయి. మా ఆవిడ శ్రద్ధగా చదువుకుంటుందంతే చాలునను కుని వరండాలోనే ఓ ప్రక్క నున్న నవారు మంచాన్ని వాల్చి పిల్లల్ని అందు

లోకి చేర్చి మళ్ళీ కుర్చీలో వాలిపోయి ఇందాక మనసులో మెరిసిన కథకి రూప కల్పన చేసుకోసాగాను.

అరగంట గడిచింది. లోపల్నుంచి కాగితాల రెపరెపలు వినిపిస్తూనే వున్నాయి. వరండాలోకి పడమటి ఎండ పోకసాగింది. నిద్రపోతున్న పిల్లల్నిలా ఎండలో వుంచడమెందుకని లేచి ముందుగా చిన్నవాణ్ణందుకుని పెద్ద గది తలుపుని త్రోసాను. ఎదురుగా కనిపించిన దృశ్యాన్ని చూసి నీరుగారిపోయాను అందాకా నేనూ పిల్లలూ పడిన శ్రమా, అంతవరకూ నాక్కలిగిన సంతోషమూ బూడిదలో పోసిన పన్నీరయ్యేయి.

ఎదురుగా మా ఆవిడ ఒంటిమీద కూడా స్పృహలేకుండా గొడ్డులా నిద్ర పోతోంది. ప్రక్కనే పడివున్న పత్రిక లోని పుటలు కాస్తా కిటికీలో నుంచి వస్తూన్న గాలి తెరలకి కదిలి రెపరెప లాడుతున్నాయి. ఉసూరు మంటూ పిల్లల్ని లోనికి చేర్చి కలమూ, కాగితా ల్నందుకున్నాను.

యింటికొచ్చినప్పుడల్లా నన్నూ, నా కథల్నీ మెచ్చుకుంటూ నన్ను ప్రోత్స హిస్తుంటారు నా స్నేహితులు. అదే సమయంలో అక్కడే నిలబడిపోయి వాళ్ళముందే నన్నూ, నా కథల్నీ ఖండించివేస్తూంటుంది మా ఆవిడ. అంత మాత్రాన ఆవిడ నా కథల్ని చదువు తుందా అంటే అదీలేదు. అందువల్ల ఆ విమర్శనల్లో అర్థం ఎంతమాత్రమూ వుండదన్న విషయం నా కొక్కడికే తెలుసు. కనీసం నేను రాసిన కథల్నయినా చదివి ఏదన్నా వాగితే బావుండేది కాని అలా అందరిముందూ పట్టుకుని నన్నూ నా కథల్ని గురించి చులకనగా మాట్లాడటం ఈ మధ్య మరీ ఎక్కువయిపోయింది. అయినప్పటికినీ అదంతా నేను స్పోర్టివ్‌గానే తీసుకుంటూ ఉంటాను.

కాని కొన్ని సమయాల్లో మా ఆవిడ మీద నాకు కోపం పీకలదాకా వస్తుంది. మూడ్‌వచ్చి నేనేదో అలా రాసుకోవ టానికలా కూచుంటానో లేదో మా ఆవి డకి నే నారోజు చేయవలసిన పనులన్నీ వరసగా అపుడే జ్ఞాపకం వస్తాయి. అప్పుడు నన్ను బజారుకు వెళ్ళండంటూ కూచుంటుంది. అప్పటిదాకా కనీసం జ్ఞాపకానిక్కూడా రాని పనులు కాస్తా ఆవిడ కప్పటికప్పుడు అత్యంతవసరాలయి కూచుంటాయి. పెద్ద గదిలోంచి చిన్న గదిలోకి, చిన్న గదిలోంచి వంటగది లోకి కాలుకాలిన పిల్లిలా తిరుగుతూ ఆ బజారు పనులగురించి నన్ను పదేపదే హెచ్చరిస్తూ వుంటుంది. దాంతో నాకు చిర్రెత్తుకుపోయి ఆవిడ్ని కేకలేయటమూ నానా రబసా పడటమూ జరుగుతుంది. ఈలోగా మనస్సులోకి వచ్చిన ప్లాట్ కాస్తా మరుగునపడిపోతుంది. ప్రాయా లన్న ఆస్పిరిదే మటుమాయమవుతుంది కేవలం ఆ సమయాల్లో మాత్రమే నేను

మా ఆవిడ్ని మనస్ఫూర్తిగా ద్వేషిస్తూ వుంటాను.

వారం రోజుల తర్వాతనుకుంటాను మా కుటుంబంలో చనువుగా ఉండే ఓ నలుగురు మిత్రుల ముందు నన్ను విమర్శించింది మా ఆవిడ. నే నావిడ్ని పత్రికలు చదివేలా చేస్తున్న ఏ ఒక ప్రయత్నమో ఫలించి ఆ వారం పత్రికలోనే అచ్చయిన వొకదాన్ని చదివేలా చేసింది. ఆ రచనేమీ బాగోలేదనీ, అలాంటి కథని ఎవరయినా వ్రాయొచ్చుననీ, చివరకు తానయినా వ్రాయగలనంటూ కామెంటుచేసి వంటగదిలోకి విసవిస వెళ్ళిపోయింది. ఆవిడయితే వెళ్ళిపోయింది కాని ఆవిడ పలికిన చివరి వాక్యం మాత్రం నాలో పన్నీటిని కురిపింపజేసింది. నా మిత్రులింకా ఆ పెద్ద గదిలోనే వున్నారనే విషయాన్ని కూడా మరచి ఆవిడ వెనకాలే నేనూ వంటగదిలోకి పరుగుతీసేను

"సరూ! సరూ! ప్లీజ్! నీవు అలాంటిదే ఓ కథ వ్రాస్తావా?" అంటూ మా ఆవిడ పక్కనే పీటేసుక్కూచున్నాను. అప్పుడు మా ఆవిడ అంట్లు తోముతోంది. బయట నా మిత్రులలా కూచుని వుండగా నేను వంటింట్లో కొచ్చి ఆవిడ వెన్ను నానుకుని కూచుని కథ గురించి అడిగేసరికి మా ఆవిడకు చిరాకు పుట్టుకొచ్చింది

"కథాలేదు గిథాలేదు! మీర్సు బయటికి వెళతారా లేదా?" అంటూ గంయ్ మంది. అలా యింటికప్పు ఎగిరిపోయేలా అరిచేసరికి నా తల తీసినట్లయింది. దిగాలుగా లేచి పెద్ద గదిలోకి అడుగుపెట్టిన నన్ను చూచి నా మిత్రులు గొల్లున నవ్వేరు. దాంతో నేను అధఃపాతాళానికి కృంగిపోయేను.

"ఏవిటోయ్? మీ ఆవిడకూడా కథలు వ్రాస్తుందటోయ్! మాకెప్పుడూ చెప్పలేదేవోయ్?" అంటూ నన్ను ఉడికించేరు వాళ్ళు. దాంతో నాకు మంట పుట్టుకు వచ్చింది

"ఆ! కథా? దాని మొహావా? పత్రిక చదవటం చేతనవదు కాని కథలేం వ్రాస్తుంది?" అంటూ విసుక్కున్నాను.

తర్వాత ఓ పదినిమిషాలకి వాళ్ళు వెళ్ళిపోగానే వంటిల్లెందుకో నిశ్శబ్దంగా వున్నట్లు తోచింది. ఆ నిశ్శబ్దంలో నుంచి వెక్కిళ్ళు వినిపించేయి. గభాలున వంటగదిలోకి దూరేను.

"ఏవిటి సరూ!" అంటూ దగ్గరకు తీసుకోబోయాను

"నా దగ్గరకు రాకండి!" నన్ను దూరంగా త్రోసేసింది.

"అసలు విషయం ఏమిటో నాకు చెప్పందే ఎలా తెలుస్తుంది? ప్లీజ్ చెప్పవూ!" దీనంగా ప్రశ్నించేను.

"తెలీదూ? ఎందుకు తెలుస్తుంది?




నేనే చదువుకున్న దాన్నవుతే తెలిసొచ్చేది."

నేను తెల్లబోయాను. ఆ వెంటే మళ్ళీ నాకు విసుగు పుట్టుకొచ్చింది.

"ఏమిటా డొంకతిరుగుడు వ్యవహారం? ఎందుకేడుస్తున్నావో చెప్పకుండా ఏమిటీ ఆగడం?" అన్నాను తీవ్రంగా.

"ఏడుపుకాక నాకు మిగిలిందేమిటి? అనుక్షణం నన్ను చదువురానిదంటూ నలుగుర్లో అవమానం చేసేబదులు నాకింత విషం పెట్టేయండి! మీకీ అడ్డు తొలుగుతుంది," అంటూ ఠక్కున లేచి బాత్‌రూంలోకి దూరింది. దాంతో నా ఆగ్రహం చల్లారిపోయింది. జాలిగా ఆవిడ వెళ్ళినవంకే చూస్తూ వుండిపోయాను. తను నలుగుర్లో నన్ను ఎన్ని మాటలన్నా ఫరవాలేదు కాని, ఆ పని నేనెపుడన్నా చేస్తేమాత్రం అది ఈ రకంగా పరిణమిస్తుంది

అలా ఎన్నో సంఘటనలు జరిగాయి. కానీ నా ప్రయత్నాన్ని మాత్రం మానుకోలేదు

ఆ తర్వాత ప్రతి పనికీ, మా ఆవిడ ప్రతి కోరికకీ తను పత్రికలు విరివిగా చదవాలనే కండిషన్ని పెడుతూ వచ్చాను. అప్పటికప్పుడు అలాగే అంటూ వుండేది. కాని ఆ తర్వాత మళ్ళీ షరా మామూలే!

కొన్నాళ్ళకు మరో ఆలోచన వచ్చింది. తానెలాగూ చదవటంలేదు కాబట్టి ఆవిణ్ణి దగ్గరగా కూచోబెట్టుకుని నేనే కథల్ని చదివి వినిపించటం మొదలుపెట్టేను. అలా నేను చదువుతూన్నపుడు ఏ కాసేపో వినటమూ ఆ తర్వాత కూరమాడిపోతూందనో, చిన్న

వాడు దొడ్లోకి వెళ్ళారనో, బట్టలుతుక్కోవాలనో, యిల్లు తుడవాలనో యిలా నానా రకాల వంకలతో లేచి పోయేది. దాంతో నాలోని కోపం వెర్రి తలలు వేసేది. కాని నన్ను నేనే నిగ్రహించుకునేవాణ్ణి.

నాకు సాధారణంగా రాత్రిళ్ళు ఓ పట్టాన నిద్రపట్టి చావదు. ఏవో ఆలోచనలు నా బుర్రని తొలుస్తూ వుంటాయి. నా ఆలోచనలు పలురకాలు. ఓసారి కథకి ప్లాటుకోసం ఆలోచిస్తుంటాను. మరోసారి వ్రాసినవాటి గురించి ఆలోచిస్తాను. లేకపోతే వ్రాస్తూన్నదాన్ని గురించి ఆలోచిస్తాను. అదీగాకపోతే నాకన్నా ఎక్కువగా కీర్తిగడిస్తూన్న సోదర రచయితలపై ఈర్ష్య పడుతుంటాను. లేదా నేను పోటీకి పంపిన రచనలకి బహుమతులొచ్చినట్టూ, సన్మానాలు జరిగినట్టూ కలలు కంటూ వుంటాను. అవేవీ లేనపుడు అర్ధరాత్రి దాకా వ్రాసుకుంటూ వుంటాను.

అలాంటి సమయాల్లో నన్ను విసిగిస్తూంటుంది మా ఆవిడ.

లైటార్పేయండి ! కళ్ళు మండిపోతున్నాయం"టుందోసారి. "రోజంతా చాకిరీచేసి చచ్చీ చెడి కాస్త పెందరాళే పడుకుందామనే యోగం లేదు." అంటుంది మరోసారి. "ఏం రాతలో నా ప్రాణానికి దాపురించాయి" అంటుందింకోసారి.

యిలాంటి డైలాగులు నాలోని ఓరిమిని నిలువునా పరీక్షిస్తాయి. దాంతో వశం తప్పిన నా ఆగ్రహాన్ని దుపులో పెట్టుకోలేక నిలువెత్తునా లేచి మా ఆవిణ్ణి కేకలేయటమో లేదా కోపాన్ని నిలువునా మ్రింగి కుక్కిన పేనల్లే ముడుచుకుని పడుకోవటమో జరుగుతుంది. నేను చీవాట్లు పెట్టిన రోజున నాకేమో నిద్రముంచుకు వస్తుంది. మా ఆవిడేమో కన్నీళ్ళతో తలగడల్ని తడిపేస్తూ తనని నాబోటి రచయిత కిచ్చి పెళ్ళిచేసినవాళ్ళ పుట్టింటివాళ్ళనీ, నన్ను కన్నందుకు మా యింటివాళ్ళనీ నాకు వినిపించకుండా గొణుక్కుంటూ కడిగేస్తూ తెల్లవారదీస్తుంది. యిహ మర్నాటి ఉదయాన్నే కళ్ళన్నీ వాచిపోయి ఎదురవుతూండే మా ఆవిడ మొహాన్ని నేను చూడలేకపోతూంటాను. ఆ తర్వాత రెండురోజులకుగాని ఆ ఇడివానా, తుఫానూ తగ్గుముఖం పట్టదు.

హఠాత్తుగా ఓ రోజు ఉదయం మా ఆవిడ నన్నాశ్చర్యపరిచింది.

"అలా బజారు కెళ్ళి లైబ్రరీనుంచి క్రొత్త పత్రికల్ని పట్టండి ! చదువుతాను. కాని ఓ షరతు ! మీరు సిగరెట్లు మానేయాలి !" అంటూ కూచుంది.

మా ఆవిడ పుస్తకాలు చదువుతాననేసరికి ఎంత సంతోషం కలిగిందో



నేను సిగరెట్లు మానేయాలనేసరికి అంతే విచారం కలిగింది నాకు మా ఆవిడా, పిల్లలూ కలిసి నా శరీరంలోని గుండెకాయలాంటి స్థానాన్నాక్రమిస్తే నేను త్రాగే సిగరెట్టును నేను నా ఊపిరిగా భావిస్తూంటాను ఆ సిగరెట్టలా నాతో అవినాభావ సంబంధాన్ని పెంచుకుని మా ఆవిడతో సమానంగా నా హృదయ పీఠాన్నధిష్ఠించటంతో మా ఆవిడ కది శత్రువుగా పరిణమించింది ఆ సిగరెట్టు నా శ్వాసకోశాలకి హానిని కలిగిస్తుందని ఆవిడ నమ్మకం. నాచేత ఆ సిగరెట్టుని మాన్పించటానికి ఆవిడచేసిన విశ్వప్రయత్నాల్లో ఏదీ ఫలించక చివరికి నా బలహీనతని కనిపెట్టి నాపై ఈ అస్త్రాన్ని ప్రయోగించింది

ఎంతో ఆలోచించి, ఒకటికి రెండు సార్లు నా చర్యని బేరీజు వేసుకుని చివరికి సిగరెట్టుని మానేయటానికే నిశ్చయించుకున్నాను

ఎలాగయితేనేమి, నేను సిగరెట్లు మానేయడం జరిగింది మా ఆవిడ

కోరిన పత్రికనల్లా లైబ్రరీనుంచి తెప్పిస్తూ వచ్చాను. నా ముందుకూడా మా ఆవిడ శ్రద్ధగా చదువుతున్నట్లే కనిపించేది. కాని పత్రికేదన్నా రాగానే పదిహేన్నిమిషాల్లోనే చదివేసానంటూ నాకందించేది. ఆ పత్రికలో వుండేవి రెండో మూడో కథలేగా ? అందుకే త్వరగా చదివేసినట్లుంది. పైగా చదివే వేగం కూడా పెరిగిందనుకుంటూ సంతోషపడసాగాను నేను.

ఓ రోజు నేను ఆఫీసునుంచి వచ్చే సరికి పత్రికని ముందుగా పెట్టుకుని ఏదో వ్రాసుకుంటూన్న మా ఆవిడ కాస్తా, సిగ్గుపడుతూ వ్రాస్తూన్న ఆ కాగితాన్ని తీసి దాచేసుకుంది. ఆ క్షణంలో నాకు కలిగిన సంతోషం అంతా యింతా కాదు. క్రొత్త పత్రిక తిరగవేస్తుండగా ఏదో ప్లాటు మన స్సులో మెరిసి ఆ ఎమోషన్‌లో విష యాన్ని కాగితంపై పెడుతూ రచన కంకురార్పణ చేసిందనుకుంటూ ఎంతో ఆనందపడిపోయాను. నేను అక్కడి నుంచే ఏదన్నా ప్రశ్నిస్తే ఆవిడ మూడ్ చెడిపోతుందని పక్కకి తప్పు కుని బాత్‌రూం వంక అడుగులు వేసేను.

మా ఆవిడ అపుడపుడూ ఏదో వ్రాసుకుంటూ కనిపించేది

ఆ విషయాన్ని నేను గమనిస్తూ న్నట్లు తెలీనీకుండా జాగ్రత్తపడుతూనే ఆవిడ వ్రాసేదేంటో తెలుసుకోవాలనే కుతూహలాన్ని పెంచుకుంటూ వచ్చేను. నేను బాహాటంగా తెలుసుకో ప్రయ త్నిస్తే మా ఆవిడలోని యిన్షియేటివ్ కాస్తా పోతుందని నా భయం. అందు కని ఆవిడ వ్రాస్తూన్న కాగితాలకోసం చాటుగా యిల్లంతా గాలించేను. కాని ఎక్కడా కనిపించలేదని వాటినంత పకడ్బందీగా ఎక్కడ దాస్తున్నదో నన్నదే నాకంతుపట్టటంలేదు.

అలా కొన్నిరోజులు గడిచేయి. మా ఆవిడ చేస్తున్న ప్రయత్నాలవల్ల ఆమె తప్పక కథ వ్రాయగలదన్న గాఢనమ్మకం నాలో పొదుకుపోతోంది.

ఓ రోజు ఉదయం నే నాఫీసుకు బయలుదేరబోతూండగా పోస్టాఫీసు పాస్ బుక్కుని తెచ్చి నాకందించింది మా ఆవిడ. ఈ మధ్య సేవింగకవుం టులో నుంచి డబ్బు తీయవలసిన అవ సర కార్యం ఏదీ వున్నట్లు నాకు జ్ఞాపకం రావటంలేదు. పుస్తకం అందు కుంటూ ప్రశ్నార్థకంగా మా ఆవిడ వంక చూచేను.

"అందులోని డబ్బుని డిపాజిట్ చేయండి ?" అంది ముసి ముసి నవ్వు లొలకబోస్తూ. పుస్తకం మధ్యలో రెండు వందరూపాయల కాగితాలు కన్పించేయి.

"ఎక్కడివివి?" అదుర్దాగా ప్రశ్నిం చాను.




"ఎక్కడివవుతే మీకేంటి ? ఆ డబ్బుని అందులో జమ వేయించండంతే!" అంటూ గిర్రున వెనుదిరిగబోతున్నదాన్నల్లా జబ్బపుచ్చుకుని ఆపాను.

"ఏవిటా తల బిరుసు ? డబ్బెక్కడిదండీ చెప్పవేం ?"

"యింటి ఖర్చుల్లోంచి పొదుపు చేసాను."

"అదెలా ?" ఆశ్చర్యపోతున్నాను నేను.

"మీరు సిగరెట్టు మానేసినప్పటి నుంచీ ఆ డబ్బు గత మూడు మాసాలుగా మిగులుతోంది. అంతేగాక నేను రోజుకోరకం టిఫిన్ చేసి కట్టిస్తూంటే బాగా తినటానికలవాటయి నా ప్రయత్నం లేకుండానే మీరు హోటల్లో చిరుతిళ్ళు మానుకున్నారు. ఆ బాపతు డబ్బుకూడా గత నాలుగు నెలలుగా మిగులుతోంది. ఈ మొత్తమంతా అలా ఆదా చేసాను." అంది హాయిగా నవ్వుతూ.

ఆ క్షణంలో నాకు మా ఆవిడమీద చెప్పలేనంత ప్రేమ పుట్టుకు వచ్చింది. గభాల్న ఆవిణ్ణి కౌగిల్లోకి తీసుకుని ఎముకలు నలిగేలా అదుముకుని ముద్దెట్టుకుని వదిలేను.

ఆ సాయంకాలం నేనింట్లోకి అడుగు పెట్టగానే ఏదో వ్రాసుకుంటూన్న మా ఆవిడ కనిపించింది. ఎన్నాళ్ళుగానో కుతూహలాన్ని అణుచుకుంటూన్న నేనిహ ఆగలేకపోయాను. మెల్లిగా వెళ్ళి ఆవిడ వెనకాలకి చేరాను. నన్ను మా ఆవిడ గమనించలేదు కాని ఆవిడ

వ్రాస్తూన్న విషయాన్ని చూడగానే నాలోని కుతూహలం కాస్తా కుదుళ్ళ నుంచే తొలగిపోయింది.

ఆదివారం పత్రికలో వచ్చిన క్రొత్త వంటకాల్ని వివరంగా ఓ కాగితంపై కాపీ చేసుకుంటోందావిడ. చిరాగ్గా వెళ్ళి కుర్చీలోకి జారిపోయాను. మా ఆవిడ గభాలున నావంక తిరిగి నన్ను చూస్తూనే తాను వ్రాస్తూన్న కాగితాన్ని దాచుకోబోయింది.

అలా దాచుకోబోయే పద్ధతిని చూడగానే నాకెందుకో అనుమానం వేసింది. వెంటనే ఆవిడ యింతకాలమూ వ్రాస్తూ వచ్చిందేదో తెలుసుకోక తప్పదని పించింది.

"సరూ! లోగడ నీవు వ్రాసిన కథ లిలా పట్రా!" అన్నాను మెల్లిగా.

"కథ లేవిటి? నేను వ్రాయట వేమిటి? నా మొహం!" అంటూ లేచిం దావిడ.

"సరూ! ప్లీజ్ పట్రా! చూస్తాను. తప్పులుంటే దిద్దిపెడతాను" అన్నాను గోముగా.

మా ఆవిడ మౌనం వహించింది. అభిజ్ఞనునయిస్తూనే వెళ్ళి చివరకు ఆవిడ ప్రక్కనే వంటగదిలో తిష్ఠ వేసాను. అరగంటసేపు బతిమిలాడిం తర్వాత మా ఆవిడ తెలిపిన నిజాన్ని వినేసరికి నాకు గంగవెర్రులు పుట్టు కొచ్చేయి.

తను అన్నాళ్ళుగా వ్రాస్తున్నదంతా క్రొత్త పత్రికల్లో వెలువడే రకరకాల క్రొత్తరకం వంటకాల గురించట! తన ఆ వ్రాతలే నాకు రోజుకోరకం టిఫిన్ చేయించి పెట్టగలిగాయట! అందు వల్లనే నేను మా ఆఫీసు బ్రేక్ టైంలో హోటళ్ళకి వెళ్ళడం మానుకున్నానట! అంతేకాని తాను యింతకాలంగా ఏ ఒక్క కథనీ చదివిన పాపాన పోలే దట! పత్రికల్ని లైబ్రరీకి తిరిగి యివ్వాల్సి వుంటుంది కాబట్టి వ్రాసుకో వలసి వచ్చిందట!

అన్ని నిజాల్ని ఒక్కసారిగా భరించలేకపోయాను. యిహ ఆ క్షణాన్నే నా శపథాన్ని ఉపసంహ రించుకోక తప్పింది కాదు. ఎట్టి పరిస్థి తుల్లోనూ మా ఆవిణ్ణి రచయిత్రిని చేయలేనన్న విషయం విశదమై పోయింది. కనకపు సింహాసనమున... అనే పద్యం వుండనే వుందిగా మరి?...







# జోస్యం

**— ఆదూరి వెంకట సీతారామమూర్తి**

శ్యామలరావు ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

అప్పెక్కడ పుట్టించాలా అన్న ఆలోచన అతని మనసును కొరికేస్తోంది. నాలుగువైపులా చూస్తూ నడుస్తున్నాడు_ రోడ్డంట ఎవరన్నా తెల్సినవాడూ, తనకు అప్పు యివ్వదగ్గవాడూ కన్పిస్తాడేమోనని. మార్కెట్టు దగ్గరకు వచ్చేసరికి సుబ్బారావు కన్పించాడు కూరల సంచితో.

"పీడి మొహం! దగ్గరుండేదేంతో పీడి సంచీయే చెబుతోంది" అనుకున్నాడు సగంకూడ నిండని సుబ్బారావు సంచీవైపు చూసి

ఇకిలింపులాంటి నవ్వోటి అతని మొహాన పారేసి, అర్జంటుగా కదిలి

పోయి నాలుగడుగులువేసి ఫుట్‌పాత్ ఎక్కి నిల్చుని జేబులోంచి నలిగి పోయిన ఆఖరి చార్మినార్‌ని తీసి వెలిగించాడు.

ఎండ తీక్షణంగా వుంది.

ఆదివారం పూట మోర్నింగ్ షోకి పోతే సుఖం.

జేబులోని డబ్బుల్ని తడిమి చూసు కున్నాడు. ఒకరవై అయిదు పైసల బిళ్ళా, రెండు తేలికైన పదిపైసల బిళ్ళలూ.

"రండి బాబూ రండి. పదిపైసలకే మీ అదృష్టం తెల్సుకోండి."

అరుస్తున్నాడు ఆంజనేయస్వామి చెట్టుక్రింద చిలకల జోస్యగాడు. జీవి తంలో ముందు జరగబోయే సంఘ టనలు కేవలం పదిపైసలకే అంటే చవకక్కాదూ?

జనం గుమిగూడారు అతగాడి ముందు-క్షణాలమీద అతగాడి ఆర్జన రూపాయి దాటడం శ్యామ్రావు చూస్తూనే వున్నాడు.

"తనకంటే వాడే నయం!" అను కున్నాడు కూడ.

"లాట్రీలు రాకపోతే పోయే యీ పాడు గుమస్తా వుద్యోగం మారి తన కెప్పుడన్నా మంచి వుద్యోగం వస్తుం దేమో కనుక్కుంటేనో, అనే ఆలోచన శ్యామ్రావులో బొరబడింది.

అంతలోనే అతనిలోని మనసు ఒక్క గసురు గసిరింది-

"చిలక జోస్యం నమ్ముతావా? నీకేం బుద్ధిలేదూ?" అని

బుద్ధికి కోపమొచ్చి నేనే లేకపోతే పీడీపాటి వుండేవాడు కాదు అంది- ఆ దెబ్బతో శ్యామ్రావు ఆ వుద్దేశాన్ని మార్చేసుకుని దగ్గరున్న హోటల్లోకి దూరాడు.

అక్కడకూడ తెలిసున్న ముఖం ఒక్కటీ కన్పించలేదు.

మూలగా ఖాళీగావున్న బల్లదగ్గరకు పోయి కూర్చుని డబుల్ స్ట్రాంగ్ టీకి ఆర్డరిచ్చి ఆలోచనలో పడ్డాడు శ్యామ్రావు

కూటికి లేని బ్రతుకు కాకపోవచ్చు కానీ యిబ్బందులు లేని బ్రతుకుమాత్రం కాదు తనది - నాలుగో తారీఖునుండీ డబ్బుకోసం తాపత్రయపడ్డం - మళ్ళీ ఫస్టుకోసం ఎదురుచూడ్డం, కిరసనాయిల్ ఎప్పుడు నిండుకుంటుందో, చంటాడి పాలడబ్బా ఎప్పుడైపోతుందో, రేషన్ ఎప్పుడొస్తుందో-

ఇవే ఆలోచనలు నెలల్లా-

సర్వర్ టీ తెచ్చాడు. నెమ్మదిగా సిప్‌చేస్తూ ఎదురుగా చూశాడు శ్యామ్రావ్. ఎప్పుడొచ్చి కూర్చున్నాడో ఎదురుగా ఓ వ్యక్తి కూర్చున్నాడు. సన్నగా ఎర్రగా ఎర్రబడ్డ జుట్టుతో ఆంగ్లో ఇండియన్‌లా వున్నాడు.

అతగాడు శ్యామ్రావువైపు చూసి స్మాల్‌సైజు నవ్వోటి నవ్వాడు. శ్యామ్రావుకేం అర్థంకాలేదు. అటువంటి వ్యక్తినెపుడూ చూసినట్టు గుర్తులేదు- పరిచయం లేకపోయినా వున్నట్టు నవ్వితే ఆశ్చర్యమనిపించదూ ?

"మీ చెయ్యి ఒకసారి చూడనిస్తారా ?" అన్నాడతడు అప్పటివరకూ ఒళ్ళోపెట్టుకున్న బ్రీఫ్‌కేసును టేబిల్ మీదుంచుతూ-

శ్యామ్రావు కర్థమైంది. సగం తాగిన కప్పును టేబిల్ మీదుంచి చేయి చాచాడు.

ఓ అరక్షణం చూసి, "మీది చాల పిక్యూలియర్ అండ్ కాంప్లికేటెడ్ హేండ్" అని నవ్వి వూరుకున్నాడు.

చెయ్యి వెనక్కు తీసేసుకుని టీ తాగుతూన్నా శ్యామ్రావులో ఆతృత చావలేదు.

సర్వర్ అతగాడికి టీ తెచ్చి యిచ్చాడు. రెండు గుక్కల్లో టీ తాగి పెట్టేసి సిగరెట్ వెలిగించుకుని, డైరీ తీసి చూసుకుంటున్నాడతను.

ఇతనెవరో చూస్తుంటే జాతకాలవాడిలా వున్నాడు. లేకపోతే తన చెయ్యెందుకు చూస్తాడు ? ఎంత అణచుకోవాలనుకున్నా శ్యామ్రావు తనలోని ఆతృతను అణుచుకోలేకపోయాడు.

"మీరింతకీ నా చెయ్యెందుకు చూశారో చెప్పారు కాదు'' అన్నాడు- అతగాడు డైరీ మూసేసి ఒక్క చిరునవ్వు నవ్వి,

"నా వృత్తే అది. కానీ ఎందుకో మీ చెయ్యి కొత్తగా అన్పించి చూడాలనిపించింది. వెరీ నైస్ హేండ్'' అన్నాడు తొణకుండా.

"యేముంది నా చేతిలో ?" ఈ అవకాశాన్ని శ్యామ్రావు జారవిడుచుకోదల్చుకోలేదు.

అంతకుముందు నవ్విన నవ్వు లాంటిదే నవ్వి, జేబులోనుండి తన ఎడ్రసుకార్డు తీసి శ్యామ్రావు చేతికిస్తూ-

"మీకు జాతకాలమీద నమ్మకముంటే సాయంత్రం ఐదుగంటలకు యీ ఎడ్రసుకు రండి - మీ లైఫ్ స్కెచ్ రాసిస్తాను" అని బ్రీఫ్ కేసందుకుని లేచాడు.

"ఎంత ఛార్జి చేస్తారు ?" సంశయిస్తూనే అడిగాడు.

"ఆ విషయం మీ కనవసరం - మీరు రండి" అని నవ్వుతూనే వెళ్ళిపోయాడు.

"విచిత్రంగా వున్నాడే" అనుకుంటూ తన చేతిలోని అతనిచ్చిన విజిటింగ్ కార్డువంక చూశాడు. 'బి. విలియమ్స్, పామిస్ట్‌. అనే అచ్చు అక్షరాల క్రింద పెన్నుతో రాసిన హోటల్ ఎడ్రసు వుంది. రెండోవైపు పర్మనెంట్ ఎడ్రసు ప్రింటుచేసి వుంది.

సాయంత్రంవరకూ చాల ఆలోచించాడు శ్యామ్రావు వెళ్ళాలా వద్దా అని. మధ్యాహ్నం ఓ పది అప్పుకూడ పుట్టడం వల్ల ఓ అయిదు జేబులో వేసుకుని 'వెళ్తే పోలా' అనుకున్నాడు.

హోటల్ రూంలోకి వెళ్లగానే విలియమ్స్ తనకోసమే ఎదురుచూస్తున్నట్లనిపించింది శ్యామ్రావుకి. పలకరించి కుర్చీ చూపించాడు.

శ్యామ్రావుకి మాటలెలా ప్రారంభించాలో అర్థంకాలేదు. విలియమ్సే అన్నాడు. "నాకిప్పుడు అర్జంటు ఎంగేజ్‌మెంట్ తగిలింది—కానీ మీ రొస్తారనే కూర్చున్నాను'' అని. ఓ ఆల్బమ్ తీసి శ్యామ్రావు చేతికందించాడు. అందులో పెద్ద పెద్దవారు విలియమ్స్ జ్యోతిష్కానికి మెచ్చి యిచ్చిన కాంప్లిమెంట్సూ, సర్టిఫికేట్లూ, కొందరి మంత్రుల ఎన్నికల విషయంలో విలియమ్స్ చేసిన సవాళ్ల తాలూకా పేపర్ కటింగ్సు చాలా వున్నాయి.

ఇతనింత ఘనుడా అన్పించింది శ్యామ్రావుకి. పైగా అతనిచే తన ఫ్యూచర్ చెప్పించుకోవాలన్న కోరిక కూడ పెరిగింది-శ్యామ్రావుకి జాతకాలపై నమ్మకం కుదిరేందుకేమో విలియమ్స్ మరికొన్ని విదేశ పుస్తకాలను, తన జ్యోతిష విజ్ఞానాన్ని ప్రదర్శించాడు.

తనతో మాట్లాడుతూనే నాలుగైదుసార్లు చేతి వాచీ చూసుకోడం శ్యామ్రావు గమనించకపోలేదు; అందుకే తను వెళ్ళిపోడానికి తొందరపడి "యింతకీ నా గురించి చెబితే వెళ్ళిపోతాను" అన్నాడు.

విలియమ్స్ నవ్వి, "మీకు లైఫ్ స్కెచ్ వేసివ్వాలనే పిలిపించాను _" అని, ఓ తెల్లకాగితం, స్టాంపింగ్ పేస్టూ తీశాడు.

"మీరెంత చార్జి చేస్తున్నారో చెప్పారు కాదు'' అన్నాడు శ్యామ్రావు భయంగానే - ఆల్బమ్ చూసిన దగ్గర నుండీ అతనికి నమ్మకం యేర్పడ్డమే కాకుండా తక్కువ చార్జి చేసే రకం కాదని తేల్చుకున్నాడు.

"అందరి దగ్గరా పాతికకు తక్కువ పుచ్చుకోను - కానీ మీకు ఫ్రీగానే రాసిస్తా, ఒక్క షరతుమీద.''

''యేమిటో అది?" అనుమానంగా చూశాడు శ్యామ్రావు.

"యేంలేదు - నా ధ్యేయమంతా జాతకంమీద నమ్మకం లేనివారికి నమ్మకాన్ని కలుగజేయడమే. ఆ వుద్దేశంతోనే వూరూరా తిరుగుతున్నాను- నాకీ వూరు కొత్త - కాబట్టి మీ ఫ్రెండ్స్‌లో కొందరిని నా వద్దకు పంపాలి."

తనకెందుకు ఫ్రీగా చేసిస్తానన్నాడో అప్పటికిగాని అర్థంకాలేదు శ్యామ్రావుకి-అయినా అదెంతపని అనుకుని,

అందుకు ఒప్పుకుని చేతి ముద్ర యిచ్చి మైటపడ్డాడు.

వారంరోజుల్లో పూర్తివివరాల జాతకం తేదీల నెలలతోసహా ఎప్పుడేం జరగబోతోందో రాసి యిచ్చాడు విలియమ్స్-

రెండు సంవత్సరాలలో వుద్యోగంలో మార్పునీ, మరో యేడాదిలో మరికొన్ని శుభసూచకాలను చెప్పడంతో విలియమ్స్‌పై శ్యామ్రావుకి నమ్మకమే కాకుండా గౌరవంకూడ పెరిగింది.

అనుకున్న ప్రకారం శ్యామ్రావు ఓ పదిమందికిపైనే విలియమ్స్ దగ్గరకు పంపటంవల్ల విలియమ్స్ బిజినెస్ పెరిగింది.

రెండు సంవత్సరాలు గడిచి పోయాయి-ఉద్యోగంలో తనకు తప్పక మార్పువస్తుందని విలియమ్స్ రాసిచ్చిన గడువు దాటిపోడంతో శ్యామ్రావుకి అపనమ్మక మేర్పడింది-మూడో సంవత్సరంలో జరగవలసిన శుభకార్యాలు కూడ జరక్కపోయేసరికి శ్యామ్రావుకి నిజంగా విలియమ్స్‌మీద కోప మొచ్చింది-ఇంకా తను అందర్లాగూ మోసపోలేదు నయం - అనుకున్నా పూర్తిగా సంతృప్తిపడలేక విజిటింగ్ కార్డు వెదికి తీసి విలియమ్స్ పర్మనెంట్ అడ్రసుకు ఓ ఉత్తరం ఘాటుగా రాసి పారేశాడు – జాతకాలమీద నమ్మకం కుదిరేలా చేసేవాడు చేయవలసిన పని యిది కాదంటూ—

వారంరోజులు తిరక్కుండా శ్యామ్రావు పేర ఉత్తరమొచ్చింది-అది విలియమ్స్ రాసినది కాదు - అయినా ఆశ్చర్యంతో విప్పి చదివాడు.

శ్యామ్రావుగారికి—

మీ ఉత్తరం నన్ను చాల ఆశ్చర్య పరచింది-ఎందుకంటే మా నాన్నగారు ట్రెయిన్ ఏక్సిడెంట్‌లో పోయి నాలుగు సంవత్సరాలైంది. కనుక మూడు సంవత్సరాల క్రితం మీకు జాతకం రాసిచ్చినది మా తండ్రిగారు కాదని చెప్పడానికి సాహసిస్తున్నాను.

మరొక్క సంగతి – మా తండ్రి గారు ప్రముఖ పామిస్టు-యేక్సిడెంట్‌లో పోయిన ఆయన బ్రీఫ్‌కేసు యిప్పటికీ దొరక్కపోవటంవలన ఓ అనుమానం కూడ కలుగుతూంది. ఎవరో ఆయన పేరును, ఆయన కీర్తినీ ఉపయోగించుకుని మిమ్మల్ని మోసంచేసి వుండవచ్చునని—అతని వివరాలేమైనా తెలిస్తే చెప్పవలసింది-మీకు కలిగిన అసంతృప్తికి నేనూ విచారిస్తున్నాను-

—రాబర్ట్.

ఉత్తరం పూర్తిచేసిన శ్యామ్రావు ఓ గంటవరకూ మామూలు మనిషవలేదు.

---




ఆరోజు తనకు వచ్చిన ఉత్తరమూ దాని వెంట జతపరచిన ఫిక్సెడ్ డిపాజిట్ రసీదు, తదితర హంగామా అంతా చూసే సరికి శేషఫణికి తల తిరిగి పోయింది. తను చదివిందీ చూస్తున్నదీ కలా! కల్లా? అనిపించింది.

ఒళ్ళు గిల్లుకున్నాడు. చురుక్కుమంది. కళ్ళు నులుముకున్నాడు. సందేహంలేదు తను జాగ్రదవస్థలోనే ఉన్నాడు. కంటి ఎదురుగా కనిపిస్తున్నది భూతద్దం కాదు. మాయా దర్పణమూ కాదు! ఉత్తరం!

ఛ! ఛ! ఇది ఉత్తరం కాదు. వరం! క్షేమ సమాచారాలు, సుఖ సంతోషాలు తెచ్చేవి మామూలు ఉత్తరాలు. ఇది జీవితాన్ని మార్చేస్తున్న లేఖ దీన్ని.పటం కట్టించి పూజించాలి. ఇంతకీ ఈ ఉత్తరం రాసిన బామ్మగారు ఎక్కడో గ్రూపు ఫోటోలో ఉన్నానంటూ వ్రాసింది. తనీ నలభయ్యేళ్ళ జీవితంలోనూ ఆవిడని

కానీ ఆవిడ ఫోటోకాని చూసిన పాపాన (పుణ్యానికి) పోలేదు.

"కైవల్యా! మీ అమ్మని యిలా పిలు."

ఆలోచనల నుంచి తేరుకుని తన పెద్ద కూతుర్ని కేకేశాడతను. బి ఏ. తప్పి పెరుగుతోన్న వయస్సుకి అడ్డంగా మూడుముళ్ళు వేయించుకోలేక, ఉక్కిరి బిక్కిరి చేసే ఆలోచనలతో మనస్సుని క్షణక్షణమూ తరిమే కోరికల్ని రేకొత్తే కథల నుండీ సినిమాలనుండీ రక్షించుకోలేక మధ్య యింటి గడపనానుకుని ఆ వారం వీక్లీ చదువుతోన్న కైవల్యకి తండ్రి పిలుపు కర్ణకఠోరంగా వినిపించింది.

"ఈ నాన్న ఎప్పుడూ యింతే! బాగా చదువుకునే వేళలో కేకేస్తాడు." అనుకుని పుస్తకం మూసి లేచి పెరట్లోకి వెళ్ళింది. పెరటి గోడ నానుకుని పక్కవాటా మీనాక్షమ్మగారితో బాతాఖానీ వేస్తున్న తల్లిని పిలిపించింది.

"వస్తున్నా పదవే!" అంది ఆమె తలయినా తిప్పకుండా.

"అర్జెంటుగా రమ్మన్నారు నాన్నగారు."

"వస్తానొదినా! మళ్ళీ మాట్లాడదాం" అని ఇటు తిరిగి "వెధవ సంత, క్షణం కూడా కూర్చోనివ్వరు! ఏమిటంట అంత కొంపలంటుకపోయే కబురు" అని సణుగుతూ వస్తున్న భార్యని చూసి "కొంపలంటుకునిపోయే కబురుకాదు అనుపమా, కొంప వెలిగిపోయే కబురు" అన్నాడు శేషఫణి.

ముఖం చిట్లించి "మన బ్రతుక్కి అంత అదృష్టమా?" అందామె.

"ఇదిగో ఈ ఫోటో చూశావా! మన పెళ్ళయిన తర్వాత పడగ్గదిలోంచి సామాన్ల గదిలో అటకెక్కి కూర్చుంది? ఈ ఫోటోలో వున్న వాళ్ళెంత మంది పదహారు? ఈ కూర్చున్న వరుసలో నాలుగో వ్యక్తి మా నాన్నగారు! ఆయన ప్రక్కన్నే వున్నావిడ మా నానమ్మ! ఆ పక్కనుండే పూజ్యురాలు. ఆవిడకి దండం పెట్టుకో ముందు తర్వాత యీ ఫోటోని ఎన్‌లార్జిచేసి పడక గదిలో వుంచుకుని రోజూ పడుకోబోయే ముందూ-నిదురించే ముందూ దండం పెట్టుకోవాలి విధిగా మనం."

"మీ ఊకదంపుడు వద్రలు కదా ఇంతకీ విషయమేమిటో అఘోరించండి."

"మీ ఆడవాళ్ళంతా యింతే! ముందు ఆవేశమేగాని ఆలోచన శూన్యం. ప్రతి దేవుడు చెప్పిన మాటకయినా పాతిక పరీక్షలు చేసిగానీ నమ్మరు. ఇదిగో ఈ ఉత్తరం చదువు" అని అందించాడు

ఆమె కాస్త బిగ్గరగానే చదివింది. "చిరంజీవి శేషఫణికి ఐశ్వర్యాభివృద్ధి రస్తుగా దీవించి మీ బామ్మగారు వ్రాయునది. ఈ బామ్మ ఎవరో అనుకుని కొత్తగా వెలిసిందనీ ఆశ్చర్య పోవద్దు.

నేనూ మీ నానమ్మా ఒకరకంగా తోటి కోడళ్ళం మీ నాన్న నాన్న ఆ యింటికి దత్తు వెళ్ళకముందు మేమంతా కలిసే వుండేవాళ్ళం, తర్వాత వూళ్ళూ, మన సులు దూరంకావటంతో దూరంగా వుండిపోయాం. మీ నాన్న పెళ్ళిఫోటో చూడు. మీ నానమ్మ పక్కనున్న ఫోటో లోని వ్యక్తిని నేనే ఇప్పుడు అసలు విషయమేమిటంటే మా వంశంలో ఒక్క మగ నలుసయినా మిగల్లేదు. అంతా కాలగర్భంలో కలిసిపోయారు. పూర్వీ కుల ముందు చూపు వల్ల బోలెడంత అస్తి మిగిలింది. ఎవరెవరికి ఇవ్వాలా అనే ఆలోచనల్లో అడ్డగాడిదవు నీవు గుర్తొచ్చావు. తినదగ్గవాడివని మా ఆయన వేసిన ఫిక్సెడ్ డిపాజిట్ అరవై వేలూ నీకిస్తూన్నాను దీనికి ఈ కాలంలో ఎంత వృద్ధి అయిందో కూడా తెలీదు. అవసాన కాలంలో ఓ మంచి పని చేద్దా మని లాయర్ని పిలిచి తగిన వాళ్లకి తగినట్టుగా ఆస్తి పంచాను. ఇవన్నీ లాయరుగారితో సంప్రదించే చేశాను. ఇట్లు ఈశ్వరాశీర్వాదాలతో మీ బామ్మ గుండాయమ్మ.

ఏకబిగిన చదివిన అనుపమకు కళ్లు తిరిగినట్లయింది.

"ఇంకో ఉత్తరం కూడా చదువు"

అది లాయర్‌గారు వ్రాసింది. ఆ బామ్మగారు చనిపోయి పదిహేను రోజు లైందనీ, ఆవిడ కోరిక మేరకు పని చేస్తున్న తను చెక్కు పంపుతున్నాననీ రాశాడాయన. చెక్కు చూసింది. అరవై వేలు!

తూలి పడబోయిందామె.

"ఆగాగు! జారిపడబోయే రోజులు ముందున్నాయ్. జరిగితే జరుపుకో. జారితే పడు అన్నారు పెద్దలు. పద! పద! మైల స్నానాలు చేద్దాం" అన్నాడు.

* * *

ఊరంతా ఆ వార్త దావానలంలా వ్యాపించింది.

నిన్న మొన్నటివరకూ కలెక్టరా ఫీసులో హెడ్‌క్లర్క్‌గా ఏడుస్తూ బొటాబొటిగా సంసారం నడుపుకునే శేషఫణి తెల్లారేసరికల్లా లక్షాధికారి అయ్యాడంటే అంతా అసూయపడ్డారు. టౌన్లో కాపురముంటే ఇళ్ళ అద్దెలు ఎక్కువ అనీ, పాలు పెరుగూ ఖర్చు భరించలేననీ సినిమాలూ గట్రా చూడ టము ఎక్కువవుతుందనీ టౌన్‌కి నాలుగు మైళ్ళ దూరంలోవున్న ఆ ఊళ్ళో వుండి సిటీబస్సులో తిరుగుతూ వుంటాడు అతను. పిల్లలు ఇంకా హైస్కూలుస్టేజి దాటలేదు. కాలేజీ వెలిగించిన అమ్మాయి ఎలాగూ తప్పింది. యింట్లోనే వుంటోంది.

అంత పిసినిగొట్టుకి నిత్య దరిద్రుడికి ఐశ్వర్యమా అనుకున్నా రంతా.

మరుసటిరోజు ఆఫీసుకి వెళ్ళేసరికల్లా అంతా అభినందించేవాళ్ళే.

"వెధవది! నేను ప్రతి లాటరీ టిక్కెట్టూ నెల నెలా కొంటూంటాను. ఫస్టు ప్రయిజ్ కాకుండే మానే దాని కటూ యిటూగా వున్న నంబరయినా దొరకదు. గురువుగారు అదృష్టవంతులు. కానీ ఖర్చులేకుండా లక్షాధికారి అయ్యారు" అన్నాడు అతని తోటి సర్వీసు వుండీ యింకా యు.డి.సి. గ వుంటూన్న రమణమూర్తి.

"ఓయ్! అశ్వద్ధ ప్రదక్షిణలు చేసి కడుపుపట్టి చూసుకుంటే అవుతుందా! అదృష్టం అలా కలిసి రావాలి. ఆడద యినా అదృష్టమయినా అనుకోకుండానే లభ్యమవుతారట!" ఇంకో గుమాస్తా వ్యాఖ్యానం.

అంతలో తహసీల్‌దారు భద్రగిరి వచ్చాడు.

"హార్దీ కంగ్రాచ్యులేషన్స్!..." అన్నాడతను పైకి నవ్వుతోన్నా లోపల మంటగానే ఉందతనికి.

"థాంక్స్" అన్నాడు శేషఫణి.

"అందరికీ పార్టీ ఇవ్వాలి" అన్నాడాయన. "ఇలాగయినా కొంత ఖర్చు పనీ" అనుకున్నాడు మనస్సులో.

అందరూ బలపరచారు.

క్షణాలపై ఏర్పాట్లు జరిగాయి. డబ్బు యింకా చేతికి రాలేదు. జీతం రాళ్ళు మొన్ననే అయిపోయాయి. కుయ్యో మొర్రో అంటున్నా వినకుండా రెండొందలు అప్పిచ్చి తెప్పించాడు భద్రగిరి. నోరు మెదపలేదు శేషఫణి.

చూస్తూ వుండగానే రెండు నోట్లు కరిగి తినుబండారాల రూపంలో కలెక్టరాఫీసుని. అలరించాయ్. అభినందనగా కలెక్టరుగారు కూడా మాటాడేరు. తర్వాత ఆర్. డి. వో. "ఇక శేషఫణిగారు! రిటైరయిపోవడం మంచిది. ఇది ఎలాగూ ఎమర్జెన్సీ పీరియడ్! ఏ రోజు ముప్పు ఎవరి నెత్తిపై పడుతుందోఏమో ముందుగానే తప్పుకుంటే మంచిది. పైగా వున్నవాడూ లేనివాడూ వుద్యోగానికి తలపడితేనే ఉద్యోగాలు దొరకటంలేదు డబ్బున్న వాళ్లంతా ఉద్యోగం మానేస్తే నిరుద్యోగ సమస్య మూడొంతులు తీరుతుంది" అన్నాడు.

"ఆయన ఇంకో సంవత్సరంలో రిటైర్ అవుతాడు. ఎన్నో కేసులు ఎంక్వయిరీలో వున్నాయి. అయన ఈ సలహా ఇస్తున్నాడు'' అనుకున్నాడు. శేషఫణి.

తర్వాత ఒక్కొక్కరే "వ్యాపారం ప్రారంభించమనీ, కలెక్టరాఫీసు వాళ్ళకై కో-ఆపరేటివ్ స్టోర్స్ ప్రారంభించమనీ, సిటీ బస్సులో ఎందుకు తిరుగుతావ్ స్కూటర్ కొనమనీ, స్కూటర్ ప్రమాదకరమనీ ఓ మధ్యరకం జీపు కొనమనీ ఇదంతా దుబారా ఎందుకు ఎక్కడయిన పొలాలు కొనమనీ, లాభంలేదు వ్యవసాయం స్వయంగా చేయిస్తేనే అంతంత

మాత్రం గిట్టేది కవులు కిస్తే నాలుగణాల వడ్డీ రాదనీ, వడ్డీ వ్యాపారం చేయమనీ, సినిమాల్లో షేర్లు కొనమనీ, డిస్ట్రిబ్యూషన్ తీసుకోమనీ, ఏదయినా థియేటరు లీజుకు తీసుకోమనీ" ఇలా రకరకాలుగ సలహా ఇచ్చారు.

"వద్దురా భగవంతుడా! ఈ డబ్బు రాకున్నా మానె వీళ్ళ ఈర్ష్యలూ, అసూయలూ చూస్తూవుంటే బస్‌స్టాండులో నుంచొని వచ్చిపోయేవాళ్ళకి తలా పది రూపాయలు దానం చేసి తిరిగి ఒక్క రోజులో మామూలు మనిషినయిపోతే హాయి," అనుకున్నాడతను.

ఇక ఆ రోజు ఆఫీసులో పని సాగలేదు పర్మిషన్ తీసుకుని వెళ్ళి స్టేట్ బ్యాంకులో సేవింగ్స్ ఖాతాకి జమచేయించమని యిచ్చేడు.

నెల నెలా పది రూపాయలు ఆదా చేయటం తప్ప ఎరగని యీ గుమాస్తా గాడు లక్షా ఇరవయివేలు వేసేస్తున్నాడే, యిదేమయినా మిష్టరీనా అన్నట్టు చూశాడు ఏజంటు! ఫార్మాలిటీస్ అన్నీ ముగించుకుని తిరుగుముఖం పట్టాడు. శేషఫణి.

రోజూ వచ్చే వాడయినా అంతా వింతగా చూసేరు బస్సులో. "ఇంకా న్నాళ్ళే మీరు మా బస్సులో వచ్చే యోగం! మహారాజులు ఏదయినా టిప్ యివ్వండి కాఫీ గట్రా తాగుతాం" అన్న కండక్టర్‌కి హోటల్ బిల్లుపోగా మిగిలిన పదీ యిచ్చేశాడు శేషఫణి.

పదిహేను రోజులు గడిచాయి. ఈ రెండు వారాల్లో అక్షరాలా రెండు పదులు యిరవై వేలు డ్రా చేశాడు ఫణి. తప్ప లేదు. ఇన్నేళ్ళ సర్వీసులో బ్యాంక్‌లో నెల నెలా పదో పాతికో నిలవ వేయటం తప్ప ఒక్కనాడూ డ్రా చేసి ఎరగడతను. పెచ్చువడ్డీ చక్రవడ్డీతో పెరుగుతూన్న అప్పులా పెరుగుతున్న కూతుర్ని చూసినపుడల్లా అతనికి బ్యాంక్ ఎకౌంట్ రాక్షసుడిగా ముందు సామాన్యుడిలా కనిపించేది. పెళ్ళికి యీ డబ్బేమవుతుంది అనుకునే వాడు. అలాటిది రెండు వారాల్లో యిరవై వేలు ఖాళీ అయేసరికి అతనికి తల తిరిగిపోయింది.

అయినా అదంతా అతనితో నిమిత్తం లేకుండా జరిగిపోయింది. ఎంత చెప్తూన్న వినకుండా భార్య టౌన్‌కి మార్పించింది కాపురాన్ని, నెల నెలా రెండువందల పాతిక బాడుగ అంటే గుండె జల్లు మందతనికి. అది సామాన్యంగా కొందరి నెల జీతానికి ఎక్కువే! తన మటుక్కి తనకి జీతంలో సగానికి కాస్త తక్కువ అయినా భార్య విన్లేదు. సంవత్సరం అద్దె అడ్వాన్సుగా యిచ్చి పైన చిన్నరూం వేయించింది. ఎవరైనా వస్తే కూచుని మాటాడటానికి అనువుగా వుండాలని ముందుహాల్లో ఓ చిన్న అరగా గది కట్టించింది బాడుగలో జమ చేసుకునే పద్ధతి మీద. ఆ గదిలో సోఫా బెడ్, గాడ్రెజ్ చెయిర్స్, టేబిల్ ఫాన్,



రేడియో ఏర్పాటు చేసింది. పెళ్ళి కొత్తలో కొన్న రేడియో దానం చేసింది ఆఫీసు ప్యూన్ తిమ్మయ్యకి. పనులన్నీ ఫణితో నిమిత్తలేకుండా చేసేస్తుంది ఆమె.

షాపింగ్‌కి వెళ్ళి వచ్చిన రోజు అతనికి కళ్ళు తిరిగినై. ఆ చీరలూ అవీ చూస్తే! ఫోర్ కర్టన్స్‌కి ఖర్చు చేసిన దాంతో ఓ సామాన్యుడి— ఈ డబ్బు రాక ముందు తమలాంటి— యింట్లో పెళ్ళి బట్టలు వస్తాయి తేలిగ్గా. అతనికి తెచ్చిన గుడ్డలు చూసి మూర్ఛపోయాడు. స్ట్రెచ్ లాన్ పాంటింగ్ క్లాత్, జపాన్ శిల్క్ షర్టింగ్, టెరికాట్ పంచాలూ, ఖద్దరు సిల్కు కోటింగ్ చూసి అతనికి తల తిరిగిపోయింది. ఏమీ అనలేకపోయాడు. టైలర్‌కి మూడొందల యాభై కుట్టుకూలి యిచ్చిన రోజు అతని అవస్థ చెప్పతరం కాదు.

"అమ్మో ఏమిటిదంతా?" అన్నాడు ఇంకేమీ అన్లేక.

"ఇదుగోండి! యిక మీదేం సాగదు. ఈ డబ్బంతా యీ యింటి కోడలి ధర్మం. హక్కు నాది. ఇన్నేళ్ళ జీవితంలో నల్లపూసలకి తప్ప నోచుకోలేదు

చేనేత బట్ట తప్ప మరోటి ఎరుగను. బ్రతికి నన్నాళ్ళు బ్రతకను. హాయిగా గడిపేద్దాం. రేపు షాపింగ్‌కి వెళ్ళాలి పదివేలు పట్టండి!"

"అనూ! దీనితో ముప్పైవేలు అవుతుంది తెలుసా."

"అవనివ్వండి యింకా బోలెడుంటుంది" అంది. అంతలో బయట రిక్షా ఆగిన చప్పుడయింది. భార్యాభర్తల మధ్య నిశ్శబ్దం తాండవించింది రెండు క్షణాలతర్వాత హడావిడగ వచ్చాడు శివసుందరం!

అతను శేషఫణి అన్నగారు. ఎక్కడో బరంపురం బార్డర్సులో వుంటున్నాడు. యిల్లరికానికి వెళ్ళిన తర్వాత అతను వీళ్ళని చూడటం యిదే ప్రథమం.

"రా! అన్నయ్యా!" అని ఆహ్వానించాడు.

తెచ్చిన పళ్ళ బుట్టలూ పూలగుత్తులూ స్వీట్స్ అన్ని మరదలి చేతికిచ్చేసి ఆమె యిచ్చిన బ్రూ కాఫీ తాగేసి విశ్రాంతిగా కూర్చున్నాడతను.

"ఒరేయ్ ఫణి! చాలా అర్జంటు. నేను రేపు మధ్యాహ్నం విజయవాడ బస్సుకి వెళ్ళిపోవాలి"

"రాక రాక వచ్చారు ఓ వారమయినా వుండండి."

"వీల్లేదురా! ఆవలెల్లుండి పదింటికల్లా డిపాజిట్ కడితేనే కంట్రాంక్టు దక్కుతుంది. లేకపోతే ఓ నెల్లాళ్ళ వుండాలనే వుంది. అయినా కైవల్య పెళ్ళికి ఎలాగూ రావాలి కదా?" అన్నాడు.

"నీ యిష్టం అన్నయ్యా" అన్నాడు ఫణి.

"ఫణీ!" అతని గొంతులో ఏదో సందిగ్గత.

"ఏమిటన్నయ్యా?"

"నాకో పాతిక వేలు కావాలిరా! మళ్ళీ కాంట్రాక్టు డబ్బు రాగానే యిచ్చేస్తాను"

"............"

"ప్రామిసరీ నోటు కూడా వ్రాసిస్తాను. అన్నయినా తమ్ముడయినా డబ్బు దబ్బే! స్నేహాలు చెడేదీ బంధుత్వం సడలేదీ డబ్బుతోనే. ఎంత మూడు నెలలు కళ్ళు మూసుకుంటే తిరిగి యిచ్చేస్తాను."

"............"

"తోడబుట్టిన వాడివనీ— అదీ అడిగితే లేదనకుండా యివ్వటానికి డబ్బుందనీ అడుగుతున్నాను. ఇప్పుడు నేను డబ్బు కట్టలేకపోతే లక్ష రూపాయలు మునిగిపోతాయి."

"............"

"ఫణీ! ఇన్నేళ్లూ నేను నిన్ను అనుకోలేదు. నిజమే! ఈ రోజు గుండాయమ్మ లాక్మ డబ్బు యిచ్చిందనే వచ్చాను. కాదన్ను కానీ నీవు యిప్పుడవన్నీ మనసులో పెట్టుకుని కాదంటే మా కుటుంబమంతా గంగలో కలవాల్సిందే."

"అన్నయ్యా: అంత మాటెందుకు, తీసుకెళ్ళు. ఎలాగూ నేను రేపు బ్యాంకికి




చెబుతున్నాను. అలాగే డ్రా చేసి యిస్తాను."

"హమ్మయ్య! నన్ను గండం నించి గట్టెంకించి బ్రతికించావు. నీ రుణం యీ జన్మలో తీర్చుకోలేను."

* * *

అతన్ని సాగనంపి వచ్చాక కస్సుమని లేచింది అనుపమ. "అన్నయట అన్నయ్య! ఏనాడయినా ఎర్రని ఏగాని యిచ్చిన పాపాన పోయాడా! ఈ రోజు వచ్చి కల్లిబొల్లి కబుర్లు చెప్పగానే పాతికలక్ష యిచ్చారు. నీళ్లా నూలా జాగ్రత్త చెయ్యండి. అదేం వచ్చేదా చచ్చేదా? అయినా మీకు డబ్బంటే లక్ష్యం ఎందుకుంటుంది. కష్టపడిందా? సంపాదించిందా? ఎవరో పుణ్యాత్మురాలు చస్తూ ఈ బీద సంసారాన్ని గట్టున వెయ్యాలని పంపింది. అయినా మన వన్నీ దరిద్రబ్బుద్ధులయితే ఎలా గట్టెక్కుతాం! ఈ కొంప కంతే!"

"అనుపమా!"

"ఇదుగో నా మాట విని అక్కడెక్కడో కెనడీనగర్‌లో ప్లాట్స్ అమ్ముతున్నారట. రెండు ప్లాట్స్, కొనెయ్యండి. మిగతా డబ్బుతో బంగారం కొనెయ్యండి. చేతిలో ఓ పదివేలుంటే చాలు మన వద్ద యింకా యిలాగే నిలిస్తే చీమల్లా పెరుక్కు తింటారు. చివరికి మన గతి అధోగతే అవుతుంది.''

"అలాగే కానీ అనూ! నాకేం అవసరాలున్నాయ్! అమ్మాయి పెళ్ళి చేసి యీ యిద్దర్నీ చదివించితే చాలు."

''నా గతి ఏమయినా ఫరవాలేదన్న మాట! అందుకే ముందుగానే చెపుతున్నాను. మొన్న కొన్న పంచెండు తులాల నగలూ నాకే! కైవల్యకి మళ్ళీ

కొనండి. ఓ అయిదువేలు ఫిక్సెడ్ డిపాజిట్ చేయండి నా పేర" అంది ఆమె.

అన్నిటికీ తలూపాడతను.

*          *          *

వారం తిరిగే సరికల్లా అయిదువేలు పెట్టి ప్లాట్స్ కొనేశాడు. భార్యపేర అయిదువేలు ఫిక్సెడ్ డిపాజిట్ చేశాడు. పాతికవేల రూపాయలకి బంగారం కొనేశాడు. 'ఇంక పాతికవేలు మాత్రమే' వుంది అన్నాడు భార్యతో.

ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి. "చూశారా! కుళ్లుబోతు లోకం! మనకి డబ్బొచ్చి సరిగ్గా నెల తిరగలేదు. అప్పుడే - లక్షరూపాయలు అయిపోయాయి. అబ్బ! డబ్బుంటేటం కూడా జబ్బేనండీ! ఎంత హైరానా! ఎంత హైరానా! ఇది రాకముందే హాయిగా వున్నామేమో! ప్రతివాళ్లూ బదులడగటమే! ప్రతి వ్యక్తి ఆశించడమే! ఊరికే ఎలా వస్తుందనుకున్నారో ఏమో! చందాలట! చందాలు: ఈ నెలలో అయిదారు వందలిచ్చారు చందాలు మీరు. ఖూనీచేసిన వాళ్లని కుక్కలు వాసన పడతాయట. డబ్బు చేరితే మనుషులు వాసన కొడతారు కాబోలు. ఎక్కడెక్కడి నుంచీ పరిగెత్తుకుని వచ్చి లాక్కెళతారు" అంది.

"అనూ! ఈ లోకం యింతే! డబ్బు చేరదా వాడిని దూరంగా వుంచుతారు డబ్బు చేరిందా వాడిని ఒంటిగా బ్రతక నివ్వరు వెంటాడి వేటాడతారు... ఈర్ష్య... ఈర్ష్య వుంది చూశావూ... అదెంతయినా చేయిస్తుంది. సర్వీసు పాతికేళ్ళు నిండిందని నన్ను రిటైర్ చేయించింది. ఆర్.డి.వో. గారడిగిన డబ్బు బదులివ్వలేదని చేసిన పని యిది. నాకేం పెద్దగా బాధగా లేదనుకో ఎలాగయినా యింకో అయిదారేళ్లకి రిటైర్ కావల్సిందే."

నిర్ఘాంతపోయింది అనుపమ

'డబ్బు సుఖాన్నే కాదు కష్టాన్ని కొని తెస్తుంది' అనుకుందామె.

"మనిషికి కావలసింది తినటానికి పట్టెడన్నం అనుకుంటాం కానీ, అది చాలదు. చేసే వుద్యోగాలతో బ్రతికి హోదాలతో సరితూగే స్టేటస్ కూడా కావాలి మనిషికి అందుకోసం పడరాని పాట్లు పడతాడు. మోసం చేసయినా డబ్బు చేసుకోవాలను కుంటాడు. కానీ యివన్నీ ఒట్టి ఫార్స్; ఎంత చెట్టుకి అంత గాలి తప్పదు! డబ్బొస్తే చాలు అనుకుంటాం కానీ దానితో వచ్చే బాధలు గుర్తించం. ఎన్ని కష్టాలయినా డబ్బుంటే చాలు గట్టెక్కొచ్చనుకుంటాం కానీ, డబ్బుతో వచ్చే కష్టాలని గట్టెక్కడానికి డబ్బు మాత్రం చాలదని తెలుసుకోవేం" అన్నాడు ఫణి.

జవాబు చెప్పలేదు అనుపమ ఆమె మనస్సల్లా యిక ముందు ఎలా అనే ఆలోచిస్తూ వుంది.




"క్రమలా! నివ్వేమనుకోకుండా వుంటే ఓ మాటంటాను..." చప్పున ఆగిపోయాడు శ్రీధర్ ఆమె మొహంలోకి చూస్తూ,

ఆమె తలవంచుకుంది సమాధానం చెప్పలేదు.

శ్రీధర్ తటపటాయించాడు పస్తా యిస్తున్నాడు చెపుదాం చెపుతే యేం? ఉన్నమాట తప్పేమి అనుకో నీ ఏమన్నా అనుకోనీ 'ఊహూ' మళ్ళీ తనలో తానే వద్దనుకుంటున్నాడు నిజమే అనుకో అయినా అంటం యెందుకు చప్పున మనసులో యేమనుకుంటుందో యేమో ఇన్నేళ్ళబట్టీ మాటా పలుకూ

లేకండా వుంటున్నాం. కష్టం సుఖం ఇద్దరం పచ్చుకున్నాం. ఆమెమాట నేనె ప్పుడూ కాదనలేదు నామాటకు ఎప్పుడూ ఎదురుచెప్పనే లేదు అలాంటప్పుడు యీ నాడు ఆమెను నొప్పించటం తప్ప యేమీ లేదు. మెదలకుండా వూరుకుంటేనే సరి పోతుంది అబ్బా! ఊరుకుంటే యెట్లా, నా మనస్సులో మాట ఆమెకు తెలిసే దెట్లా! తప్పక చెప్పి తీరుతాను యేమైనా కాని, వెనకముందూ ఊగిసలాడుతూ ఆమె మొహంలోకి చూట్టానికి ప్రయత్నం చేశాడు.

ఆమె యిట్టే విదిలించుకుని చివాలున లేచి నిలబడింది. భర్త మొహంలోకి కొరకొర చూస్తూ రివ్వున లోపలికి వెళ్ళి పోయింది.

చెపుదామనుకున్న మాట చెప్పక పోయిన యింత రుసరులాడి పోతోందే తీరా చెప్పే వుంటే యింకేమన్నా వుండేదా! అమ్మో యివ్వాళ మూడ్ బాగాలేనట్టుంది. మనం చెప్పకపోవడమే నయం. లేచినవేళ మంచిది. ఇంకా చెప్పాను కాదు. నాకు చప్పున తట్టింది వెనక్కు తగ్గను, నయవే! అమ్మయ్య అంటూ సంతృప్తిగా నిట్టూర్చాడు. రెండు జేబుల్లోనూ రెండు చేతులూ పోనిచ్చి నిటారుగా నిలువుటద్దం ముందు నిలబడి దువ్వెనకు అందనిజుట్టును అతి నాజూకుగా అదుపులో పెట్టటానికి తల అటూ యిటూ తిప్పాడు. ఎంతజుట్టు పెంచినా ముందరపడే తల మాత్రం తెల్లగా మెత్తగానే కనపడుతోంది. మొత్తంమీద షేప్ బాగా దెబ్బతిన్నది. అక్కడ తల మీద ముందుకూడా కొంచెం వత్తుగా జుట్టువుండి వుంటే చాలా బాగా వుండేది. గుండ్రటి మొహం వెడల్పాయిన చెక్కిళ్ళు సన్నటి ముక్కు వీటిమీద జుట్టుకూడ వత్తుగా వుంటే చాలా బాగుం దేది. ఎన్నిరకాల చామిర్లురాసినా ఎంత ప్రయత్నం చేసినా యేం మార్పు కని పించడం లేదు, పరవాలేదులే అను కున్నాడు. ఈ ఒక్క లోపంవలన మన కొచ్చిన ప్రమాదం యేమీలేదులే అని దిలాసాగా తల వూపేశాడు.

చప్పున వాకిట గుమ్మం దగ్గరకు వెళ్లాడో లేదో ఎదురుగా డాబామీద ఆమెగారు రైలింగ్స్ పట్టుకుని అటూ ఇటూ వూగుతూ నిలబడింది. ఆమె చాలా ఆకర్షణగానూ అందంగానూ కని పిస్తోంది. ఆమెను యెంతసేపు చూసినా తనివితీరకుండా వుంటోంది. ఆమెను చూసిన కళ్ళతో కమలను చూస్తే వళ్ళు గంతరిస్తుంది. మహా చిరాకు పడతాడు, తిటతాడు. తనను తిట్టుకుంటాడు. అంతా లోపల లోపలే అనుకుంటాడు గాని పైకి అనలేదు ఆమె వైపే కళ్ళు అప్పచెప్పి నిలబడిపోయాడు. అడుగు ముందుకు వెయ్యలేకపోయాడు ఆమె ఆకట్టేసింది. అతను అట్లాగే నిలబడ్డాడు ఆమె కూడా చిరునవ్వుతో శ్రీధర్ వంకే

చూస్తూ కళ్ళు అటూ యిటూ తిప్పు తోంది. శ్రీధర్ మొహం ఎర్రబారింది. పెదిమలు కదిలినాయి. కానీ, అటూ యిటూ చూసి తత్తరపడ్డాడు. వెనక్కు తిరిగాడు. కమలేమన్నా వెనకాల నిల బడిందేమోనని. ఆమె అక్కడ లేదు రెండడుగులు ముందుకు వేసి తల పైకెత్తి చూశాడు. ఇంతలోనే ఆ వీధి లోకి బర్రున ఓ టాక్సీ వస్తోంది. అతని చూపు డిస్టర్బ్ అయింది. చప్పున ముందుకు నడిచాడు వెనక్కు వెనక్కు చూస్తూ.

మర్నాడు సాయంత్రం షుమారు ఆరు గంటలకు కమల వరండాలో జుట్టు చిక్కు తీసుకుంటోంది.

అస్తమిస్తున్న సూర్యుని కిరణాలు వాకిట్లో మందార చెట్లలోంచి తళుక్కు తళుక్కుమని మెరుస్తూ కమల జుట్టు మీద పడుతున్నాయి. ఆమె కళ్ళు చిట్లిస్తూ జుట్టు చిక్కు తీసుకుంటోంది. శ్రీధర్ వెనకాలే నిలబడ్డాడు. స్పష్టంగా తెల్లటి వెంట్రుకలు తళతళా మెరు స్తున్నాయి. శ్రీధర్ గతుక్కుమన్నాడు. అతను అదివరకు తన మనస్సులో అనుకున్న ఊహలు నిజమయినాయి. నిజమే నా భార్య ముసలిదయిపోతోంది అనుకున్నాడు నిస్పృహగా. ఈ మాటే కమలతో చెపుదామని చాలాసార్లు అను కున్నాడు కాని చెప్పలేదు. తనలో తాను అనుకుంటూ మెదలకుండా పూరు కున్నాడు. ఇద్దరు సరసాలాడుతున్న ప్పుడు యీ మాట సరదాగా అందామను కుని అది సమయం కాదనుకుని పూరు కున్నాడు మరొకసారి అందామనుకొని బయలుదేరుతుండగా తన రూపు అద్దంలో కనిపించింది. మొహం అంతా పీక్కు పోయింది. నుదురుమీద ముడతలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. దవడలు అంటుకుపోయినాయి పెదిమల్లో గేరలు కనిపిస్తున్నాయి, వూడిపోయిన దంతం ఒకప్పుడు స్థావరం యేర్పరచుకున్న ఖాళీస్థలం స్పష్టంగా కనబడింది. ముందు పన్ను ఊగిసలాడుతోంది. మొహం చిట్లించి తల పీక్కుని చప్పున వెనక్కు తిరిగి లోపలికి వెళ్ళి పరుపు మీద పడుకున్నాడు.

రాను రాను కమల మాత్రం చాలా అస హ్యంగానూ వికృతంగానూ కనిపిస్తోంది. ఇంట్లోకి వస్తే సరి భార్యను చూట్టానికి విలవిలలాడుతాడు. ఆమెను చూస్తుంటే సరి పక్కింటి సరిత కళ్ళల్లోకి వచ్చి కూర్చుంటోంది. ఇహ శ్రీధర్ మనస్సు ఊగిసలాడుతోంది. భార్యను చూస్తున్నా డన్న మాటేగాని సరితను చూస్తున్నట్లు గానే వుంది. ఆమెతో మాట్లాడుతున్న ట్లుగా ఊహించుకుంటూ భార్యతో మాట్లాడుతున్నాడు. ఆమె కూడ అడిగిన దానికి ముక్తసరిగా సమాధానాలు చెప్తు తోంది. కాని ఆమె మనస్సుకూడా వికలంగావుంది. భార్య వాలకం ఆయన

ప్రవర్తన చూస్తుంటే కమలకు చాలా ఆశ్చర్యంగా వుంది.

ఈ మధ్యనే ఆయన్ను ఏమేమిటో అడుగుదామని తనకున్న అనుమానా లేమిటో తీర్చుకుందామని అనుకుంది. కాని ఎప్పటికప్పుడు ఏదో ఒకటి అడ్డం రావటం ఆ ప్రశ్న లేమిటో తాను వెయ్యక పోవడం జరిగిపోతోంది. కాని, రోజు రోజుకు మాత్రం కమలమనస్సు క్రుంగి పోతోంది. మహా ఆరాటపడుతోంది. కాని ఏమీ చెయ్యలేకపోతుంది. శ్రీధర్‌లో మాత్రం యేమీ మార్పు లేదు అయితే ఒకరికొకరు బాగాఎడమయిపోతున్నారు.

శ్రీధర్ చాలాసార్లు సరితను బాగా దగ్గరగా చూడటం కూడా తటస్థించింది. ఇంకా ఆయనకు ఆమెమీద ఆప్యాయత అనురాగం యెక్కువవుతున్నాయి. కాని ఎప్పటికప్పుడు ఆమెకూ తనకూ యేమీ సంబంధం లేదని ఆమె యింకొకరి భార్య అని ఆమెను ఆట్టే అట్లా చూడటం కూడా తప్పని శ్రీధర్ మనస్సులో గట్టి గానే నాటుకుంది. కాని ఆమెను చూడందే వుండలేకుండా వున్నాడు. రానురాను ఆమంటే అతనికి చాలా మంచి అభిప్రాయం ఏర్పడింది. అదే కమలతో చెప్పాలని తహతహలాడుతూ వున్నాడు. ఆమె వేసుకున్న డ్రస్సు వేసు కోవాలని, సరిత మాదిరిగా నీటుగా వుండాలని అందంగానూ పడుచుతనంగా వుంటానికి ప్రయత్నించాలని చెపుదామని అనుకుంటున్నాడు. కాని అదెట్లా చెప్ప టమో అర్థంకావటం లేదు. ఎట్లా చెప్పితే బాగుంటుందో ఊహించుకుంటున్నాడు. పొరుగింట సరిత నీకంటె అందంగా వుంటుందీ అని అన్నామంటే చచ్చా మన్నమాటే. దానికి యీ ఆడవాళ్ళు ఎన్నెన్ని అర్థాలైనా చెస్తారు. వాట న్నింటికి సమాధానాలు చెప్పలేక సతమత మయిపోవాలి. ఆమె మంచి డ్రస్సు వేసు కుంటుంది అనంగానే నేమాత్రం వేసుకో వడం లేదా అని చప్పున అనేస్తుంది. అదీ నిజమే. ఆమె ఎప్పుడూ తన శరీరాన్ని నాజూకుగా అందంగా వుంచుకుంటూ, వున్న వయస్సు కంటె తక్కువ వయస్సుదాని మాదిరిగా కనిపిస్తుంది. ఇట్లా అన్నా కూడ తంటాయే. నాకీ నట నలు రావు. యీ భేషాలు అంతకంటె యిష్టంలేదు. అనేస్తుంది. ఏమైనాగాని సరిత కమలకంటె అందంగా వుంటుంది అనే భావం కలిగేట్లు చెప్పాలి కాని ఆ పక్కింటావిడ నీకంటె అందంగా వుటుంది అని నేను అనుకున్నాననే భావన కమలకు కలగకూడదు. మరి యిది యే విధంగా చెపితే బాగుంటుందా అని ఆలోచిస్తూ చాలా తపన. మధన పడుతున్నాను. నాలుగైదు రోజుల్నుంచి ఆ భావంతో దానికి తగిన మాటలతోనూ కుస్తీ పడుతున్నాడు. కాని పాలు పోవడంలేదు, తెమలటంలేదు. అన్నీ సందేహాలే, అన్నీ అనుమానాలే. దీంతో మరీ బాధపడుతున్నాడు.

ఆనాడు సాయంత్రం ఆరుగంటలకు మామూలుగా వరండాలో కూర్చుని సన్నజాజులు గుచ్చుతోంది కమల, ఆమె మొహంలో చిరునవ్వు తాండవ మాడుతున్నాయి. శ్రీధర్ యిట్టే పసి కట్టేశాడు. ఇది మంచి సమయం అను కున్నాడు. తన మనస్సేమిటో చెప్పేద్దా మనుకున్నాడు. ఇప్పుడు యే మాటన్నా పెడర్థం చెయ్యదు నా మాట వింటుంది నా కోరిక తీరుతుంది. నామనస్సు కుదట పడుతుంది. అనుకుంటూ చెంగుచెంగున వచ్చేశాడు.

కమల చప్పున తలెత్తి చూడంగానే శ్రీధర్ కనిపించాడు. మొహం చిట్లించి తల వంచుకుంది. మళ్ళీ తనలో తాను సమాధానపడింది గామాయి చిరు నవ్వుతూ తల పైకెత్తి శ్రీధర్ కళ్ళ లోకి చూసి నవ్వింది. శ్రీధర్ ఉలిక్కి పడ్డాడు.

"బట్టతల పోగొట్టటానికి ఓ తైలం ఎడ్వర్టైజ్ చేస్తున్నారు మీరు చూశారా." సన్నజాజులు గుచ్చుతూనేవుంది కమల.

"ఆ!..."

"దవడలు పీక్కుపోయి నుదురు మీద మడతలు పడుతుంటే కూడా డాక్టరి దగ్గరకు వెళ్ళరే మీరు..."

ఆ! ... రెండు చేతుల్తో బుగ్గలు తడుముకుని నుదురు పైకి ఒకటూ ఊగిం చాడు.

"ఈ తెల్లజుట్టుకు మందులేదు.ఏదైనా పట్టించారంటే తెల్లజుట్టల్లా రాగి జుట్టవు తుంది..." పకపక నవ్వుతూనే వుంది కమల. సన్నజాజుల దండా పొడుగవు తోంది.

"ఆ!..."

"మీరేమీ అనుకోకుండా వుంటే నేనో మాట అంటాను...

పెదిమలు చిట్లించి నవ్వాపుకుంటూ "మీరు బాగా ముసలివారయిపోయా రండీ..."

"ఆ!..." శ్రీధర్‌కు మూర్ఛ వచ్చి నంత పనయింది. తలమీద కుడి అరి చెయ్యి పెట్టుకుని దభాలున కూర్చు న్నాడు.

కమల పుచ్చిపోయిన పూలను విడి లిస్తూ మంచి పూలను ఏరుతోంది.

"ఏమండో... ఆ సరిత మొగుణ్ని చూశారా ఆయనకు మీ వయస్సే ఉంటుంది. ఆయనెట్లా వున్నాడో చూడండి... నిజంగా మీకంటె చాలా అందంగా వుంటాడు... ఏమంటారు," అంటూ చప్పున వెనక్కు తిరిగింది.

శ్రీధర్ తల వంచుకుని మెదలకుండా ఒక్కొక్క అడుగేవేస్తూ గడపదాటాడు.

కమల పకపక నవ్వుతూ నేనెగ తాళికి అన్నానండోయ్... నిజమను కున్నారేమిటి కొంపతీసి..." బిగ్గరగా అరిచింది.



# చక్రపాణి

కావిలిపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

"లేదు. నిజం చెబుతున్నాను. అవ్వాళ నాకు చాలా కోపం వచ్చేసింది. భోజనం మానేసి అలిగి ఏడుస్తూ పడుకున్నాను. నాకెవరున్నారు? తల్లా! తోబుట్టువులా? అనాన్నే ఓదార్చబోయారు. నేను బాగా చదువుకోవాలనీ, ఇంకేవేవో అనునయ వాక్యాలు పలుకుతూ నా తల ఆప్యాయంగా నిమురుతూన్న ఆతని చేతిని విసురుగా వెనక్కి తోసి, "నాకేం మీరు చెప్పక్కర్లేదు. నేనింక చదువుకోను వాళ్ళింటికి నన్ను పంపించెయ్యండి నేను బోర్డింగ్ స్కూలికి వెళ్ళను" అన్నాను.

ఆయన పకాల్న నవ్వారు "ఇంక వారింట్లో ఉండవలసినదానవే తల్లీ! కాని మీ మామగారు ఈదేరని ఈ ఎల్లి

మా ఇంటికెందుకు? చదివించు అని చెబితే నేను ఏం అంటాను చెప్పు? అలా కాదు తీసుకుపోండి అనగలనా?" అన్నా రాయన.

"తర్వాత? అలా ముక్క ముక్కలుగా ఆగి ఆగి కాక పూర్తిగా చెప్పేయ్ అన్నాడు పాణి.

చిన్న శబ్దమయ్యేలా నవ్వి "తర్వాత నా పెళ్ళి భర్తా, అత్తవారూ వారి ఐశ్వర్యం గురించి ఆలోచిస్తూ చదువు మీద అశ్రద్ధచేశాను. ఓ రోజు మా మేడమ్ బాగా తిట్టింది. "నీకు మొగుడు మీద ధ్యాస పుడితే చదువు మానేసి వెళిపో. అంతేగాని ఇలా పరధ్యాన్నమైతే సహించను. అంటూ చదువుమీద మనస్సు లగ్నం చెయ్యడానికి ప్రయత్నించేదానను క్రమంగా. తరుచుగా నన్ను చూడటానికి వచ్చే నాన్న ఒక సంవత్సర కాలం రావడం మానేశారు. అప్పుడప్పుడు ఉత్తరాలూ మనియార్డర్లూ వస్తూండేవి. ఆయన్ని చూడాలని ఉందనీ రమ్మనీ ఉత్తరాలు వ్రాసేదానను దానికి జవాబుగా ఏదో సాకు వ్రాసి ఇప్పట్లో రాలేనని వ్రాసేవారు. డబ్బుకూడా చాలా తక్కువ పంపించేవారు. నా కనీసపు ఖర్చులకు కూడా చాలేదికాదు అంటే అప్పుడప్పుడు అక్కడ తిండి బాగుండక హోటల్లో ఏమన్నా తినేదానను. ఇహ అలా తినటానిక్కిడబ్బు మిగిలేదికాదు. పుస్తకాలా, కొబ్బరినూనె, సబ్బు వీటికే సరిపోయేవి కాదా డబ్బు

అప్పట్లో ఒకసారి... ఒకసారి... చెప్పనా! వద్దా! అన్నట్టు ఆగిపోయింది పద్మావతి.

"గొప్ప సస్పెన్సు సుమీ! చంపేస్తున్నావు అప్పట్లో ఒకసారి?"

"అబ్బ ఏమిటండీ! ఓసారి కాదు. ఓ రోజు మా మేడమ్ నీకు సిగ్గు బిడియం లేవు. గాడిదలా ఎద్దులా అని..."

"అని..."

"మందలించింది."

"ఎందుకు?"

"వల్లెవాటు వేసుకోలేదని."

"ఓ..."

నాకు చాలా కోపం వచ్చింది కాని ఏంచేస్తాను. మా నాన్ననీ మిమ్మల్నీ అందర్నీ కసిగా తిట్టుకున్నాను.

"మంచిపని చేశావ్."

నవ్వింది పద్మావతి.

"ఈ అప్పుడు ఏం చేశావు! ఆమెను కొని ఇమ్మన్నావా?"

"అంతే చేశానులెండి. నా చేతి బంగారు గాజులు తీసి టేబిలుమీద పెట్టి ఇవి అమ్మించి డబ్బు తెప్పించండి, వేసుకుంటాను అన్నాను రోషంగా.

ఆమె చిన్నగా నవ్వి, మీ నాన్నని డబ్బు పంపమని వ్రాయి. నేను తెప్పించి ఇస్తాలే. గాజులు తియ్య. మీ నాన్న వచ్చాక నాకు తిరిగి ఆ డబ్బు ఇచ్చే

ద్ధవుగాని, అందానె జాలిగా, నా వైపు చూస్తూ. సరిగ్గా ఆ రోజే మా నాన్న వచ్చారు. నన్ను చూస్తూనే ఆయన కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. గబగబా కళ్ళు తుడుచుకుంటూ బాగున్నావా అమ్మా అన్నారు." ఈసారి పద్మావతి గొంతు రుద్ధమైంది. ఆనాటి తండ్రిరూపం కనుల ముందు మెదిలి ఆమె హృదయం బరువెక్కి కళ్ళల్లో నీరు తిరిగింది. ఓ క్షణం మాట్లాడలేకపోయింది. అతను బరువుగా తల వంచాడు.

"అప్పుడు మా నాన్న చాలా చిక్కిపోయినట్లు కనుపించారు. విషాదంగా ఏదో చాలా విచారంతో దిగులుగా కూడా ఉన్నట్టు కనుపించారు. మీరేం అలా ఉన్నారు? ఆరోగ్యం బాగుండలేదా?" అని ఆత్రతగా కలవరంగా ప్రశ్నించాను.

ఆయన తేలిగ్గా నవ్వేస్తూ, లేదమ్మా ఈ మధ్య వారంరోజులు జ్వరం పడ్డాను. వస్తానుండు. అని వెంటనే వెళ్ళిపోయారు.

ఆయన మళ్ళీ వస్తారో రారో. వల్లె వాట్ల సంగతి బిడియంతో చెప్పలేకపోయానే అని మదనపడసాగాను. కాని అరగంట తర్వాత నాలుగు వాయిలు వాణీలూ, ఏభై రూపాయలూ తీసుకువచ్చి నాకిచ్చారు. మా అత్తవారంతా బాగున్నారా? అని అడిగాను. బాగున్నారు. అని పొడిగా జవాబు చెప్పి మరి నిలవకుండా వెళ్ళిపోయారు. ఆయన్ను వెనక్కి పిలిచి సెలవుల్లో ఓసారి వారింటికి నన్ను తీసుకొని వెళ్ళండి, అని అడగాలనుకున్నాను. కాని ఆయన్ను పిలకలేకపోయాను. నా పెదవులు విడలేదు. అదేమిటో సిగ్గు" అని మౌనంగా ఉండిపోయింది పద్మావతి.

బరువుగా, బాధగా ఉన్న ఆ నిశ్శబ్దాన్ని చెదరగొట్టాలనే ఉద్దేశంతో, "వల్లెవాటుతో, కథ సరా!" అన్నాడు నవ్వుతూ.

"అబ్బే ఇది సీరియల్. ముగింపు మీ చేతుల్లోనే ఉంది," అని తానూ చిన్నగా నవ్వి,

"స్కూలు ఫైనలయిపోయింది. నాన్న నన్ను తనతో తీసుకుపోయారు. అయితే ఆయనకేం ఇల్లా! వాకిలా? డ్రామా కంపెనీవారితోనేగా ఉండేది. అక్కడ అంతా ఆడా మగా కలసి ఉండేవారు. నేను వేరే గదిలో ఉంటూన్నా నాకా వాతావరణం నచ్చేది కాదు. నన్ను మా నాన్న అత్తవారింటికి ఎందుకు దిగబెట్టరో. వెళ్తానంటే ఇవ్వాళ రేపూ అని ఎందుకు గడువులు పెడుతున్నారో అర్థమయ్యేది కాదు. ఆయన మానసికంగా ఏదో తీవ్రమైన గాయానికి గురయ్యారులా ఉంది. తాగుడూ వగైరా వ్యసనాలకి బాగా అలవాటు పడిపోయారు ఆ ఇంట్లో పంజరంలో

చిలకలా విలవిల లాడిపోయేదానను. ఆ వాతావరణంనుంచి తప్పించుకుని మీ ఇంటిని చేరుకోవాలనే తహతహనాలో హెచ్చింది. ఆరోజు...ఆ రోజు..." మళ్ళీ ఆగింది.

రెండు క్షణాల తర్వాత "ఊఁ చెప్పు నేను నీలా అడుగడుగునా అడిగించు కున్నానా? నా కథంతా ఏకబిగిన ఆగ కుండా చెప్పేశాను. అలా చెప్పాలి. కానీ...ఇలా టైము వేస్తుచేస్తే ఎలా?" అన్నాడు పాణి.

"ఆరోజు ఎలాఅయినా మీ ఇంటికి నన్ను దిగబెట్టమని నాన్నని గట్టిగా అడగాలని నిర్ణయించుకున్నాను. ఆయన ఉదయం ఏడుగంటలకే తయారవు తున్నారు ఎటో వెళ్ళిపోవాలని. నేను ఆయన దగ్గరగా వెళ్ళి నిల్చుని, నన్ను ఇవ్వాళ మాఅత్తవారింటికిదిగబెట్టండి'', అన్నాను. అప్పటికే ఏవో అవసరాలనీ అప్పులనీ నా వంటిమీద బంగారమంతా కరిగిపోయింది. తర్వాత. "రేపు అలానే వెళ్దాం. అని నన్ను తప్పించుకు వెళ్ళి పోబోయేరు." లేదు నన్ను నా భర్త దగ్గర కివ్వాళే దిగబెట్టాలి అన్నాను, ఇంచుమించుగా ఏడుస్తూ.

"నీ వంటిమీద నగలు కొన్నాక తప్పకుండా పంపించేస్తానమ్మా అన్నా రాయన. ఫర్వాలేదు. వారికి నేనేదో చెప్పుకుంటాను, నన్ను పంపించెయ్యండి. ఇంక ఈ ఇంట్లో నేను ఉండలేను." అన్నాను నేను. ఆయన ఎంత బ్రతిమి లాడి అనునయింప చూసినా నేను, ఈ రోజే మా అత్తవారింటికి దిగబెట్టి య్యండి, అని మొండిగా పట్టుపట్టాను. ఆయన్ని ఇల్లు కదలనివ్వలేదు అప్పుడు మా నాన్న...మా నాన్న..."

'ఆ మీ నాన్న ఏమిటి చెప్పారు?"

"మీరు మతిచలించి ఎటో పారి పోయారనీ, మీ నాన్నగారు పోయారనీ, నాకు అత్తవారింట ఇంకేమీ మిగిలి లేదనీను."

''నమ్మావా?"

''నమ్మక ఏంచెయ్యాలి? దిగే భ్రమలో కొంచెంసేపు అలా ఆయన వైపే చూస్తూ శిలలా ఉండిపోయాను. నా ఆలోచనలన్నీ స్థంబించిపోయాయి. తర్వాత విధినీ, నా దురదృష్టాన్నీ తిట్టుకొని ఏడ్చాను. ఆ షాక్‌తో ఆరు నెలలు అనారోగ్యంతో హాస్పిటల్లో ఉన్నాను. అప్పుడు మా నాన్న నా మంగళసూత్రాలుకూడా అమ్మేశారు డబ్బుకోసం.

కంటికివచ్చి కోలుకున్నాక మళ్ళీ నాకు పెళ్ళిచెయ్యాలనే ప్రయత్నంలో నాన్న ఎన్నో సంబంధాలు, వర్ణాంత రాలు కూడా తీసుకువచ్చారు. చాలా మంది నన్ను పెళ్ళిచేసుకోవడానికి ముందుకి వచ్చారు. మా నాన్న నన్ను బ్రతిమిలాడీ, అనునయించీ, మంద లించీ, ఎన్నోవిధాల పెళ్ళిచేసుకు వెళ్ళి

పెమ్మనీ, అతనికి నానుంచి వెంగ తొలగించమనీ ఓ రకంగా ఏడ్చారు. నేను సమ్మతించలేదు. నాకు జీవితం మైన అదొక రకమైన విరక్తి ఏర్పడింది. తర్వాత నాకు ఉద్యోగ ప్రయత్నాలు చేసేవారు. కాని ఏమీ ఆ అవకాశం దొరకలేదు. ఆయన ఆరోగ్యం క్రమంగా క్షీణించింది. మొండిగా తిరిగేసేవారు. అనుకోకుండా ఓ రోజు హఠాత్‌గా గుండెనొప్పి వచ్చి పోయారు. తర్వాత కథ మీరు విన్నదేగా!"

"బాగుంది. నేను చచ్చిపోయానని చెప్పి నీ పసుపు, కుంకుమలు చెరపడం ఇష్టంకాక, నేను గుడ్డివాడిగా బ్రతికి ఉన్నాననీ చెప్పలేక పిచ్చివాడినై పారి పోయానని చెప్పారు మీ నాన్న. మళ్ళీ మనిద్దరికీ వేరువేరుగా పెళ్ళిళ్ళు చెయ్యా లని మీ నాన్న, మా నాన్న ప్రయత్నిం చారు. కాని దైవికంగా జరగలేదు" అని నవ్వి "పద్మావతీ! నీకూ్కడా నన్ను తిప్పడానికి అసహ్యమనిపిస్తూందా? కొన్ని రోజులుగా నువ్వు వంటరిగానే తిరుగుతున్నావు?" అడిగాడు.

"నాకేం అసహ్యం కాదు. నేను మీ భార్యనని చెప్పడం, మీ స్టేటస్‌కి భంగ మని మీకే నేనంటే అసహ్యం."

"అందరికీ తెలిసిపోయేలా వేషం వేసేశావుగా. ఇంక నేను చెప్పడం దేనికి?"

"మీ చెల్లెలికి వ్రాశారా?"

"వచ్చాక ఒక్కసారిగా అంతా చెప్పాలని వ్రాయలేదు. కాని అవ్వాళ మనింట్లో దొంగపడటం, నిన్ను పొడిచి పారిపోవటం, ఏదన్నా కుట్రతో జరిగిం దంటావా?"

"కుట్రతో జరిగినదే!"

అదరిపడ్డట్టయి, "మనని చంపాలను కునే వాళ్ళున్నారా పద్మావతీ? నీకెలా తెలుసు?" అడిగాడు.

ఆ రోజు రంగారావు భార్యతో అనే మాటలు తను వినడం! సింహాచలంనూ, ఇంకా ఇతర చిన్న ఉద్యోగులనూ దబ్బిచ్చి తానెలా వివరాలు సేకరిం చిందీ, అన్నీ చెప్పి, "ఏదో జరిగి పోయింది. ఎవరికీ ఈ సంగతులు చెప్పకూడదు. మీ మనస్సులోనే దాచు కోవాలి", అంది పద్మావతి.

"ఏదీఒకసారి నీచేతిని ఇలా ఇయ్యి" అంటూ ఆమె చేతిని రెండు చేతుల్లో పట్టుకొని థాంక్సు నిన్నెలా అభినందిం చాలో ఎలా కృతజ్ఞతలు తెలుపుకోవాలో నాకు తెలియదు పద్మావతీ! కాని ఆ కత్తుల బోనులాటి రంగారావింట్లో నువ్వు ఇంతకాలం ఉన్నావనుకుంటే భయంతో నా గుండెలు పిడచగట్టుకు పోతున్నాయి. నువ్వు పులినోటినుంచి బయటపడి మళ్ళీ నాకోసం బ్రతికి వచ్చి నట్టు ఆనందంగానూ ఉంది. థాంక్స్, మెనీ మెనీ థాంక్సు" అంటూ ఆమె చేతిని ఊపి వదిలేశాడు పాణి

"మరి వెళ్దామా ?"

"పద పోదాం" అనిలేచి నిల్చున్నాడు పాణి.

అతని చేతిని అందుకొని కారు వరకూ నడిపించుకు వెళ్ళింది పద్మావతి.

ఫ్రెంట్ సీట్లో కూర్చున్న పాణివైపు చూసిన పద్మావతి. తన మనస్సు ఇతని కెలా వ్యక్తం చెయ్యాలి. భార్యగా అతన్ని అనుసరిస్తాననీ, తనను స్వీకరించమనీ ఎలా చెప్పాలి ?! నీనుంచి నేనేమీ కోరను. స్నేహితుల్లా ఉందాం. అంటూన్న అతని ఉద్దేశ్యమేమిటో ? ప్చ్! ఏమిటో నా జీవితమే ఓ ముళ్ళ బాట అనుకుని బాధగా నిట్టూర్చింది.

* * *

పద్మావతి నాకు నగలెందుకు ? అని వద్దంటూన్నా ఈ ఇంటి కోడలివనీ పాణి భార్యవనీ అందరికీ తెలిసిపోయింది. అలా ఉత్త పసుపుతాడు కట్టుకుని ఉండటం బాగుండదు, అంటూ మెడలోకి బంగారుతాడూ, గొలుసూ, చేతులకు నాలుగు జతల బంగారు గాజులూ పాణిచేత కొనిపించింది అన్నపూర్ణమ్మ. మంచి మంచి చీరలూ తెప్పించింది.

పద్మావతి మునపటిలానె పాణిని సినిమాలకూ, షికార్లకూ తీసుకు వెళుతూంది. వ్యాపారవిషయాలు చూస్తూంది. కాని ఇదివరకటి చురుకుతనం, చిలిపితనం లే విప్పుడు. గంభీరంగా, సూటిగా, తప్పితే నిష్ఠురంగానే మాట్లాడుతూంది.

ఓ రోజు రాత్రి పాణి వంటరిగా గదిలో ఉన్నప్పుడు 'ఏరా ! పద్మావతి ఎక్కడికెళ్లింది !" అని అడిగింది అన్నపూర్ణమ్మ. కావాలని పదిగంటలవేళ అతని గదిలోకి వెళ్లి, పాణీ, పద్మావతీ వేరు వేరు గదుల్లో నిద్రపోవడం సహించలేకపోతూందామె

"ఎక్కడికి వెళ్తుంది ఇంతరాత్రివేళ ? పడమటి గదిలోనిద్రపోతూ ఉంటుంది" నవ్వాడు

"ఎన్నాళ్లు ? ఈ వేరు వేరు గదుల్లో పడకలు ?"

"దయచేసి ఇలాటి విషయాలు మాత్రం నన్ను ప్రశ్నించకు అత్తయ్యా. అస్సలు జోక్యం పెట్టుకోవద్దు."

"బుద్ధి గడ్డితిని అడిగాన్లే..."

"క్షమించు. నేను నీకేమీ చెప్పలేను"

ఆమె విసురుగా ఆ గదిలోంచి వెళ్ళిపోయింది.

"మంచంమీద మఠంవేసుకుకూర్చుని క్రాపు గుప్పిటతో పీక్కున్నాడు పాణి. తానేం చెయ్యగలడు. ఆమెను భార్యగా ఎలా చేరదియ్యగలడు. ఆమె తన గదికి వస్తుందనీ, తన పక్కలో చోటు చేసుకుంటుందనీ ప్రతి రాత్రీ ఆశగా ఎదురుచూస్తున్నాడు. ఆమె

కాస్సేపు కూర్చుని ఏమన్నా మాట్లాడవలసిన విషయాలుంటే మాట్లాడి గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోతూంది. నోటితో తన కోరిక వివరించలేదు. కన్నులుంటే ఆమెను క్షణాల్లో తన స్వంతం చేసుకునేవాడు. తను ఆమెను చూడలేదనీ, ఆమె ఉన్న చోటికి వెళ్ళి ఆమెను స్పృశించలేదనీ ఆమెకు తెలును. ఆమెకే అలాటి ఉద్దేశ్యముంటే నన్ను భర్తగా అంగీకరించి మనస్ఫూర్తిగా కోరుకుంటే, దూరంగా తప్పుకు తిరగదు. దగ్గరలో నా పక్కలో చోటు చేసుకు కూర్చునో, నా తల స్పృశించో లేక ఇంకా ఎలా అన్నా తన కోరికనూ, ఇష్టాన్నీ వ్యక్తంచేసేది. లేదు, పద్మావతికి నేనంటే ఇష్టంకాదు. కేవలం ఆమెకు నా మీద ఉండేది జాలి, సానుభూతి. ప్రేమా, అనురాగం లేవు అనుకుని బాధగా బరువుగా నిట్టూర్చాడు.

* * *

"ఎందుకు స్టేషనుకి కారు పంపించారు?" అడిగింది పద్మావతి పాణిని.

"మా శశి వస్తూంది."

"ఉత్తరం వ్రాసిందా? నాకు చెప్పలేదే?"

"లేదు, వైరు వచ్చింది. గుమస్తా చదివి చెప్పాడు."

"శశి ఫలానారోజు వస్తుందని తెలియకపోయినా, ఆమె వచ్చేరోజు తాను స్వయంగా స్టేషనుకి కారుతీసుకువెళ్ళి ఆమెను తీసుకురావాలనుకుంది. ఆ అమ్మాయి ఎలా ఉంటుందో! ఎలా మాట్లాడుతుందో చూడాలనుకుంది. కాని తాను స్టేషనుకి వెళ్ళటం ఇతనికి ఇష్టంకాదేమో. చెప్పడం మానేశాడు, అనుకుని మౌనంగా ఉండిపోయింది పద్మావతి.

శశి వస్తూందని తెలిసినదగ్గరనుంచీ అన్నపూర్ణమ్మ హడావుడి పడుతూనే ఉంది. ఇవ్వాళ ఏవో ప్రత్యేకమైన వంటలు చేయిస్తూంది. శశికోసం మేడ మీద గది తుడిపించి, అందులో మంచం పక్కా అన్నీ ఏర్పాటు చేయించింది. పిల్లలకోసం ఏవో మిఠాయిలు చెయ్యమని వంటమనిషికి పురమాయించింది. అడుగడుగునా పద్మావతీ అని పిలిచి ఏదో చెబుతూ, ఏదైనా హారన్ వినిపించేసరికి గబగబా పరుగులాటి నడకతో వీధిలోకి వెళ్ళి రోడ్డువైపు చూస్తూ మళ్ళీ వెనక్కి తిరిగివస్తూన్న అన్నపూర్ణమ్మను చూసి నవ్వుకుంటూంది పద్మావతి.

"అది వచ్చే టైమయింది. జడ అల్లుకుని కాస్త శుభ్రమైన చీరకట్టుకో" అంది పద్మావతితో అన్నపూర్ణమ్మ. అంతకు ముందే పాణి ముఖం కడుక్కుని తెల్లని పైజామా వేసుకు కూర్చున్నాడు.

గబగబా జడ అల్లుకుని ముఖం కడుక్కుని వుల్‌వాయిల్‌చీర కట్టుకుని

ముఖానికి పౌడరు అద్దుకుంటూంటే 'పద్మావతీ' పాణి పిలుపు వినిపించింది అతని గదిలోకెళ్ళింది "ఏం? ఎందుకు పిలిచారు?" అంటూ,

"చూడు నా ముఖాన్న పౌడరువత్తుగా ఉందా? తల ఎలా దువ్వుకున్నాను?" అడిగాడు

ఇదివరకు ఆమె చాలాసార్లు తల దువ్వబోయిందతనికి నేదువ్వుకుంటాలే. నువ్వేం ఇలా ఇవ్వు అనేవాడు ముఖాన్న పౌడరు తుడవబోయేది ఎక్కడో చెప్పు నేను తుడుచుకుంటాలె అనేవాడు తాను అతన్ని తాకడం అతని కిష్టం కాదేమో, అని అటువంటి పనులు తాను చేస్తానని అనడం మానేస్తుంది తోటకీ, సినిమాకు, షికారుకు వెళ్లి ఓ చోట ఇద్దరూ కలిసి కూర్చున్నా ఇదివర కటిలా అతను ప్రేమగా నవ్వుతూ మాట్లాడటంలేదు ఎప్పుడూ ఏదో ఆలో చిస్తున్నట్టు కనిపిస్తాడు

"ఏం? చెప్పడం ఇష్టంకాదా! చూడు పౌడరు వత్తుగా ఉంటే తుడిచెయ్యి గుడ్డతో కాస్తపాపిడ సరిగ్గాచేసి దువ్వేయ్ ప్లీజ్ నన్ను తాకాలంటే నీకు!..."

"ఆ...ఇష్టంకాదు అన్నీ నా ఇష్టాలే జరిగిపోతున్నట్టు. అని విసురుగా అతని చేతిలో దువ్వెన లాక్కుంది పద్మావతి

ఆమె పాపిడ్ని తీస్తుంటే తలవంచి ఆమె ఎదురుగా నిల్చున్న పాణి నీఇష్టం నేను కాదన్నదెప్పుడు? పద్మావతీ!" అన్నాడు నవ్వుతూ

"అన్ని ఇష్టాలూ వ్యక్తం చెయ్యలేరు అంది అతని చెంపలమీద పవిటచెంగుతో వత్తుగా ఉన్న పౌడరు తుడుస్తూ

"నిజమే కాని ముఖంలో భావాలు చదవగలిగే అదృష్టవంతుడ్ని కానుగా. అలాంటప్పుడు ఆ ఇష్టం మాటలలో చెప్పకపోతే ఎలా తెలుసుకుంటాను?"

ఆమె ఏదో జవాబివ్వబోయేంతలో అన్నపూర్ణమ్మ ఆ గదిలోకి రావడంతో మౌనంగా ఉండిపోయింది పద్మావతి

తన గదిలోకెళ్ళి ముఖాన తిలకం దిద్దుకుంటూన్న పద్మావతికి కారుహారన్, కాంపౌండులోకి కారు వస్తున్న శబ్దం వినిపించాయి గదికిటికీ చువ్వలు పట్టుకు నిల్చుని, కారులోంచి దిగబోయే వ్యక్తులకోసం ఆత్రతగా చూస్తూంది పద్మావతి

నవ్వుకుంటూ గబగబా కారుదగ్గర కెళ్ళింది అన్నపూర్ణమ్మ వీధి వరం డాలో చేతులు కట్టుకు నిల్చున్నాడు పాణి

డ్రయివరు డోరుతెరవగానే అందంగా బొద్దుగా ఉన్న ఒక అమ్మాయిని ఎత్తు కుని ఒక యువకుడు కారులోంచి దిగాడు ముందుగా

ఎన్నాళ్ళకి చూశా బాబూ! మిమ్మల్ని కళ్ళు కాయలు కాస్తున్నాయి అని వాగు న్నావే తల్లీ? అంటూ అతని చేతిలోని

అమ్మాయిని ఎత్తుకు ముద్దు పెట్టుకుంది అన్నపూర్ణమ్మ

అతని వెనుకే సుమారు తన ఈడు లోనే వున్న యువతి ఒక అబ్బాయిని ఎత్తుకుని దిగింది ఆమె భుజంచుట్టూ చెయ్యివేసి దగ్గరకు తీసుకున్న అన్న పూర్ణమ్మకు మాటలు కరువై సంతోషాతి శయంలో కన్నీళ్ళు చెంపలమీదినుంచి జారిపోయాయ్. అమ్మాయిని దించి ఆమె చేతిలోఉన్న అబ్బాయిని ఎత్తు కుంది

దాసీది ఎర్రనీళ్ళుతెచ్చి శశికీ పిల్లలకూ దిగదుడిచి పారబోసింది.

చేతులు కట్టుకుని వీధిపరండాలో నిల్చున్న పాణిదగ్గరకు ఇద్దరూవచ్చారు. "అన్నయ్యా'' అంటూ పాణిచేతిని పట్టు కుంది శశి

"వచ్చారా అమ్మా" అన్న పాణిగొంతు రుద్ధమైంది ఆమె చేతిని రెండు చేతుల్లో ఆప్యాయంగా పట్టుకున్నాడు

'బావగారూ ! బాగున్నారా?' అంటూ పాణి భుజంమీద చెయ్యివేశాడు రమేష్

"చాలా సంతోషంగా ఉంది బావా ? మీరు అమెరికాలో స్థిరపడిపోతారంటే ఎంత దిగులుపడి పోయానో!" అన్నాడు పాణి అతని చేతిని పట్టుకుంటూ

అంచరూ హాల్లోకి నడిచారు,

గబగబా వంటఇంట్లోకి వెళ్ళి కాఫీలు పట్టించుకొచ్చింది పద్మావతి ట్రేలోని కాఫీ కప్పులుతీసి ఒక్కొక్కరికే ఇస్తోంది

కాఫీ కప్పు తీసుకుంటూ శశీ, రమేష్ కూడా ఈమె ఎవరు అనే సందేహం లోనే పడ్డారు ఎవరో తామెరుగని బంధువై ఉంటుంది అనుకుని అన్న పూర్ణమ్మే పరిచయం చేస్తుందనుకున్నారు కాని ఆమె శశిని ఏవేవో ప్రశ్నలు వేస్తూ సంతోషంగా నవ్వుతూ, పిల్లల్ని ముద్దు పెట్టుకుంటూ పద్మావతి ఉనికినే విస్మ రించింది

పద్మావతి గురించి తీరికగా చెప్పొచ్చులే అనుకున్నాడు పాణి

"ఏదీ బాబుని ఓసారి ఇలా ఇయ్యి." అని శశి చేతులోని బాబుని తీసుకొని పాణి దగ్గరకు వచ్చింది పద్మావతి

ఇదిగో శశికొడుకు ఎత్తుకుంటారా అడిగింది

అతను చేతులు ముందుకు చాపాడు అతని చేతుల్లో బాబునుంచి జాగ్రత్త అం- పద్మావతి

ఆ బాబునెత్తుకొని మృదువుగా హృద యానికి హత్తుకుంటూ, బాబు ఎలా వుంటాడు పద్మావతీ ! అడిగాడు పాణి

"రబ్బరుబొమ్మలా అందంగా, రంగు శశిలా, ముఖం తలా అంతానూ, అన్న గారిలా ఇలా ఇవ్వండి స్నానంచేయించి పౌడరు అద్దుతాను. కొంతమంది పిల్ల లయితే కొత్తవాళ్ళను చూస్తే కయ్ మంటారు శశి పిల్లల కలాంటిదేం లేదు. అంటూ పాణి చేతుల్లోని అబ్బాయిని తీసు కొన్నిట్టశశివైపు చూస్తూ నేనెవరో అని

మీరు ఆశ్చర్య పోతున్నట్టున్నారు. మీ అన్నయ్య గారి వ్యాపార విషయాలు ఆయనకు వివరిస్తూ వుంటాను నా పేరు పద్మావతి అని ఒక్క క్షణం తర్వాత "బాత్‌రూంలో వేడి నీళ్ళున్నాయి స్నానాలు చెయ్యండమ్మా పిల్లలకు నేను చేయిస్తాను" అంది పద్మావతి ఆప్యాయంగా.

ఇదేమిటిలా చెప్పుతూంది ? వాడి పెళ్ళాన్నని చెప్పదు కాబోలు మౌనంగా బుగ్గలు నొక్కుకుని చురుగ్గా పద్మావతి వైపు చూసింది అన్నపూర్ణమ్మ.

పిల్లలిద్దరికీ స్నానాలు చేయించి పౌడరద్ది బట్టలువేసి పాలుపడ్తుంది పద్మావతి ముద్దుగా మాట్లాడే పాప. కొత్తగా బిడియంగా చూసే బాబు ముచ్చటగా ఆ పిల్లలవైపుచూస్తూ శశి ఎంత అదృష్ట వంతురాలు ? చదువూ, సంస్కారం, రూపం, హోదా ఉన్న భర్త అందమైన పిల్లలు అనుకుంది పద్మావతి

"బాబుకి పాలుపట్టావా? పద్మావతీ!" అన్నయ్య ఆఫీసు పనులే కాక ఇంటి పనులు చేస్తూ ఉంటావన్నమాట నీకెంత జీతం ఇస్తారు ? స్నానంచేసి తల తుడుచుకుంటూ ఆ గదిలోకి వచ్చిన శశి ప్రశ్నించింది పద్మావతిని

"అవునమ్మా! జీతానికేముంది ? ఈ ఇంట్లోనే కదా ఉంటాను దా తల తుడి చేస్తాను" అని చనువుగా శశి చేతిలోని టవలు తీసుకొని ఆమె తల తుడిచింది పద్మావతి ,

"ఎన్నాళ్ళయి ఈ ఉద్యోగంలో కుదిరావు ?" అడిగింది శశి

"రెండు సంవత్సరాలు కావస్తూంది" పొడిగా జవాబు చెప్పింది పద్మావతి

"ఏం చదివావు ?" శశి ప్రశ్న

"స్కూలు ఫైనలు"

"తలిదండ్రులున్నారా?"

తల అడ్డంగా ఊపింది

"అక్కలూ, అన్నలూ..."

"లేరు"

"పెళ్ళయినట్టుందే!"

"అయింది"

"అతనేం చేస్తూంటాడు ?"

"ఏమీ చెయ్యలేరు"

"ప్చ్ పాపం. అందుకా నువ్వీ ఉద్యోగంలో చేరావు రాత్రిపూట ఇంటికి వెళ్ళిపోతూంటావా?"

"ఏమిటమ్మా నీ ప్రశ్నలూ ?" అని పక్కున నవ్వేసింది పద్మావతి

తానూ నవ్వి "పిల్లల్ని కాస్సేపు ఆడిస్తావు కదూ ?"

"అలానె పై గదిలోకి వెళ్ళి రెస్టు తీసుకో"

"పాపా నీ పేరేమిటి?" అడిగింది పద్మావతి ఆ అమ్మాయి తల దువ్వుతూ ఉష నిన్నేమని పిలవాలి ? పద్మావతీ ! అనా ?ప్రశ్నించింది ఉష

"అత్తా! అని పిలు"

"అంటే, నాన్నగారి ఇంకో చెల్లెలువా ?"

''అవును'' నవ్వింది పద్మావతి.

"మా తమ్ముడు పేరు చందు. ఉత్త మొద్దు" అంది ఉష.

''మొద్దు కాదు. తప్పు అలా అన కూడదు, మంచివాడు," అంది పద్మావతి తర్వాత పిల్లలకూ శశికీ టిఫిను ప్లేట్లు ఇచ్చింది అన్నపూర్ణమ్మ

ఆ రాత్రి అందరూ కలసి సరదాగా భోజనాలు ముగించిన తర్వాత "బావా, శశీ! నా గదికి ఓ సారి వస్తారా ? మీకో చిన్న కథ చెబుతాను" అన్నాడు పాణి

తన అత్తగారు అనుమానిస్తూన్న యువతి ఈ పద్మావతి మంచిదానిలానే కనుపిస్తూంది కాని, అన్నయ్యతో ఆమెకు బాగా చనువులానె ఉంది. అదె లాటి చనువు ఈమెనే ఉద్యోగంనుంచి తొలగించి, పెళ్ళిచేసుకోమనీ, చెప్పాలి అన్నయ్యకు అస్సలు అన్నయ్యకు పెళ్ళిచేసేవరకూ ఈ ఇంటి నుంచి కదలకూడదు, అనుకుంది శశి

రంగారావు పద్మావతి విషయం చెప్పిన దగ్గరనుంచీ, ఇప్పటివరకూ జరిగినదంతా క్లుప్తంగా చెప్పి, "బావా వర్కర్సంతా మాయా మోసం చెయ్యడం నేర్చుకున్నట్లనిపిస్తూంది మీరే ఈ వ్యాపార విషయాలు చూసుకుంటే!" అన్నాడు లౌక్యంగా పాణి

అతను తేలిగ్గా నవ్వి ''ఆమె చూస్తారుగా! అవసరముంటే నాకు ఉత్తరం వ్రాస్తే వస్తూంటాను కంగ్రాచ్యులేషన్స్. గుడ్ న్యూస్" అని పాణి చెయ్యి పట్టి సంతోషంగా ఊపాడు రమేష్.

"ఆమె నీ దగ్గర ఉద్యోగం చేసేదీ అనుకుని ఏమేమో ప్రశ్నించాను నాకీ విషయాలు ముందుగా ఉత్తరంలో ఎందుకు వ్రాయలేదు ?'' నిష్ఠురంగా అడిగింది శశి

'ఇంత కథ ఏం వ్రాస్తాను ఉత్తరంతో పోనీ క్షమించమ్మా! నిజంగా నీకు ముందుగా తెలియజెయ్యాల్సింది.'' అన్నాడు పాణి

'ఆమె కూడా ఎంత గడసరితనంతో ప్రశ్నలకు జవాబు చెప్పారు! అంది' శశి

"ఏవేం ప్రశ్నలు వేశావు?" నవ్వుతూ అడిగాడు పాణి

తానడిగిన ప్రశ్నలూ, ఆమె చెప్పిన జవాబులూ చెప్పి, ఉండు ఉద్యోగం మానేసి వెళ్ళిపొమ్మంటాను అప్పుడేమంటారో! అని గబగబా పద్మావతి ఉన్న గదిలోకి వచ్చింది శశి

టేబులు ముందు కుర్చీలో కూర్చుని, ఏదో పుస్తకం తిరగవేస్తూన్న పద్మావతికి ఎదురుగా వచ్చి నిల్చుని 'పద్మావతీ' పిలిచింది శశి (సశేషం)

Printed and Published by A Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press Public Garden Road, Hyderabad-500001 Editor A SUDHAKARA RAO

